# సంస్కృత వ్యాకరణ ప్రకాశిక

తెలుగులో

శ్రీ కె.వి. కృష్ణమాచార్యులు

# సంస్కృత వ్యాకరణప్రకాశిక
## (తెలుగులో)

రచయిత
కె. ఎ కృష్ణమాచార్యులు, ఎమ్.ఎ.,
విద్యాప్రవీణ, భాషాప్రవీణ
లెక్చరర్ సంస్కృతశాఖ, ఎ.యు వాల్తేరు.



గంగాధర పబ్లికేషన్స్
విజయవాడ - 520 002

ప్రథమ ముద్రణ ఫిబ్రవరి 1976
ద్వితీయ ముద్రణ ఆగష్టు 1978
తృతీయ ముద్రణ జనవరి 1981
చతుర్థ ముద్రణ అక్టోబర్ 1990



Rs. 90-00



ప్రచురణకర్త
కె మురళీకృష్ణ



డిస్ట్రిబ్యూటర్స్
**క్వాలిటీ పబ్లిషర్స్**
రామమందిరం వీధి, విజయవాడ-2

ముద్రణ
జగదీష్ పేపర్ ప్రొడక్ట్స్ (ప్రై) లిమిటెడ్ విజయవాడ-10

**M. R. APPAROW, M.A.,**
*Vice-Chancellor*

**Andhra University,**
**Waltair,**
*Visakhapatnam - 530 003*

*Dt. 26—4—1976*

# శుభాశంసనము

శ్రీ కృష్ణమాచార్యులుగారు గురుకులక్లిష్టులై సంస్కృత శాస్త్రాలు చక్కగా అభ్యసించి చాలాసంవత్సరాలుగా మా విశ్వకళాపరిషత్తులో అధ్యాపనం చేస్తూ మంచి ప్రవచన ప్రవీణులని అనిపించుకున్నారు.

వారి బహుకాలప్రవచన ఫలితంగా, కఠోరపరిశ్రమ ఫలితంగా ఈ 'సంస్కృత వ్యాకరణప్రకాశిక' అనే గ్రంథం వెలసింది.

ఈనా డిటువంటి గ్రంథంయొక్క అవసరం సంస్కృత విద్యార్థుల కెంతైనా వున్నదనీ, దాని ప్రణాళిక పటిష్ఠంగా ఉన్నదనీ, గ్రహించి సంతోషించాము.

శ్రీ ఆచార్యులుగారికి నా శుభాశంసనములు.

(సం) యమ్. ఆర్. అప్పారావు

## SRI VENKATESWARA UNIVERSITY

*Professor*
*K. Satchidananda Murty*
*Vice-Chancellor*

*Tirupati - 517 502*
*Andhra Pradesh*
*20 March 1976*

## FOREWORD

Shri K A Krishnamachayulu is a scholar who after mastering Sanskrit and Telugu in the traditional way took the Master s degree in Sanskrit For many years now he has been a lecturer in Sanskrit and Telugu in the University College at Wa tair and then at the P G. Centre, Guntur

Shri Acharyulu is one of the best teachers I have come across He is lucid and clear in his exposition well versed in Vyakarana and devoted to his subject I cannot think of any University teacher with greater integrity, nor can I name another person who is so aloof from all non-academic matters

I am g ad he has written a grammar of Sanskrit in Telugu for the sake of University students His book is based upon h s deep acquaintance of Pan niya Vyakarana as we l as the works of Dr R G Bhandarkar H s own long teaching experience has enab ed him to wr te in the way best suited for the Te ugu-speaking students I hope h s book wi serve the needs of Telugu-speak ng peop e who are study ng for their h gher degrees

*(Sd ) K SATCHIDANANDA MURTY*

**Prof G J SOMAYAJI, Vidwan, M A, L.T,**

*Chairman [Retd]*

**Commission for Scietific and Techical Termino ogy,**
**M nistry of Education NEW DELHI**

*Head of the Dept of Telugu Andhra University [Retd]*

*Formerly*
*Chairman, (Academic Sub-Committee)*
*Board of Governors*
*Telugu Academy Hyderabad*

*PRABHATAM*
*Official Colony*
*Visakhapatnam-2*
*Date 14-3-1976*

# పీఠిక

శ్రీ కృష్ణమాచార్యులుగారు ఎమ్ ఏ తరగతిలో ఆంధ్రవిశ్వకళా పరిషత్తు తెలుగు విద్యార్థులకు, సంస్కృతమును బోధించుచున్నారు. వారి యనుభవము పాండిత్యము, ప్రామాణికత్వము ఈ గ్రంథమున నున్నవి.

దేశభాషలను చక్కగా వశపరచుకొనుట సంస్కృత భాషావ్యాకరణముల పరిచయములేక సాధ్యపడదు అట్టి జ్ఞానమును విద్యార్థులలో కలిగించుటకు, సంస్కృతోపాధ్యాయునకు సంస్కృతభాషాపాటవము మాత్రమేగాక అందలి వ్యాకరణమునందలి ప్రాచీన, నవీన ప్రణాళికలు గూడ సమగ్రముగా తెలిసినంగాని సుకరము గాదనుట నా యనుభవము.

సంస్కృతభాష అనంతమయిన మహాసముద్రమువంటిది అందలి ప్రాచీన వ్యాకరణమార్గములు సువిశాలములు మాత్రమేగాక భిన్నములయిన ప్రణాళికలను గలవి సర్వంకషమైన వివరణమును సంపాదింపవలయునని ప్రాచీనుల యాశయము అట్టి వివరణములలో పాణినీయమొక రాచబాట. ఇతరము లనేకము లున్నవిగాని అవి అప్రసిద్ధములు · మనకు అందుబాటులో లేనివి ఎం ఏ తెలుగు విద్యార్థులకు గావలసిన విషయములు - సంస్కృత వాక్యరచనాప్రణాళిక, విభక్తి, వివేకము శ్లోకము నన్వయము చేసికొనగల శక్తి నలవరచుకొనుట, స్వతంత్రముగా వాక్యరచన చేసికొని భావమును తెలుపుట ఇంతమాత్రము జ్ఞానమునకు పాణినీయమునందలి కృత్తద్ధిత సమాస ధాతు వృత్తులతోడి పరిపూర్ణ

పరిచయము అవసరములేని కారణము అనేకులను ప్రాచీన సంస్కృత శాస్త్రపండితులను నే నెరుగుదును వారికి సంస్కృతభాషాజ్ఞానములో కొరతలేదు. శాస్త్రపరిభాష పరిపూర్ణముగ నుండినది. కాని, వాక్యరచన గాని, వాడుగ వాక్యములను సామాన్య దైనిక విషయములనుగూర్చి చెప్పుటగాని వారికి అలవాటులేని వని ఈ పనికి అలవాటు విద్యార్థులలో కలిగించుటకు అనుసరింపవలసిన విధానము వేరు వ్యాకరణము అనగా లక్షణజ్ఞానము మాత్రముగాదు లక్ష్యము అనగా కావ్యరాశిని వశపరచు కొనుటమాత్రమునుగాదు ఈ రెండు మార్గములలో నేదో యొకదాని యందు పరిపూర్ణతయుగాదు. ఈ రెంటియొక్క సమన్వయముతోకూడిన జ్ఞానము కొంతయైనను వారి అవసరములకు సరిపడునంతటి పరిధిలో కల్పింపవలెను ఇట్టిపనికి (Grammatical readers) రచనను అలవాటు చేసుకొనుటకు వలసిన యభ్యాసములతోకూడిన ప్రశ్నలు, సమాధానములు, లక్ష్యలక్షణములను జతపరచి యుంచిన పాఠ్యగ్రంథములు గావలెను

ఇంకొక విషయ మేమనగా మనకు పాఠ్యములయిన భండార్కరువారి వ్యాకరణపాఠములు మిక్కిలి ఉపయోగకరములు. అయినను అవి ఆంగ్లములో నున్నవి మనకు ఆంగ్లమురాదు సంస్కృతమును రాదు రెండును నేర్చుకొనవలసినవే అప్పుడు ఈ రెండింటిలోను నే యొక్కటి యైనను రెండవదాని సాయమున సాధ్యముగాదు కాబట్టి మనకు పరిచితము లయిన భావములను సంస్కృతములో వ్రాయుటకు నేర్పు మార్గములను చూపించు గ్రంథములు తెనుగున రావలెను

అట్టి వాటిలో కొన్ని మనకు లభించుచున్నవి మనకు లభించు సంస్కృత శబ్దమంజరి, సమాస కుసుమావళి, ధాతుస్వరూపసరణియు కొంతవరకు ఉపయోగపడగలవు కాని అవి చాలనంతమాత్రమేగాదు, అవి సులభముగా బోధపడవు గ్రహించుటకుగాని, ధారణచేయుటకుగాని కష్టముమీద పీలగును ఇక తెలుగులోనున్నవి నేను చూచినవి రెండు గ్రంథములు గలవు ఒకటి శ్రీ సన్నిధానమువారు ప్రచురించిన తత్త్వమ చంద్రిక అది అనేకవిషయ సంభరితము కేవలము కోశములవలె తెలియని విషయములను మాత్రము తెలిసికొన నుపయోగింప ననువైనది గ్రహణధారణములకు మిక్కిలియయిన ప్రామాణిక ప్రయోజనముల

కుపయోగపడునది. ఇంతకును అది పునర్ముద్రణము చేయవలసిన గ్రంథ మనివారు. ఇది సత్యమే కావచ్చును. అట్టి యుత్తమ గ్రంథముల యుపయోగమును గ్రహించి ప్రచురించు సంస్థ లింకను కలుగలేదు కాబోలును. సంస్కృతవ్యాకరణసంగ్రహము, అను గ్రంథము శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు వ్రాసినది తెలుగు అకాడమీవారు ముద్రించి యున్నారు. ఇది తెలుగున నందు ప్రామాణిక గ్రంథము గావున తప్పక ప్రయోజనకారి కాగలదు కాని దానియందు ప్రాచీన వ్యాకరణములవలె సకృత్తుగా పేర్కొనబడిన లక్ష్యైకదేశములేగాని అనేకలక్ష్యములతోకూడి రచనాభ్యాసమునకు అనువైన ప్రశ్నలు, సమాధానములు మొదలైనవానితో కూర్చి భండార్కరుగారి గ్రంథము ప్రణాళికతో వ్రాయబడలేదు. ఇంకను ఏవో కొన్ని సంస్కృతవ్యాకరణ ములు తెలుగులో నున్నవని వినుచున్నాను వానిని చూచుటకుగాని పరిశీలించుటకుగాని అవసరమును, అవకాశమును నాకు కలుగలేదు.

ఇక ఆచార్యులవారు వ్రాసిన యీ గ్రంథము పైరీతిని సంస్కృత భాషాభ్యాసకుల కనువయిన మార్గమున రచింపబడినది. ఇది భండార్కరు గారి పద్ధతి. వారు స్వోపజ్ఞములయిన ప్రసక్తోదాహరణములను మాత్రమే గాక ప్రాచీన సంస్కృత వాఙ్మయమున మహాకవి విరచితములయిన యుత్తమ సూక్తులను సంగ్రహించి అనువయిన యెడల చేర్చియున్నారు. ఇది చాల ప్రయోజనకరము. అట్టి ప్రామాణికవచనములు, శబ్దమును, అర్థమును సప్రమాణముగా జతపరచి ధారణచేయుట కనువుగా నుండి విద్యార్థిమనమున కోశరత్నములవలె ప్రకాశించుచు మార్గదర్శకములయి అమూల్యములుగా శోభించుచున్నవి అట్టి మార్గమునే శ్రీ ఆచార్యులవారు అనుసరించిరి

ఈ గ్రంథము మిక్కిలి ప్రయోజనకరము గావున దీనిని పాఠ్యగ్రంథ ముగా నిర్ణయించి, నిర్ణాయకసభ్యులు భాషాబ్ధితరణమున కుపయోగించు పాత్రముగా నిరూపించవలెను.

గ్రంథ రచయితయైన ఆచార్యులు గారికిని అభ్యాసకులయిన విద్యార్థు లకును నా ఆశీస్సులు.

శుభము

విశాఖపట్టణము,
14 - 3 - 76.

(సం) విద్వాన్ సోమయాజి

# కృతజ్ఞతాభివందనములు

*

తమ అమూల్యాభిప్రాయములతో...

శుభాశంసనముల నందజేసిన -

సహృదయ సార్వభౌములు

శ్రీ యమ్ ఆర్ అప్పారావు మహోదయులకు ;

మున్నుడి దయచేసిన -

ప్రాజ్ఞపారిషదులు, ఆచార్య

శ్రీ కె సచ్చిదానందమూర్తి మహోదయులకు

పీఠికను ప్రసాదించిన -

పండితవరమేశ్వరులు, 'భాషాచరిత్రచతురానన'

బిరుదాంచితులు, ఆచార్య

శ్రీ జి జె సోమయాజి మహోదయులకును



కృతజ్ఞతాసహకృత

ప్రణామాంజలులు

ఇట్లు,

రచయిత

'ఓం నమః పాణిని కాత్యాయన పతఞ్జలిభ్యః'

# మనవి

ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఎమ్ ఏ తెలుగు విద్యార్థులకు చిరకాలముమండి మహామహోపాధ్యాయ శ్రీ రామకృష్ణగోపాల భండార్కరుగారి సంస్కృతవ్యాకరణములు పాఠ్యపుస్తకములుగనున్నవి అవి విశిష్టమగు ప్రణాళికతో రచింపబడినట్టి ఉత్తమ గ్రంథములను విషయము సర్వసమ్మతము కాని ఆ గ్రంథములను చదివి నిర్దుష్టముగ అవగతము కావించుకొని కృతార్థతను పొందుటలో కొంత కష్టముకూడ లేకపోలేదు దానికి హేతువులు - విషయము నూతనమగుట, దానిని వివరించుభాష విదేశీయమగుట, విద్యార్థులు పరీక్షలలో ఆ విషయములను తెలుగులో వ్రాయవలసివచ్చుట మున్నగునవి

నేను ఎమ్ ఏ తెలుగు విద్యార్థులకు సంస్కృతమును బోధింప నారంభించినపుడే తెలుగులో సంస్కృతభాషావ్యాకరణముల జ్ఞానము కలిగించు పుస్తకమున్నచో మిక్కిలి ఉపయోగముండునను తలంపు కలిగినది వారు అంతకుముందే ఆంధ్రభాషా వ్యాకరణరీతులను కొన్నింటిని తెలిసికొని యుండువారగుటచే వారికి తగిన పద్ధతిలో వ్యాకరణ జ్ఞానపురస్సరముగ సంస్కృతభాషాజ్ఞానమును కలిగింపగలుగు గ్రంథము నొకదానిని తెలుగులో రచింప సంకల్ప మేర్పడినది. దాని ఫలితమే యీ గ్రంథము

సంస్కృతభాషలోని పదజాలము సుబంత తిఙంత భేదముచే ద్వివిధము సామాన్యముగా ప్రతిపదమునందు ప్రకృతి, ప్రత్యయము

అను రెండుభాగములందును. సుబంతములందలి ప్రకృతులు ప్రాతిపదికము అవి కృదంత, తద్ధితాంత, సమాస, కేవల ప్రాతిపదిక భేదములచే నాల్గురకములు

వానికి ఏడువిభక్తులలో, మూడు వచనములలో సుప్ ప్రత్యయములుచేరి సుబంతరూపము లేర్పడును తిఙ్ ప్రత్యయములు ధాతువులకు చేరును వానిలోకొన్ని కేవలధాతువులు, కొన్ని సనాది ప్రత్యయాంత ధాతువులు ఆ ధాతువులన్నింటికిని పది లకారములలో తిఙంతరూపము లేర్పడును ఆ పది లకారములకు చేరు తిఙ్ ప్రత్యయములను పరస్మైపదాత్మనేపద భేదముచే ద్వివిధములు ఒక్కొక్క లకారములో మరల మూడు పురుషములలో, మూడు వచనములలో తిఙ్ ప్రత్యయములుచేరి తిఙంతరూపము లేర్పడును ఇట్టి విషయ విభాగములతో పదస్వరూప నిష్పత్తి ప్రకారము వివరింపబడినది

ప్రతిపాఠమునకు మొదటిపదముల నిష్పత్తి ప్రకారము, పిమ్మట ఉదాహరణములకై కొన్ని వాక్యములు ఆ వాక్యములకు ముందు అందలి అపరిచితపదములు - అనగా వాని యర్థముగాని, లింగముగాని పరిచితము కానివి ఆ వాక్యముల తరువాత అందలి సంధి విశేషములు, కారక విశేషములును వివరింపబడినవి పాఠముల చివర ఆ పాఠముల లోని విషయములను పునశ్చరణ కావించుకొనుటకు వీలుగ అభ్యాసములు పేర్కొనబడినవి కాని మొదటి కొన్నిపాఠములకు మాత్రమే యిట్టి పద్ధతి ననుసరించి, తక్కినవానికి ఆ మార్గమున విద్యార్థులే స్వయముగ అట్టి అభ్యాసములను కల్పించుకొనవలెనని, ఇతర పాఠ్యగ్రంధములను లక్ష్యములుగా గ్రహించి లక్షణ సమన్వయము కావించుకొనవలెననియు తలంచి చివరిపాఠములకు అభ్యాసములుగాని, వాక్యప్రయోగములుగాని ఒసంగబడలేదు అందు పదస్వరూపవివరణము మాత్రమే చేయబడినది.

పాణినీయ స్వరూపస్వభావములుకూడ కొంత తెలియవలెననెడి యాశయముతో అచ్చటచ్చట కొన్ని ప్రత్యాహారములు, కొన్ని సూత్రములను యథాతథముగనే యొసంగబడినవి కాని యా సూత్రములకు శాస్త్రీయపద్ధతిలో అర్థబోధకావించుటకై ప్రయత్నము చేయక భావార్థము మాత్రమే వివరింపబడినది సుఖబోధనమునకై కొన్నిచోట్ల పాణినీయములోగల పద్ధతులను విడచి ఆధునిక పద్ధతులవలంబింపబడినవి. రూపనిష్పత్తి నెఱుంగుటకు ఆవశ్యకములయిన సూత్రములు, ఈ గ్రంథమునందున్న ఆ సూత్రముల క్రమసంఖ్యచే పేర్కొనబడినవి

ధాతువులకు పెక్కింటికి, గణనిర్దేశము అర్థవివరణమును ఆయా పాఠములందే కావింపబడినది కాని ప్రేరణార్థకములను, అర్ధధాతుకములను వివరించునపుడు ఉదాహరణములుగ నీయబడిన ధాతువుల తిఙంత రూప నిష్పత్తికి వాని గణనిర్దేశముగాని, అర్థవివరణముగాని యనపేక్షితమగుటచే అట్టివానికి మాత్రము ఆ వివరములు చివర అనుబంధములో పేర్కొనబడినవి అట్లే ఆ యా పాఠములలో వివరింపబడని మరికొన్ని విషయములుకూడ ఆ యనుబంధములోనే వివరింపబడినవి

విశేషశబ్దముల సుబంతరూపములు అనుగమకము కాకపోవుటచే ఇందు వివరింపబడలేదు వానిని శబ్దమంజర్యాదులవలన గ్రహింతురుగాత

నా యీ రచనకు శ్రీ భండార్కరుగారి గ్రంథముల బోధనానుభవమే మూలమనక తప్పదు అట్టి తమ గ్రంథముల మూలమున నా కీ యనుభవమును కలిగించిన శ్రీ భండార్కరుగారికి, ఈ గ్రంథ రచనలో ఎడనెడ కలుగు సందేహములను తీర్చి సహకరించిన గురుకల్పులు బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారికి, ఈ గ్రంథ

రచనమునకు ముద్రణమునకును అన్నివిధములుగ ప్రోత్సహించిన ఆచార్య శ్రీ యస్వీ జోగారావుగారికి, ఈ గ్రంథముద్రణమునకు రూపమును కల్పించుటయేకాక ముద్రణసమయములో అమూల్యములగు సలహాల నొసంగిన డాక్టర్ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి, ప్రథమ ద్వితీయ తృతీయ ముద్రణలను కడు ప్రయాసతో ప్రచురించిన ప్రకాశకులు శ్రీ కప్పగంతుల మురళీకృష్ణగారికి, ముద్రణకర్తలకును నా కృతజ్ఞతా పరంపరలు

నా యీ రచనయందు స్పష్ట ప్రతిపత్తికై కొన్నిచోట్ల సమాస మధ్యమునందుకూడ సంధి చేయబడలేదు



'కాయేన వాచా మన సేన్ద్రియైర్వా, బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్<br>
కరోమి యద్యత్ సకలం పరస్మై, నారాయణాయేతి సమర్పయామి '



# విషయసూచిక

పాఠ సంఖ్య — విషయము - పుటసంఖ్య

శ్రీః

# ప్రథమః పాఠః – మొదటిపాఠము

## తిఙన్తములు

---

(వర్తమానార్థకము—పరస్మైపదము)

సంస్కృతభాషలోని పదములను ముఖ్యముగా సుబన్తములు తిఙన్తములు—అని రెండురకములుగా విభజింపవచ్చును

సూ - 1 సుప్తిఙన్తం పదమ్ (పా సూ) = సుబంతము, తిఙంతము పదమనబడును

వసతి = నివసించుచున్నాడు (ఏకవచనము)
వసతః = (ఇద్దరు) నివసించుచున్నారు (ద్వివచనము)
వసన్తి = నివసించుచున్నారు (బహువచనము)

(సంస్కృతభాషలో మూడు వచనములు గలవు—ఏకవచనము, ద్వివచనము బహువచనము.)

ప్రతి పదమును సామాన్యముగా ప్రకృతి ప్రత్యయముల కలయికచే ఏర్పడును పదమునందలి మొదటిభాగము ప్రకృతి. చివరి భాగము ప్రత్యయము. క్రియాపదములందలి ప్రకృతిని ధాతువందురు. ప్రత్యయమును తిఙ్ ప్రత్యయము అందురు. తిఙ్ ప్రత్యయము అంతమందుగల పదములగుటచే వానికి 'తిఙన్తములు' అని పేరు.

పై క్రియాపదములలో 'వస్' అనునది ధాతువు తి, తః, అన్తి- అనునవి ప్రథమపురుష తిఙ్ ప్రత్యయములు

వస్+అ+తి=వసతి వస్+అ+తః=వసతః వస్+అ+అన్తి=వసన్తి.

వీనిలో ధాతువునకు తిజ్ ప్రత్యయమునకు నడుమ 'అ' అను వర్ణము అధికముగా కన్పట్టుచున్నది దానిని వికరణ ప్రత్యయము అందురు

సూ - 2 మొదటి భాగమునందలి ధాతువులకు తిజ్ ప్రత్యయములకును నడుమ 'అ' అను వికరణ ప్రత్యయము చేరును

(సంస్కృతభాషలోని ధాతువులు పది గణములుగా విభజింపబడినవి )

సూ - 3 అతోగుణే (పా సూ) = అపదాంతమగు అకారమునకు ప్రత్యయముయొక్క అకార ఏకార ఓకారములు పరమగునపుడు పరరూపము ఏకాదేశముగవచ్చును (అనగా అట్టిచోట్ల ప్రత్యయముయొక్క అకార, ఏకార, ఓకారములు నిలిచియుండి దానిముందున్న అకారము లోపించునని భావము )

వస్+అ+అన్తి=వసన్తి

మొదటి గణము నందలి కొన్ని ధాతువులు -

వస్ - నివాసే=నివసించుట

వద్ - వక్త్యాయాం వాచి=పలుకుట చెప్పుట

రక్ష్ - పాలనే=రక్షించుట

పత్ - గతౌ=పడుట

చర్ - గతౌ, భక్షణే చ=సంచరించుట, మేయుట

జీవ్ - ప్రాణధారణే=జీవించుట

త్యజ్ - హానౌ=విడచుట

దహ్ - భస్మీకరణే=కాల్చుట

నమ్ - ప్రహ్వత్వే=నమస్కరించుట

చల్ - కమ్పనే=చలించుట, కదలుట

విన్ద్ - లుబ్ధాయామ్=విందించుట. విన్దతి
వర్ - వ్యక్తాయాం వాచి=చదువుట వరతి
క్రీడ్ - విహారే=ఆడుట. క్రీడతి
ఖేర్ - చలనే=అరుట ఖేలతి
కాంక్ష్ - కాంక్షాయామ్=కోరుట. కాంక్షతి
వాఞ్ఛ్ - ఇచ్ఛాయామ్=కోరుట వాఞ్ఛతి
ఖాద్ - భక్షణే=తినుట. ఖాదతి
ఫల్ - నిష్పత్తౌ, విశరణే చ=ఫలించుట, పండుట. ఫలతి
అట్ - గతౌ=తిరుగుట, పర్యటించుట. అటతి
జల్ప్ - వ్యక్తాయాం వాచి=వాగుట, దంబములు పలుకుట జల్పతి

| పుంలింగము | స్త్రీలింగము | నపుంసకలింగము |
|---|---|---|
| సః=అతడు | సా=ఆమె | తత్=అది |
| తౌ=వారిద్దరు | తే=వారిద్దరు (స్త్రీలు) | తే=అవి రెండు |
| తే=వారు | తాః=వారు (స్త్రీలు) | తాని=అవి. |

సూ - 4 శేషే ప్రథమః (పా సూ) = యుష్మదస్మచ్ఛబ్దరూపములు కాక తక్కిన పదములు కర్తృవాచకములుగా ఉన్నప్పుడు క్రియా పదము ప్రథమ పురుషయందుండును

సః వసతి=అతడు నివసించుచున్నాడు.
తౌ వసతః=వారిద్దరు నివసించుచున్నారు.
తే వసన్తి=వారు నివసించుచున్నారు.

(ఈవిధముగనే పై ధాతువు లన్నింటికి ప్రథమపురుష క్రియాపద రూపములను వాని ప్రయోగములను అభ్యాసము చేయువది)

సంస్కృతభాషలో క్రియాపదరూపములు మూడు లింగము యందును సమానముగనే యుండును

సా వసతి=ఆమె నివసించుచున్నది.

తే వసతః=వారిద్దరు (స్త్రీలు) నివసించుచున్నారు.

తాః వసన్తి=వారు (స్త్రీలు) నివసించుచున్నారు

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది —

వారు చెప్పుచున్నారు
వారు రక్షించుచున్నారు
అవి పడుచున్నవి
అతడు సంచరించుచున్నాడు
అతడు జీవించుచున్నాడు
ఆమె త్యజించుచున్నది
వారిద్దరు దహించుచున్నారు
వారిద్దరు నమస్కరించుచున్నారు
అవి చలించుచున్నవి
వారు నిందించుచున్నారు
వారిద్దరు పఠించుచున్నారు
వారిద్దరు ఆడుచున్నారు
ఆమె వాంఛించుచున్నది
వారిద్దరు తినుచున్నారు
అవి ఫలించుచున్నవి
వారు కాంక్షించుచున్నారు
వారు పర్యటించుచున్నారు
వారు వాగుచున్నారు.

## మధ్యమ పురుష

వససి=నివసించుచున్నావు
వసథః=(మీరిద్దరు) నివసించుచున్నారు
వసథ=(మీరు) నివసించుచున్నారు

ఈ పదములలో సి, థః, థ - అనునవి మధ్యమ పురుష తిఙ్ ప్రత్యయములు

వస్+అ+సి=వససి , వస్+అ+థః=వసథః వస్+అ+థ=వసథ

త్వమ్=నీవు , యువామ్=మీరిద్దరు , యూయమ్=మీరు (యుష్మచ్ఛబ్దరూపములు మూడు లింగములయందును సమానముగనే యుండును )

సూ - 5 యుష్మద్యుపపదే సమానాధికరణే స్థానిన్యపి మధ్యమః (పా సూ)=యుష్మచ్ఛబ్దరూపములు (అనగా త్వమ్, యువామ్, యూయమ్ - అనునవి) కర్తృవాచకములుగా నున్నపుడు క్రియాపదము మధ్యమపురుషయం దుండును

త్వం వససి=నీవు నివసించుచున్నావు
యువాం వసథః=మీ రిద్దరు నివసించుచున్నారు
యూయం వసథ=మీరు నివసించుచున్నారు

(ఈవిధముగనే పై ధాతువు లన్నింటికి మధ్యమపురుష క్రియాపద రూపములను, వాని ప్రయోగములను అభ్యాసము చేయునది )

సూ - 6 మోఽనుస్వారః (పా సూ) = పదాంత మకారమునకు హల్లు పరమగునపుడు అనుస్వారాదేశము వచ్చును

ఉదా - త్వమ్+వససి=త్వం వససి

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది .—

మీరు చెప్పుచున్నారు
నీవు రక్షించుచున్నావు

మీ రిద్దరు పడుచున్నారు
మీరు సంచరించుచున్నారు
నీవు జీవించుచున్నావు
మీరిద్దరు దహించుచున్నారు
నీవు త్యజించుచున్నావు
మీరు నమస్కరించుచున్నారు
మీరిద్దరు చలించుచున్నారు
నీవు నిందించుచున్నావు
మీరు పఠించుచున్నారు
మీరిద్దరు ఆడుచున్నారు
నీవు వాంఛించుచున్నావు
మీరిద్దరు తినుచున్నారు
మీరు కాంక్షించుచున్నారు
మీరు పర్యటించుచున్నారు
మీరిద్దరు వాగుచున్నారు

## ఉత్తమ పురుష

వసామి=నివసించుచున్నాను
వసావః = (మే మిద్దరము) నివసించుచున్నాము
వసామః=నివసించుచున్నాము

ఏవిలో మి, వః, మః - అనునవి ఉత్తమపురుష తిఙ్ ప్రత్యయములు

సూ - 7 అతో దీర్ఘో యఞి (పా సూ) = మకార వకారాదులగు తిఙ్ ప్రత్యయములు పరమగునపుడు అకారమునకు దీర్ఘము వచ్చును

వస్+అ+మి=వసామి వస్+అ+వః=వసావః, వస్+అ+మః=వసామః.

అహమ్=నేను ఆవామ్=మేమిద్దరము ; వయమ్=మేము

(అస్మచ్ఛబ్ది రూపములు మూడు లింగములయందును సమానముగనే యుండును)

సూ - 8 అస్మద్యుత్తమః (పా సూ) = అస్మచ్ఛబ్ది రూపములు (అనగా- అహమ్ ఆవామ్, వయమ్ అనునవి) కర్తృవాచకములుగానున్నపుడు క్రియాపదము ఉత్తమపురుషయం దుండును.

అహం వసామి=నేను నివసించుచున్నాను

ఆవాం వసావః=మే మిద్దరము నివసించుచున్నాము

వయం వసామః=మేము నివసించుచున్నాము

(ఈవిధముగనే పైధాతువు లన్నింటికి ఉత్తమ పురుష క్రియా పద రూపములను, వాని ప్రయోగములను అభ్యాసము చేయునది.)

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది —

నేను చెప్పుచున్నాను

నేను రక్షించుచున్నాను

మే మిద్దరము పడుచున్నాము

మే మిద్దరము సంచరించుచున్నాము

మేము జీవించుచున్నాము

మేము త్యజించుచున్నాము

నేను దహించుచున్నాను

మే మిద్దరము నమస్కరించుచున్నాము

మేము చలించుచున్నాము

నేను నిందించుచున్నాను

మే మిద్దరము పఠించుచున్నాము
మేము ఆడుచున్నాము
మే మిద్దరము కాంక్షించుచున్నాము
నేను తినుచున్నాను
మేము వాంఛించుచున్నాము
నేను పర్యటించుచున్నాను
మేము వాగుచున్నాము

మొదటిగణము నందలి మరికొన్ని ధాతువులు —

భూ - సత్తాయామ్=ఉండుట, అగుట — భవతి
జి - జయే, అభిభవే చ=ఉత్కర్షను పొందుట జయించుట — జయతి
స్మృ - చిన్తాయామ్=స్మరించుట — స్మరతి
క్షి - క్షయే=క్షీణించుట — క్షయతి
సృ - గతౌ=కదలుట ప్రాకుట — సరతి
తౄ - ప్లవన తరణయోః = ఈదుట దాటుట — తరతి
కృష్ - విలేఖనే=దున్నుట, లాగుట — కర్షతి
వృష్ - సేచనే=వర్షించుట — వర్షతి
రుహ్ - బీజజన్మని ప్రాదుర్భావే చ=మొలకెత్తుట — రోహతి
గై - శబ్దే=పాడుట — గాయతి

సూ - 8 వికరణ ప్రత్యయము పరమగునపుడు మొదటి గణమునందలి ధాతువుల చివరి ఇక్కులకు, ఉపధావర్ణములగు హ్రస్వములైన ఇక్కులకును గుణము వచ్చును

(ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ - అను వర్ణములకు ఇక్కులని పేరు అచ్ హల్ అను సంజ్ఞలవలెనే ఇక్ యణ్ మున్నగు సంజ్ఞలు కూడ పాణినీయ వ్యాకరణములో ఉపయోగింపబడినవి వీనికి ప్రత్యాహారములని పేరు )

సూ - 10 అలో౽న్త్యాత్ పూర్వ ఉపధా (పా సూ) = తుదివర్ణము నకు ముందు వర్ణము ఉపధ యనబడును

సూ - 1 అదేఙ్గుణః (పా సూ) = అ ఏ ఓ అను వర్ణములకు గుణమని పేరు.

(ఏ ఓ లకు ఏఙ్ అనునది ప్రత్యాహార సంజ్ఞ)

ఇ ఈ లకు ఏకారము, ఉ ఊ లకు ఓకారము, ఋ ౠ లకు అ (ర్) అనునది ఌ కారమునకు అ (ల్) అనునది గుణము

స్మృ+అ+తి=స్మరతి తౄ+అ+తి=తరతి రుహ్+అ+తి=రోహతి కృష్+అ+తి=కర్షతి జి+అ+తి=జే+అ+తి భూ+అ+తి=భో+అ+తి

సూ - 12 ఏచో౽యవాయావః (పా సూ) = ఏ ఓ ఐ ఔ లకు అచ్చు పరమగునపుడు వరుసగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ - అను ఆదేశములు వచ్చును

(ఏ ఓ ఐ ఔ లకు ఏచ్ అనునది ప్రత్యాహారసంజ్ఞ)

జే+అ+తి=జయతి భో+అ+తి=భవతి గై+అ+తి=గాయతి

మొదటి గణమునందలి మరికొన్ని ధాతువులు -

| | |
|---|---|
| గమ్ (గచ్ఛ్) - గతౌ=పోవుట | గచ్ఛతి |
| దృశ్ (పశ్య్) - ప్రేక్షణే=చూచుట | పశ్యతి |
| పా (పిబ్) - పానే=త్రాగుట | పిబతి |
| స్థా (తిష్ఠ్) - గతినివృత్తౌ=నిలబడుట ఆగుట | తిష్ఠతి |
| దా (యచ్ఛ్) - దానే=ఇచ్చుట | యచ్ఛతి |

కొన్ని ధాతువులకు వికరణ ప్రత్యయము పరమగునపుడు మరి యొక రూపము ఆదేశముగా వచ్చును. అట్టి ఆదేశములు ధాతువు

ప్రక్కనే కుండలీకరణములో చూపబడినవి  పైవానిలో గమ్ దృశ్ -
మున్నగువానికి గచ్ఛ్, పశ్య్-మున్నగునవి ఆదేశములు

గమ్ + అ + తి = గచ్ఛ్ + అ + తి = గచ్ఛతి    దృశ్ + అ + తి = పశ్య్ + అ + తి = పశ్యతి

సః భవతి

తౌ జయతః

తే స్మరన్తి

సా క్షయతి

సః సరతి

అహం తరామి

తే కర్షన్తి

తాః గాయన్తి

సః వర్షతి

యువాం గచ్ఛథః

ఆవాం పశ్యావః

యూయం పిబథ

వయం తిష్ఠామః

తాః యచ్ఛన్తి

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది .....

వారు ఉన్నారు

నీవు జయించుచున్నావు

మేమిద్దరము స్మరించుచున్నాము

నేను కదలుచున్నాను

మీరు తరించుచున్నారు

అతడు లాగుచున్నాడు
మే మిద్దరము పోవుచున్నాము
మీరు చూచుచున్నారు
ఆమె పాడుచున్నది
వారు క్షీణించుచున్నారు
నీవు నిలబడుచున్నావు
నేను త్రాగుచున్నాను
వారిద్దరు ఇచ్చుచున్నారు

## నాల్గవ గణము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | తుష్యతి | తుష్యతః | తుష్యన్తి |
| (మ పు) | తుష్యసి | తుష్యథః | తుష్యథ |
| (ఉ పు) | తుష్యామి | తుష్యావః | తుష్యామః |

వీనిలో 'తుష్' అనునది ధాతువు 'య' అనునది వికరణ తఃయమా తి, తః అన్తి - మున్నగునవి తిఙ్ ప్రత్యయములు

- 13 నాల్గవగణము నందలి ధాతువులకు తిఙ్ ప్రత్యయములకును నడుమ 'య' అను వికరణ ప్రత్యయము చేరును ఈ వికరణ ప్రత్యయము పరమగునపుడు ధాతువులకు గుణము రాదు
  తుష్+య+తి=తుష్యతి మొ

వగణము నందలి కొన్ని ధాతువులు —

| | |
|---|---|
| తుష్ - ప్రీతౌ=సంతోషించుట | తుష్యతి |
| పుష్ - పుష్టౌ=పోషించుట | పుష్యతి |
| నృత్ - గాత్ర విక్షేపే=నాట్యమాడుట | నృత్యతి |

వారిద్దరు దొర్లుచున్నారు
మేము శ్రమించుచున్నాము
నేను క్షమించుచున్నాను
నీవు ద్రోహము చేయుచున్నావు
మీరు శాంతించుచున్నారు
వారిద్దరు గర్వించుచున్నారు

## ఆరవ గణము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | విశతి | విశతః | విశన్తి |
| (మ పు) | విశసి | విశథః | విశథ |
| (ఉ పు) | విశామి | విశావః | విశామః. |

వీనిలో విశ్ అనునది ధాతువు 'అ' అనునది వికరణ ప్రత్యయము తి తః, అన్తి - మున్నగునవి తిఙ్ ప్రత్యయములు

సూ - 4 ఆరవగణమునందలి ధాతువులకు తిఙ్ ప్రత్యయములకును నడుమ 'అ' అను వికరణప్రత్యయము చేరును ఈ వికరణ ప్రత్యయము పరమగునపుడు ఆరవగణమునందలి ధాతువులకు గుణము రాదు విశ్ + అ + తి = విశతి మొ॥

ఆరవగణమునందలి కొన్ని ధాతువులు —

| | |
|---|---|
| విశ్ - ప్రవేశనే = ప్రవేశించుట | విశతి |
| సృజ్ - సర్గే = సృజించుట | సృజతి |
| స్పృశ్ - సంస్పర్శనే = స్పృశించుట | స్పృశతి |
| లిఖ్ - అక్షరవిన్యాసే = వ్రాయుట | లిఖతి |
| స్ఫుట్ - వికసనే = వికసించుట | స్ఫుటతి |
| స్ఫుర్ - స్ఫురణే = స్ఫురించుట, అదరుట | స్ఫురతి |

ఇష్ (ఇచ్ఛ్) - ఇచ్ఛాయామ్ = ఇచ్ఛగించుట, కోరుట — ఇచ్ఛతి

ప్రచ్ఛ్ (పృచ్ఛ్) - జిజ్ఞాసాయామ్ = ప్రశ్నించుట — పృచ్ఛతి

ఉఞ్ఛ్ - ఉఞ్ఛే - ఏరుకొనుట — ఉఞ్ఛతి

మజ్జ్ - శుద్ధౌ = మునుగుట, స్నానముచేయుట — మజ్జతి

తే విశన్తి
సః సృజతి
వయం స్పృశామః
త్వం లిఖసి
తాని స్ఫుటన్తి
తత్ స్ఫురతి
అహమ్ ఇచ్ఛామి
యూయం పృచ్ఛథ
తే ఉఞ్ఛన్తి
సా మజ్జతి

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది

మీరు ప్రవేశించుచున్నారు
అతడు సృజించుచున్నాడు
మీరిద్దరు స్పృశించుచున్నారు
నేను వ్రాయుచున్నాను
మేము ఏరుకొనుచున్నాము
నేను కోరుచున్నాను
వారు ప్రశ్నించుచున్నారు
అవి వికసించుచున్నవి
అవి అదురుచున్నవి
వారు మునుగుచున్నారు.

## పదవ గణము

| | ఏక. | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర పు) | పూజయతి | పూజయతః | పూజయన్తి |
| (మ పు) | పూజయసి | పూజయథః | పూజయథ |
| (ఉ. పు) | పూజయామి | పూజయావః | పూజయామః |

వీనిలో 'పూజ్' అనునది ధాతువు 'అయ' అనునది వికరణ ప్రత్యయము. తి, తః, అన్తి - మున్నగునవి తిఙ్ ప్రత్యయములు

సూ - 15 పదవగణమునందలి ధాతువులకు తిఙ్ ప్రత్యయములకును నడుమ 'అయ' అను వికరణ ప్రత్యయము చేరును.

పూజ్ + అయ + తి = పూజయతి మొ॥

పదవగణము నందలి కొన్నిధాతువులు —

| | |
|---|---|
| పూజ్ - పూజాయామ్=పూజించుట | పూజయతి |
| పీడ్ - అవగాహనే=పీడించుట | పీడయతి |
| సాన్త్వ - సామ ప్రయోగే=ఓదార్చుట | సాన్త్వయతి |
| చిన్త్ - స్మృత్యామ్=ధ్యానించుట, తలచుట | చిన్తయతి |
| ప్రీ (ప్రీఙ్) - తర్పణే=సంతోష పెట్టుట | ప్రీణయతి |
| వర్ణ్ - వర్ణనే=వర్ణించుట | వర్ణయతి |
| భూష్ - అలంకరణే = అలంకరించు | భూషయతి |
| భక్ష్ - అదనే=తినుట | భక్షయతి |
| మార్గ్ - అన్వేషణే=వెదకుట | మార్గయతి |
| అర్జ్ - ప్రతియత్నే = ఆర్జించుట | అర్జయతి |
| పాల్ - రక్షణే=పాలించుట | పాలయతి |

తే పూజయన్తి
తౌ పీడయతః
త్వం సాన్త్వయసి
వయం చిన్తయామః
యూయం ప్రీణయథ
యువాం వర్ణయథః
అహం భక్షయామి
ఆవాం మార్గయావః
యూయమ్ అర్జయథ
సః పాలయతి

పదవగణమునందలి మరికొన్ని ధాతువులు —

| | |
|---|---|
| చుర్ - స్తైయే=దొంగిలించుట | చోరయతి |
| తుల్ - ఉన్మానే=తూచుట | తోలయతి |
| ఘుష్ - విశబ్దనే=చాటించుట | ఘోషయతి |
| చుద్ - సంచోదనే=తోలుట, నడపుట | చోదయతి |

సూ - 16 'అయ' అను వికరణ ప్రత్యయము పరమగునపుడు ధాతువు యొక్క ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణము వచ్చును
ఉదా - చుర్+అయ+తి=చోరయతి.

పదవగణమునందలి మరికొన్ని ధాతువులు —

| | |
|---|---|
| తడ్ - అఘాతే=కొట్టుట | తాడయతి |
| ప్రథ్ - ప్రఖ్యానే=ప్రకటించుట | ప్రాథయతి |
| క్షల్ - శౌచకర్మణి=కడుగుట | క్షాలయతి |
| ఛద్ - అపవారణే=కప్పుట | ఛాదయతి |
| లీ - ద్రవీకరణే=కరగించుట | లాయయతి |

సూ - 17 'అయ అనునది పరమగునపుడు ధాతువుయొక్క ఉపధ యగు అకారమునకు, ధాతువు చివరి ఇక్కునకును వృద్ధి వచ్చును.

సూ - 8 వృద్ధి రాదైచ్ (పా సూ) = అ ఐ ఔ లకు వృద్ధియని పేరు (ఐ ఔ లకు ఐచ్ అనునది ప్రత్యాహార సంజ్ఞ)

అకారమునకు వృద్ధి ఆకారము ఇ ఈ ఏ లకు వృద్ధి ఐ కారము, ఉ ఊ ఓ లకు వృద్ధి ఔ కారము ఋ ౠ లకు వృద్ధి ఆ (ర్) అనునది. ఌ కారమునకు వృద్ధి ఆ (ల్) అనునది

తడ్+అయ+తి=తాడయతి లీ+అయ+తి = లై+అయ+తి = లాయయతి (సూ - 2)

(ప్రథ్ ధాతువునకు ఉపధావృద్ధి రాని 'ప్రథయతి' మున్నగు రూపములుగూడ కలవు)

తే చోరయన్తి
త్వం తోలయసి
యూయం ఘోషయథ
అహం చోదయామి
తౌ తాడయతః
త్వం ప్రాథయసి
త్వం ప్రథయసి
ఆవాం క్షాలయావః
వయం ఛాదయామః
సా లాయయతి

పదవగణమునందలి మరికొన్ని ధాతువులు —

| | |
|---|---|
| గణ - సంఖ్యానే = లెక్కించుట | గణయతి |
| కథ - వాక్యప్రబన్ధే = చెప్పుట | కథయతి |

రచ - ప్రతియత్నే = రచించుట రచయతి

స్పృహ - ఈప్సాయామ్ = కోరుట స్పృహయతి

దణ్డ - దణ్డనిపాతనే = దండించుట దణ్డయతి

సూ - 19 'అయ' అనునది పరమగునపుడు ధాతువు చివరి అకారమునకు లోపము వచ్చును.

(గణ మున్నగు ధాతువులు కొన్ని అకారాన్తము లగుటచే చివరి అకారమునకు ముందున్న హల్లు ఉపధ యగునుగాని, ఆ హల్లునకు ముందున్న అచ్చు ఉపధ కానేరదు కావున ఆ ధాతువులకు ఉపధా వృద్ధి గాని, గుణముగాని రాదు )

గణ + అయ + తి = గణ్ + అయ + తి = గణయతి.

త్వం గణయసి
యూయం కథయథ
తే రచయన్తి
యువాం స్పృహయథః
అహం దణ్డయామి
సా రచయతి
తాః కథయన్తి
తే గణయతః

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది .—

వారిద్దరు పూజించుచున్నారు
వారు పీడించుచున్నారు
నీవు ధ్యానించుచున్నావు
మేమిద్దరము సంతోషపెట్టుచున్నాము

మేము వర్ణించుచున్నాము

వారిద్దరు అలంకరించుచున్నారు

మీరు భక్షించుచున్నారు

నేను వెదకుచున్నాను

వారు ఓదార్చుచున్నారు

నేను ఆర్జించుచున్నాను

వారు పాలించుచున్నారు

వారిద్దరు దొంగిలించుచున్నారు

మేము తూచుచున్నాము

నీవు ఘోషించుచున్నావు

వారు వడపుచున్నారు

మీరు కొట్టుచున్నారు

అతడు ప్రకటించుచున్నాడు

నేను కడుగుచున్నాను

వారిద్దరు ఆచ్ఛాదించుచున్నారు

నీవు కరగించుచున్నావు

వారు గణించుచున్నారు

మేమిద్దరము చెప్పుచున్నాము

మేము రచించుచున్నాము

మీరు కోరుచున్నారు

వారిద్దరు దండించుచున్నారు

ఆమె గణించుచున్నది

వారు (స్త్రీలు) రచించుచున్నారు

వారిద్దరు (స్త్రీలు) కోరుచున్నారు

## అభ్యాసము 1

### [వర్తమానార్థకము (లట్) — పరస్మైపదము]

#### తిజ్ ప్రత్యయములు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర. పు) | తి | తః | అన్తి |
| (మ పు) | సి | థః | థ |
| (ఉ పు) | మి | వః | మః |

#### క్రియాపదములు

(మొదటి గణము) జి - జయే

| | | | |
|---|---|---|---|
| (ప్ర పు) | జయతి | జయతః | జయన్తి |
| (మ. పు) | జయసి | జయథః | జయథ |
| (ఉ పు) | జయామి | జయావః | జయామః |

#### వాక్యప్రయోగములు

సః జయతి, తౌ జయతః, తే జయన్తి
త్వం జయసి, యువాం జయథః, యూయం జయథ;
అహం జయామి, ఆవాం జయావః; వయం జయామః;

(ఇట్లే అన్ని ధాతువుల క్రియాపద రూపములను, వాక్య ప్రయోగములను అభ్యాసము చేయునది)

క్రింది పాణినీయసూత్రముల యర్థమును సోదాహరణముగ వివరించునది.

1 సుప్తిఙన్తం పదమ్ · 2 అతో గుణే. 3 యుష్మద్యుపపదే సమానాధికరణే స్థానిన్యపి మధ్యమః; 4 అస్మద్యుత్తమః; 5 శేషే ప్రథమః 6. మోఽనుస్వారః, 7. అతోదీర్ఘోయఞి; 8. అలోఽన్త్యాత్ పూర్వ ఉపధా, 9 అదేఙ్గుణః 10. ఏచోఽయవాయావః: 11. వృద్ధిరాదైచ్,

క్రింది ప్రత్యాహారములను వివరించునది —

ఏఙ్ - ఏచ్ - ఐచ్ - ఇక్.

ఆయా గణముల ప్రత్యేక లక్షణములను సోదాహరణముగా వివరించునది.

ద్వితీయః పాఠః – రెండవ పాఠము

# సుబన్తములు

---

సంస్కృతభాషలో సామాన్యముగా పురుషవ్యక్తులను బోధించు శబ్దములు పుంలింగమునందు, స్త్రీ వ్యక్తులను బోధించు శబ్దములు స్త్రీ లింగమునందును ఉండును ఉదా:- రామశబ్దము పుంలింగము సీతాశబ్దము స్త్రీ లింగము

కాని తక్కిన శబ్దములలో కొన్ని పుంలింగమునందు, కొన్ని స్త్రీ లింగమునందు, కొన్ని నపుంసకలింగమునందును ఉండును. ఉదా:- వృక్షశబ్దము పుంలింగము , లతాశబ్దము స్త్రీలింగము , ఫలశబ్దము నపుంసకలింగము కావున అట్టి శబ్దముల లింగములను ప్రయోగాదులను బట్టి తెలిసికొనదగును

1 అకారాన్త పుంలింగశబ్దములు — ప్రథమా విభక్తి.

బాలః = బాలుడు

బాలౌ = బాలు రిద్దరు

బాలాః = బాలురు

నామవాచక, సర్వనామ, విశేషణ పదములయందలి ప్రకృతిని ప్రాతిపదిక మందురు. ప్రత్యయమును సుప్ ప్రత్యయమందురు సుప్ ప్రత్యయములు అంతమందుగల పదములగుటచే వానికి 'సుబన్తములు' అని పేరు

పై పదములలో 'బాల' అనునది ప్రాతిపదికము స్, ఔ, అస్ అనునవి ప్రథమావిభక్తి సుప్ ప్రత్యయములు.

సూ - 20 పదాంత సకారము విసర్గగా మారును బాల+స్=బాలః

సూ - 21 వృద్ధిరేచి (పా సూ) = అకారమునకు అకారమునకును ఏ ఐ లు పరమగునపుడు ఐకారమును, ఓ ఔలు పరమగునపుడు ఔకారమును ఏకాదేశముగ వచ్చును బాల+ఔ=బాలౌ

సూ - 22 అకః సవర్ణే దీర్ఘః (పా సూ) = అ ఇ ఉ ఋ లకు గాని వాని దీర్ఘములకుగాని సవర్ణములు పరమగునపుడు వాని దీర్ఘములు ఏకాదేశముగా వచ్చును

(అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ - వానికి అక్ అనునది ప్రత్యాహార సంజ్ఞ)

అకారమునకు, అకారమునకు అ ఆలు సవర్ణములు. ఇకారమునకు ఈకారమునకును ఇ ఈ లు సవర్ణములు. ఉకారమునకు ఊకారమునకు ఉ ఊ లు సవర్ణములు. ఋకారమునకు, ౠకారమునకును ఋ ౠ లు సవర్ణములు

బాల + అస్ = బాలాస్ = బాలాః (సూ - 20)

హే బాల = ఓ బాలుడా

ప్రథమా విభక్తిని సంబోధమునందు ఉపయోగించునపుడు ఏకవచన రూపములందు మాత్రము కొన్నిశబ్దములకు భేదముండును ద్వివచన బహువచనములలో అన్ని శబ్దములకు ప్రథమా విభక్తి రూపములె ఉపయోగింపబడును సంబోధనమునందు సామాన్యముగా 'హే' యనునది మొదట ప్రయోగింపబడును. అది లేకుండకూడ ప్రయోగింప వచ్చును

సూ - 23 ఏఙ్ హ్రస్వాత్ సంబుద్ధేః (పా సూ) = సంబోధము నందు హ్రస్వముకంటె, ఏకార ఓకారములకంటెను పరమయిన ఏకవచన ప్రత్యయమునకు లోపము వచ్చును.

హేబాల + స = హేబాల

(సం. ప్ర వి) హేబాల - హేబాలౌ - హేబాలాః

మేఘః = మేఘము        పాదః = పాదము

అనలః = అగ్ని        స్తేనః = దొంగ

మయూరః = నెమలి        కూర్మః = తాబేలు

హస్తః = చేయి        కింకరః = సేవకుడు

రామః జయతి

మేఘః వర్షతి

అనలః దహతి

మయూరః నృత్యతి

దేవః రక్షతి

హస్తౌ యచ్ఛతః

పాదౌ చరతః

బాలౌ క్రీడతః

స్తేనౌ చోరయతః

కూర్మౌ సరతః

జనాః వదన్తి

మూర్ఖాః కుప్యన్తి

నరాః వదన్తి

కింకరాః నమన్తి

భక్తాః పూజయన్తి

సంస్కృతభాషలో తద్ధర్మార్థక రూపములు వేరుగలేవు వర్తమానార్థకములే తద్ధర్మార్థమునుగూడ బోధించును ఉదా - జయతి = జయించుచున్నాడు, జయించును.

## ద్వితీయా విభక్తి

బాలమ్ = బాలుని

బాలౌ = బాలురిద్దరిని

బాలాన్ = బాలురను

వీనిలో మ్, ఔ, న్ - అనునవి ద్వితీయావిభక్తి సుప్ ప్రత్యయములు.

సూ - 24 నకారాది బహువచన సుప్ ప్రత్యయములు పరమగునపుడు ముందున్న అచ్చునకు దీర్ఘము వచ్చును.

బాల + న్ = బాలాన్

| | |
|---|---|
| ఆచార్యః = గురు | విప్రః = బ్రాహ్మణుడు |
| జనకః = తండ్రి | వేదః = వేదము |
| బుధః, ప్రజ్ఞః } = పండితుడు | గ్రామః = గ్రామము |
| | శరః = బాణము |
| మోక్షః = మోక్షము | మర్కటః = కోతి |

శిష్యా ఆచార్యం పృచ్ఛన్తి

భక్తా ఈశ్వరం పూజయన్తి

పుత్రా జనకం నమన్తి

మూర్ఖా బుధాన్ నిన్దన్తి

ప్రజ్ఞా మోక్షమ్ ఇచ్ఛన్తి

విప్రా వేదం పఠన్తి

పురుషా గ్రామం గచ్ఛన్తి

యోధాః శరాన్ అస్యన్తి

నృపాః చోరాన్ దణ్డయన్తి

వేదాః సూర్యం వర్ణయన్తి
అహం పాదౌ క్షాళయామి
బాలౌ మర్కటాన్ తాడయతః

సూ - 25 ఆకారముకంటె పరమయిన విసర్గకు అచ్చుగాని నాద హల్లుగాని పరమగునపుడు లోపమువచ్చును ఉదా - శిష్యాః+ ఆచార్యమ్ = శిష్యాఆచార్యమ్ పుత్రాః + జనకమ్ = పుత్రా జనకమ్

విసర్గ లోపించిన తరువాత వరుసగా ఏర్పడిన రెండచ్చులకును మరల సంధిరాదు అందుచే శిష్యాఆచార్యమ్ అనుచోట సవర్ణదీర్ఘము రాదు.

(వర్గ తృతీయ చతుర్థ పంచమాక్షరములు, హయ వర లకారములను నాదహల్లులు నాదహల్లులకు 'హశ్' అనునది ప్రత్యాహార సంజ్ఞ తక్కినవి అనగా వర్గప్రథమ ద్వితీయాక్షరములు, శ ష స లను శ్వాస హల్లులు శ్వాసహల్లులకు 'ఖర్' అనునది ప్రత్యాహార సంజ్ఞ )

వాక్యమునందు రెండు పదముల నడుమ సంధికార్యము వివక్షాధీనము. కావున అట్టిచోట్ల సంధి చేసియు, సంధి చేయకయుగూడ వాక్యములను ప్రయోగింపవచ్చును అనగా శిష్యాఆచార్యమ్ అని సంధి కార్యముతోడను, శిష్యాః ఆచార్యమ్ అని సంధిలేకుండగనుగూడ ప్రయోగింపవచ్చును తక్కిన వాక్యము లన్నింటిలోగూడ ఇట్లే గమనింపదగినది

సూ - 26 గత్యర్థ కర్మణి ద్వితీయాచతుర్థ్యౌ చేష్టాయా మనధ్వని (పా సూ) = గత్యర్థక ధాతువుల యోగమునందు ద్వితీయా విభక్తిగాని, చతుర్థీ విభక్తిగాని వచ్చును. నగరం గచ్ఛన్తి లేక నగరాయ గచ్ఛన్తి

2 అకారాన్త నపుంసకలింగ శబ్దములు -

ప్రథమా, ద్వితీయా విభక్తులు

నపుంసకలింగ శబ్దములన్నింటికి ప్రథమా, ద్వితీయా విభక్త్యన్త పదములు ఒకే విధముగ ఉండును సందర్భమునుబట్టి అర్థభేదమును గుర్తింపవలెను

ఫలమ్ = పండు పండును

ఫలే = రెండుపండ్లు రెండుపండ్లను

ఫలాని = పండ్లు, పండ్లను

వీనిలో ఫల' అనునది ప్రాతిపదికము మ్, ఈ, ని - అనునవి ప్రథమా, ద్వితీయా విభక్తుల సుప్ ప్రత్యయములు.

సూ - 27 ఆద్గుణః (పా సూ) = అకారమునకు, అకారమునకును ఇ ఈ లు పరమగునపుడు ఏకారము ఉ ఊలు పరమగునపుడు ఓకారమును ఏకాదేశముగ వచ్చును

ఉదా - ఫల + ఈ = ఫలే. ఫల + ని = ఫలాని (సూ-24).

సూ - 28 రషాభ్యాం నోణః సమానపదే (పా సూ) = ఏకపదమునందు రేఫషకారములకంటె పరముగా నున్న నకారమునకు ణకారాదేశమగును

ఋవర్ణాన్నస్యణత్వంవాచ్యమ్ (వార్తికమ్) = ఋ ౠల కంటె పరమయిన నకారమునకు ణకారాదేశమగును

సూ - 29 అట్కుప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి(పా సూ) = ఆ రేఫ షకార ఋకార ౠకారములకు, నకారమునకును నడుమ అట్ కవర్గ పవర్గాక్షరములతో వ్యవధాన మున్నప్పటికిని ణకారాదేశము వచ్చును ఉదా - గృహ+ని=గృహాణి పత్ర+ని= పత్రాణి . పుష్ప + ని = పుష్పాణి (సూ - 24)

(అచ్చులకు హయవర అను హల్లులకును 'అట్' అనునది ప్రత్యాహార సంజ్ఞ)

సూ - 30 వ పదాన్తస్య (పా సూ) = పదాంత నకారమునకు ణకారాదేశము రాదు ఉదా - రామాన్ విప్రాన్

స్నేహితుడు అను అర్థమునందు మిత్రశబ్ద మెల్లప్పుడు నపుంసక లింగమందుండును పుంలింగమునందు మిత్రశబ్దము సూర్యుడు అను నర్థము నిచ్చును

మిత్రమ్ = స్నేహితుడు , మిత్రః = సూర్యుడు

ధనం నశ్యతి
స్తేనో ధనం చోరయతి
జలం శుష్యతి
నరా జలం పిబన్తి
ఫలాని పతన్తి
జనాః ఫలాని భక్షయన్తి
రాజో రాజ్యం పాలయతి
మిత్రాణి సత్యం వదన్తి
హృదయం తుష్యతి
మనుష్యా హృదయాని ప్రీణయన్తి
మూర్ఖా అసత్యం వదన్తి
వయం నగరం గచ్ఛామః
కమలాని స్ఫుటన్తి
నేత్రే పుష్పాణి పశ్యతః
బాలో ముఖం క్షాలయతి
వ్యాఘ్రో మాంసం ఖాదతి

సూ - 31 అకారముకంటె పరమయిన విసర్గకు నాదహల్లు పరమగు నపుడు ఉకారాదేశమగును ఉదా - ప్రైనః + ధనమ్ = ప్రైన + ఉ + ధనమ్ = ప్రైనోధనమ్ (సూ - 27)

## తృతీయా విభక్తి

తృతీయాది విభక్త్యంత పదములు అకారాంత పుంలింగ శబ్దములకు, అకారాంత నపుంసకలింగములకును ఒకే విధముగ నిష్పన్నమగును

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| బాలేన = బాలునిచే | ఫలేన = ఫలముచే |
| బాలాభ్యామ్ = బాలురిద్దరిచే | ఫలాభ్యామ్= రెండుఫలములచే |
| బాలైః = బాలురచే | ఫలైః = ఫలములచే |

వీనిలో ఇన, భ్యామ్ ఐస్ - అనునవి తృతీయా విభక్తి సుప్ప్రత్యయములు

బాల + ఇన = బాలేన , ఫల + ఇన = ఫలేన (సూ - 27)

సూ - 32 సుపి చ (వా సూ) = య, భ్యామ్ అను సుప్ ప్రత్యయములు పరమగునపుడు అకారమునకు దీర్ఘము వచ్చును

ఉదా - బాలా + భ్యామ్ = బాలాభ్యామ్ , ఫల + భ్యామ్ = ఫలాభ్యామ్

బాల + ఐస్ = బాలైః ఫల + ఐస్ = ఫలైః (సూ-21, 20)

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| వసన్తః = వసంతము | పర్ణమ్ = ఆకు |
| ఉపహారః = కానుక | అర్ఘ్యమ్ = పూజాద్రవ్యము |
| ఉద్యోగః = ఉద్యోగము | అన్నమ్ = అన్నము |

ః = శ్లోకము
నః = అన్నము
హః = శరీరము
లఙ్కారః = ఆభరణము
దణ్డః = కఱ్ఱ
కాణః = గ్రుడ్డివాడు
బధిరః = చెవిటివాడు
ఖఞ్జః = కుంటివాడు

శరీరమ్ = శరీరము
భూషణమ్ = ఆభరణమ
వస్త్రమ్ = బట్ట
శ్రోత్రమ్ = చెవి

వసన్తః పత్రైః వృక్షాన్ భూషయతి
మాంసేన వ్యాఘ్రా జీవన్తి
నేత్రాభ్యాం పశ్యతి నరః
నృపా ఉపహారైః కిఙ్కరాన్ ప్రీణయన్తి
బాలః పాదాభ్యాం చరతి
ఉద్యోగేన నరా ధన మర్జయన్తి
బుధో నృపం శ్లోకైః వర్ణయతః
అర్ఘ్యేణ సూర్యం పూజయతి మనుష్యః
ఓదనేన మానవా జీవన్తి
అన్నేన శరీరాణి పుష్యన్తి
అలంకారైః దేహాన్ భూషయన్తి నరాః
భూషణైస్తుష్యన్తి జనాః
స్తేనం పురుష స్తాడయతి దణ్డేన
చక్రాభ్యాం రథశ్చలతి
జనా దేహాన్ వస్త్రై శ్చాదయన్తి
నేత్రేణ కాణః శ్రోత్రేణ బధిరః, పా

సూ - 33 విసర్గకు తకార థకారములు పరమగునపుడు సకారము చకార ఛకారములు పరమగునపుడు శకారము టకార ఠకారములు పరమగునపుడు షకారమును ఆదేశమగును

ఉదా - పురుషః + తాడయతి = పురుషస్తాడయతి రథః + చలతి = రథశ్చలతి, ప్రథమః + టః = ప్రథమష్టకారః

సూ - 34 యేనాఙ్గవికారః (పా సూ) = ఏ అవయవము వికృత మగుటచే శరీరమునకు వికారము సూచింపబడునో ఆ అవయవ వాచక శబ్దమునకు తృతీయా విభక్తి వచ్చును

ఉదా - నేత్రేణ కాణః

## చతుర్థీ విభక్తి

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| బాలాయ = బాలుని కొఱకు | ఫలాయ = ఫలముకొఱకు |
| బాలాభ్యామ్ = బాలురిద్దరికొఱకు | ఫలాభ్యామ్ = రెండుఫలముల కొఱకు |
| బాలేభ్యః = బాలుర కొఱకు | ఫలేభ్యః=ఫలములకొఱకు |

బాల+య=బాలాయ ఫల+య=ఫలాయ (సూ - 32)

బాల + భ్యామ్ = బాలాభ్యామ్ ఫల + భ్యామ్ = ఫలాభ్యామ్ (సూ-32)

సూ - 35 బహువచనే ఝల్యేత్ (పా సూ) = భ్యస్, సు అను సుప్ ప్రత్యయములు పరమగునపుడు అకారమునకు ఎకారము ఆదేశమగును

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| నిష్కః = బంగారునాణెము | ఖేలనమ్ = ఆడుట |
| మోదకః = కుడుము లడ్డు | |
| కాసారః = సరస్సు | పఠనమ్ = చదువుట |
| ఆపణః = దుకాణము | |
| విద్యాలయః = బడి | ఉపవనమ్ = ఉద్యానము |
| ఖలః = దుర్జనుడు | |

యాచకేభ్యో ధనం యచ్ఛతి ధనికః
భోజనాయ గృహం గచ్ఛన్తి బాలాః
రామో బ్రాహ్మణేభ్యో నిష్కాన్ యచ్ఛతి
మోదకేభ్యః స్పృహయన్తి బాలాః
పుత్రాభ్యాం కుప్యతి జనకః
ఖేలనాయ బాలకా ఉద్యానం విశన్తి
బుధో మోక్షాయ దేవం పూజయతి
మృగా జలేభ్యః కాసారం మార్గయన్తి
ఖలా మిత్రేభ్యో ద్రుహ్యన్తి
నరాః ఫలేభ్యో వనం గచ్ఛన్తి
నృపాః కింకరేభ్యో ధనం యచ్ఛన్తి
పఠనాయ విద్యాలయం గచ్ఛామః
నగరాయ గచ్ఛన్తి ధనికాః
యాచకాభ్యా మన్నం యచ్ఛసి
ఫలేభ్య ఆపణం గచ్ఛామి
బాలకాః కుసుమేభ్య ఉపవనం విశన్తి

సూ - 36 అకారముకంటె పరమయిన విసర్గకు అకారేతరాచ్చు పరమగు నపుడు లోపము వచ్చును

ఉదా - ఫలేభ్యః + ఆపణమ్ = ఫలేభ్య ఆపణమ్

సూ - 37 స్పృహే రీప్సితః (పా సూ) = స్పృహ్ ధాతువుయొక్క ప్రయోగమునందు కోరబడు పదార్థమును తెలుపు పదము నకు చతుర్థీ విభక్తి వచ్చును ఉదా - మోదకేభ్యః స్పృహయతి

సూ - 38 క్రుధద్రుహేర్ష్యాసూయార్థానాం యం ప్రతికోపః (పా సూ)= క్రోధము ద్రోహము, ఈర్ష్య, అసూయ అను అర్థములుగల ధాతువుల ప్రయోగమునందు ఎవ్వనియందు క్రోధాదు లుండునో తద్వాచకమునకు చతుర్థీ విభక్తి వచ్చును. ఉదా - పుత్త్రాభ్యాం కుప్యతి.

## పంచమీ విభక్తి

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| బాలాత్ = బాలునివలన | ఫలాత్ = ఫలమువలన |
| బాలాభ్యామ్ = బాలురిద్దరివలన | ఫలాభ్యామ్=రెండుఫలములవలన |
| బాలేభ్యః = బాలురవలన | ఫలేభ్యః = ఫలములవలన |

వీనిలో అత్, భ్యామ్, భ్యస్ - అనునవి పంచమీ విభక్తి సుప్ ప్రత్యయములు

బాల + అత్ = బాలాత్ ఫల + అత్ = ఫలాత్ (సూ - 22)

బాలా+భ్యామ్=బాలాభ్యామ్ ఫల+భ్యామ్=ఫలాభ్యామ్ (సూ - 32)

బాల + భ్యస్ = బాలేభ్యః , ఫల + భ్యస్ = ఫలేభ్యః (సూ - 35 20)

| పుంలింగము | నపుంసకలింగము |
| --- | --- |
| ప్రాసాదః = మేడ | యోజనమ్ = ఎనిమిది మైళ్ళు |
| క్రోశః = క్రోసుదూరము | సంకటమ్ = ఆపద |
| క్రోధః = కోపము | గృహః (పుం) } = ఇల్లు |
| వాతః = గాలి | గృహమ్ (న) } = ఇల్లు |
| నిర్ఝరః = సెలయేరు | గృహశబ్దము పుంలింగమునందు |
| ఆహ్లాదః = ఆనందము | నిత్యబహువచనాన్తము |
| సమ్మోహః = మూర్ఛ, అజ్ఞానము | ఆకాశః (పుం) } = ఆకాశము |
| కుక్కురః = కుక్క | ఆకాశమ్ (న) } = ఆకాశము |
| రోగః = రోగము | |
| అగదః = ఔషధము | |

అహం నగరాత్ గ్రామం గచ్ఛామి
ప్రాసాదాత్ జనం పశ్యతి నరపాలః
వృక్షేభ్యః ఫలన్తి ఫలాని
పర్వతః సముద్రాత్ క్రోశః
నగరం వనాత్ యోజనమ్
క్రోధాత్ భృత్యం తాడయతి
ఆకాశాత్ నక్షత్రాణి పతన్తి
వృక్షేభ్యః పర్ణాని
నిర్ఝరః పర్వతాత్ పతతి
క్రోధాత్ భవతి సమ్మోహః
దేవః సంకటేభ్యో జనాన్ రక్షతి
కుక్కురాః చోరేభ్యో గృహాణి రక్షన్తి

గృహాత్ గృహం యాచకోఽటతి
పైనికోఽశ్వాత్ పతతి
రోగోఽగదేభ్యో వశ్యతి

సూ - 39 అకారముకంటె పరమయిన విసర్గకు అకారము పరమగునపుడు ఉకారాదేశమగును ఉదా - యాచకః + అటతి = యాచక + ఉ + అటతి = యాచకో + అటతి (సూ - 27)

సూ - 40 ఏఙః పదాన్తాదతి (పా సూ)=పదాంత మందలి ఏ ఓ లకు అకారము పరమగునపుడు పూర్వరూపము ఏకాదేశముగ వచ్చును (అనగా అట్టిచోట్ల ఏ ఓ లు నిలచి అకారము లోపించునని భావము) ఉదా - యాచకో + అటతి = యాచకోటతి సామాన్యముగా ఇట్లు లోపించిన అకారమునకు బదులు వ్రాతలో ఽ గుర్తు ఉంచబడుచుండును దానికి ఉచ్చారణలేదు యాచకోఽటతి

## షష్ఠీ విభక్తి

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| బాలస్య = బాలునియొక్క | ఫలస్య = ఫలముయొక్క |
| బాలయోః = బాలురిద్దరియొక్క | ఫలయోః =రెండుఫములయొక్క |
| బాలానామ్ = బాలురయొక్క | ఫలానామ్ = ఫలములయొక్క |

వీనిలో స్య ఓస్ నామ్ - అనునవి షష్ఠీ విభక్తి సుప్ ప్రత్యయములు

సూ - 4 ఓసి చ (పా సూ) = ఓస్ అను ప్రత్యయము పరమగునపుడు అకారమునకు ఏకారము ఆదేశమగును ఉదా - బాల+ఓస్=బాలే+ఓస్=బాలయ్+ఓస్=బాలయోః ఫల+ఓస్=ఫలే+ఓస్=ఫలయ్+ఓస్=ఫలయోః (సూ - 12, 20)



సూ - 42 నామి (పా సూ)=నామ్ అను ప్రత్యయము పరమగునప్పుడు అచ్చునకు దీర్ఘము వచ్చును. బాల + నామ్ = బాలానామ్. ఫల+నామ్=ఫలానామ్.

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| ప్రకాశః = వెలుగు | పాపమ్ = పాపము |
| అభ్యుదయః = అభివృద్ధి | ఔషధమ్ = మందు |
| అగ్రజః = అన్న | తటాకః (పుం) } = చెఱువు |
| జయః = జయము | తటాకమ్(న) } |
| ప్రసాదః=అనుగ్రహము | విశేషణములు - |
| పాపః = పాపాత్ముడు | స్వల్ప = తక్కువ |
| రథః = రథము | కోమల = మృదువైన |
| | చణ్డ = తీక్ష్ణమైన |
| | లవణ = ఉప్పని |
| | మధుర = తియ్యని |

'యల్లిఙ్గం, యద్వచనం, యాచ విభక్తి ర్విశేష్యస్య
తల్లిఙ్గం, తద్వచనం, సాచ విభక్తి ర్విశేషణస్య '

(విశేష్యము ఏలింగమునందు, ఏ వచనమునందు, ఏ విభక్తియందుండునో విశేషణమునుగూడ అదే లింగమునందు, అదే విభక్తియందు అదే వచనమునందు ప్రయోగింపవలెను అని భావము )

నక్షత్రాణాం ప్రకాశః స్వల్పః
మిత్రాణా మభ్యుదయం కాంక్షామః
బాలస్య హస్తౌ కోమలౌ భవతః
బలరామః కృష్ణస్యాగ్రజః

నృపస్య జయే జనా స్తుష్యన్తి
సూర్యస్య ప్రకాశ శ్చన్ద్రో భవతి
సముద్రస్య జలం లవణమ్
దేవస్య ప్రసాదేన జీవామః
దేవః పాపానాం పాపాని క్షమ్యతి
నరపాలస్య సేవకో గ్రామం గచ్ఛతి
నరాణాం పాలకో నరపాలకః
తటాకస్య జలం మధురమ్
సజ్జనానాం దుర్జనేభ్యో భయం భవతి
వందితా నృపాణాం చరితం శ్లోకై ర్వర్ణయన్తి
మానవానాం రోగా ఔషధై ర్నశ్యన్తి
నృపస్య మిత్రాణి రథై రటంతి

సూ - 43 అ ఆ లు తప్ప తక్కిన అచ్చులకంటె పరమయిన విసర్గకు అచ్చుగాని నాదహల్లుగాని పరమగునపుడు రేఫాదేశ మగును.

ఉదా - రథైః + అటన్తి = రథైరటన్తి  శ్లోకైః + వర్ణయన్తి = శ్లోకైర్వర్ణయన్తి

## సప్తమీ విభక్తి

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| బాలే = బాలునియందు | ఫలే = ఫలమునందు |
| బాలయోః=బాలురిద్దరియందు | ఫలయోః = రెండు ఫలములయందు |
| బాలేషు = బాలురయందు | ఫలేషు = ఫలములయందు |

వీనిలో ఙ, ఓస్, సు - అనునవి సప్తమీ విభక్తి సుప్ ప్రత్యయములు బాల + ఙ = బాలే, ఫల + ఙ = ఫలే (సూ - 27)

బాల+ఓస్ = బాలే + ఓస్ = బాలయోః ఫల + ఓస్ = ఫలే + ఓస్=ఉఫలయోః (సూ - 4 , 12, 20)

బాల+సు=బాలే+సు ఫల+సు=ఫలే+సు (సూ 35)

సూ - 44 ఆదేశ ప్రత్యయయోః (పా సూ) = ఇణ్, కవర్గాక్షరము కంటె పరమయిన ఆదేశ సకారమునకు ప్రత్యయ సకారమునకును షకారాదేశ మగును

(అ ఆ బు తప్ప తక్కిన అచ్చులకు హయవరలకారములకును ఇణ్ అనునది ప్రత్యాహార సంజ్ఞ)

బాలే + సు = బాలేషు ఫలే + సు = ఫలేషు

| పుంలింగము | నపుంసకలింగము |
|---|---|
| మేషః = మేక | యూథమ్ = మంద |
| గ్రీష్మః=గ్రీష్మర్తువు, వేసవి | గహ్వరమ్ = గుహ |
| సచివః = మంత్రి | క్షేత్రమ్ = పొలము |
| ఆదరః = ఆదరము | బీజమ్=విత్తనము |
| పరాక్రమః=పరాక్రమము | క్రీడాజ్గణమ్ = ఆటస్థలము |
| కూపః = నుయ్యి | |
| గుణః = గుణము | శిఖరః (పుం) / శిఖరమ్ (న) = శిఖరము |
| విహగః = పక్షి | |
| | పల్వలః (పుం) / పల్వలమ్ (న) = నీటిగుంట |

పర్వతస్య శిఖరే మేషాణాం యూథం చరతి

కాసారేషు కమలాని రోహన్తి

పర్వతానాం గహ్వరేషు సింహా వసన్తి
గ్రీష్మే తటాకేషు జలం శుష్యతి
ఉద్యానేషు వృక్షాన్ కుసుమాని భూషయన్తి
వరహా౾వల్వలేషు జలం పిబన్తి
మనుష్యేషు రామ శ్శ్రేష్ఠః
వృక్షేషు విహగా స్తిష్ఠన్తి
జలే పద్మాని స్ఫుటన్తి
ధనికాః ప్రాసాదేషు వసన్తి
క్షేత్రేషు బీజాని రోహన్తి
సచివేషు నృపస్యాదరో భవతి
జనా లోకే వీరాణాం పరాక్రమాన్ ప్రథయన్తి
క్రీడాఙ్గణే బాలా౾ఖేలన్తి
కూపే కూర్మా స్సరన్తి
ఆచార్య శ్శిష్యాణాం గుణాన్ ప్రథయతి

సూ - 45 కుప్వో౾క౾పౌ చ (పా సూ) = కఖ పఫ అను హల్లులు పరమగునపుడు విసర్గకు వికల్పముగా అర్ధవిసర్గలు ఆదేశ మగును

ఉదా - వరాహాః + పల్వలేషు = వరాహా౾పల్వలేషు
బాలాః + ఖేలన్తి = బాలా౾ఖేలన్తి

సూ - 46 విసర్గకు శ ష స లు పరమగునపుడు వరుసగా శ ష స లు వికల్పముగా ఆదేశములగును

ఉదా - రామః + శ్రేష్ఠః = రామశ్శ్రేష్ఠః,
కూర్మాః + సరన్తి - కూర్మాస్సరన్తి.

## అభ్యాసము 2

### అకారాన్త పుంలింగము - రామశబ్దము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | రామః | రామౌ | రామాః |
| (సం ప్ర) | (హే)రామ | ,, | ,, |
| (ద్వి వి) | రామమ్ | ,, | రామాన్ |
| (తృ వి) | రామేణ | రామాభ్యామ్ | రామైః |
| (చ వి) | రామాయ | ,, | రామేభ్యః |
| (పం వి) | రామాత్ | ,, | ,, |
| (ష వి) | రామస్య | రామయోః | రామాణామ్ |
| (స వి) | రామే | ,, | రామేషు |

ఈవిధముగనే తక్కిన అకారాన్త పుంలిఙ్గ శబ్దముల రూపములను గూడ అభ్యాసము చేయునది

### అకారాన్త నపుంసకలింగము - వనశబ్దము

| | | | |
|---|---|---|---|
| (ప్ర వి) | వనమ్ | వనే | వనాని |
| (సం. ప్ర) | (హే) వన | ,, | ,, |
| (ద్వి వి) | వనమ్ | ,, | ,, |
| (తృ వి) | వనేన | వనాభ్యామ్ | వనైః |
| (చ వి) | వనాయ | ,, | వనేభ్యః |
| (పం వి) | వనాత్ | ,, | ,, |
| (ష. వి) | వనస్య | వనయోః | వనానామ్ |
| (స వి) | వనే | ,, | వనేషు |

ఈవిధముగనే తక్కిన అకారాన్త నపుంసకలింగ శబ్దముల రూపములనుగూడ అభ్యాసము చేయునది.

| అకారాంత పుంలింగ శబ్దములకు చేరు సుప్ ప్రత్యయములు | | |
|---|---|---|
| (ఏక) | (ద్వి) | (బహు) |
| స్. | ఔ | అస్ |
| మ్ | | న్ |
| ఇన | భ్యామ్ | భిస్ |
| య | , | భ్యస్ |
| అత్ | ,, | , |
| స్య. | ఓస్ | నామ్ |
| ఇ | ,, | సు |

| అకారాన్త నపుంసకలింగశబ్దములకు చేరు సుప్ ప్రత్యయములు | | |
|---|---|---|
| (ఏక) | (ద్వి) | (బహు) |
| మ్ | ఈః | ని |
| , | | , |

తృతీయాది విభక్తులలో అకారాన్త పుంలిఙ్గ శబ్దములకు వలెనే యుండును.

ఈ క్రింది పాణినీయ సూత్రముల యర్థములను సోదాహరణముగ విచారించునది

వృద్ధిరేచి  2 అకః సవర్ణేదీర్ఘః  3 ఏఙ్ హ్రస్వాత్ సంబుద్ధేః  4 గత్యర్థకర్మణి ద్వితీయా చతుర్థ్యౌ చేష్టాయా మనధ్వని 5 అద్గుణః  6 రషాభ్యాం నో ణః సమానపదే  7 అట్కుప్వాఙ్ నుమ్ వ్యవాయేఽపి  8 న పదాన్తస్య `9 సుపి చ  0 యేవాఙ్గ వికారః  1 బహువచనే ఝల్యేత్ ,  12 స్పృహేరీప్సితః . 13 క్రుధద్రుహేర్ష్యాసూయార్థానాం యం ప్రతి కోపః  14. ఏఙః పదాన్తాదతి  5. ఓసి చ  6 నామి  17 అదేశ ప్రత్యయయోః 18 కుప్వోఃXకXపౌ చ

ఈ క్రింద పేర్కొనబడినవానికి ఎట్టి మార్పు కలుగునో ఉదా
హరణముగ వివరించునది

పదాంత సకారమునకు

2 నకారాది బహువచన ప్రత్యయమునకు ముందున్న అచ్చునకు

3 అకారముకంటె పరమయిన విసర్గకు అచ్చుగాని నాదహల్లు
పరమగునపుడు

4 ఆకారముకంటె పరమయిన విసర్గ నాదహల్లు పరమగునపుడు

5 విసర్గకు క ఖ లు పరముగా నున్నప్పుడు

6 విసర్గకు చ ఛ లు పరముగా నున్నప్పుడు

7 విసర్గకు ట ఠ లు పరముగా నున్నప్పుడు

8 అకారముకంటె పరమయిన విసర్గకు అకారేతరాచ్చు పరమగు
నప్పుడు

9 ఆకారముకంటె పరమయిన విసర్గకు అకారము పరమగునపుడు

0 అ ఆ లు తప్ప తక్కిన అచ్చులకంటె పరమయిన విసర్గకు
అచ్చుగాని నాదహల్లుగాని పరమగునపుడు

1 విసర్గకు శ ష స లు పరమగునపుడు

(పైవాని కన్నింటికిని మీ పాఠ్యములోగల యనేకోదాహరణము
లను సంగ్రహించునది)

క్రింది ప్రత్యాహారములను వివరించునది

అక్ - హశ్ - ఖర్ - అట్ - ఇచ్

సమానార్థములలో క్రింది శబ్దముల లింగభేదములను గుర్తించునది—

దేహః (పుం)
శరీరమ్ (న) } = శరీరము

ఓదనః (పుం)
అన్నమ్ (న) } = అన్నము

పల్వలః (పుం)
పల్వలమ్ (న) } = నీటిగుంట

శిఖరః (పుం)
శిఖరమ్ (న) } = శిఖరము

తటాకః (పుం)<br>
తటాకమ్ (న) } = చెఱువు

ఆకాశః (పుం)<br>
ఆకాశమ్ (న) } = ఆకాశము

అలంకారః (పుం)<br>
భూషణమ్ (న) } = ఆభరణము<br>
ఆభరణమ్ (న)

ఈ క్రింది వాక్యములను సంస్కృతీకరించునది—

తటాకములందు జలమును మనుష్యులు త్రాగుదురు

బాలురిద్దరు చదువుటకొఱకు విద్యాలయమునకు పోవుచున్నారు

దుర్జనులు సజ్జనులకు ద్రోహము చేయుదురు

క్రీడాంగణమునందు ఆడుకొనుటకొఱకు బాలురు పోవుచున్నారు

గ్రీష్మమునందు సూర్యుని ప్రకాశముచే తటాకములయందు నీరు శుష్కించుచున్నది

రాముడు లక్ష్మణుడు భరతుడు, శత్రుఘ్నుడు దశరథునియొక్క పుత్రులు

కుశుడు లవుడు రామునియొక్క పుత్రులు

నృపునియొక్క పుత్రుడు రథముతో నగరమునందు తిరుగుచున్నాడు

మేషములయొక్క యూథములు పర్వతములయొక్క శిఖరములయందు సంచరించును

నరులు పండితులయొక్క చరితమును లోకమునందు ప్రకటింతురు

బాలురు విద్యాలయమునుండి భోజనముకొఱకు ఇండ్లకు పోవుచున్నారు

పండితులు పుస్తకములను రచించుచున్నారు

శునకములు, వరాహములు గ్రామములందు సంచరించును

వ్యాఘ్రములు, సింహములు వనములందు సంచరించును

కాసారములయొక్క జలములయందు పద్మములు వికసించును

నరపాలునియొక్క సైనికులు నగరములను చోరులనుండి రక్షింతురు.

బాలురు పుస్తకములకొఱకు దుకాణములవద్దకు పోవుచున్నారు

బాలరయొక్క హృదయములు ఉపహారములచే తుష్టినందుచున్నవి

రోగములు నరులను పీడించును

సజ్జనులు మిత్రులను స్మరింతురు.

నృపులు బుధులకొఱకు ధనమును ఇచ్చుచున్నారు

గ్రీష్మమునందు జనులు దప్పిగొనుచున్నారు

బాలురు దండములతో మర్కటములను కొట్టుచున్నారు

నేను రెండు వస్త్రములతో దేహమును ఆచ్ఛాదించుకొనుచున్నాను

మానవులు ధనముకొఱకు శ్రమించుచున్నారు

జనకుడు పుత్త్రులనిద్దరిని క్షమించుచున్నాడు

నృపుడు భృత్యులను కోపించుచున్నాడు

మనుష్యులు మిత్రులయొక్క అభ్యుదయమును కాంక్షింతురు

మేకలయొక్క మందల యందలి శునకములు, మేకలను కాపాడును

మీరు శరీరములను అలంకారములతో భూషించుచున్నారు

ఆమె పీటకొఱకై తటాకమునకు పోవుచున్నది

జనకుడు పుత్త్రులయొక్క అభ్యుదయమును కాంక్షించును

బాలికలయొక్క పాదములు కోమలములై యుండును

వసంతము ఉద్యానమునందలి వృక్షములను పర్ణములతో పుష్పములతో భూషించును.

శిష్యులు ఆచార్యులను ప్రశ్నించుచున్నారు.



తృతీయః పాఠః - మూడవ పాఠము

# ఆత్మనేపదము

సంస్కృతభాషలో రెండురకముల తిఙ్ ప్రత్యయములు కలవు-

(1) పరస్మైపదములు , (2) ఆత్మనేపదములు.

కొన్ని ధాతువులకు పరస్మైపదప్రత్యయములుమాత్రమే చేరును. కొన్నిధాతువులకు ఆత్మనేపదప్రత్యయములు మాత్రమే చేరును. కొన్ని ధాతువులకు రెండును చేరుచుండును పరస్మైపద ప్రత్యయములు మాత్రమే చేరు ధాతువులు పరస్మైపదిధాతువులు లేక పరస్మైపదులు అనబడును ఆత్మనేపదప్రత్యయములు మాత్రమే చేరు ధాతువులు ఆత్మనేపదిధాతువులు లేక ఆత్మనేపదులు అనబడును. రెండురకముల ప్రత్యయములును చేరు ధాతువులు ఉభయపదిధాతువులు లేక ఉభయపదులు అనబడును కావున ధాతువులకు చేరు తిఙ్ ప్రత్యయములనుబట్టి ధాతువులను - పరస్మైపదులు, ఆత్మనేపదులు, ఉభయపదులు, అని మూడు రకములుగా విభజింపవచ్చును అన్ని గణములందును ఈ మూడురకముల ధాతువులును ఉండును (కాని పదవగణములో కేవల పరస్మైపది ధాతువులు లేవు)

ఇంతకుముందు పేర్కొనబడిన ధాతువులన్నియు పరస్మైపదులు. తిఙ్ ప్రత్యయములన్నియు పరస్మైపదములు

### వర్తమానార్థకము - ప్రథమ పురుష

వన్దతే = వందనము చేయుచున్నాడు

వన్దేతే = (ఇద్దరు) వందనము చేయుచున్నారు

వన్దన్తే = వందనముచేయుచున్నారు

వీనిలో వన్ద్ అనునది ధాతువు అ' అనునది వికరణ యము తే ఇతే అన్తే - అనునవి ఆత్మనేపద ప్రథమపురుష ప్రత్యయములు

వన్ద్ + అ + తే = వన్దతే వన్ద్ + అ + ఇతే=వన్దేతే (సు వన్ద్ + అ + అన్తే= వన్దన్తే (సూ-8)

సః వన్దతే తౌ వన్దేతే తే వన్దన్తే

### మధ్యమ పురుష

వన్దసే = వందనము చేయుచున్నావు

వన్దేథే = (మీరిద్దరు) వందనము చేయుచున్నారు

వన్దధ్వే = (మీరు) వందనము చేయుచున్నారు

వీనిలో సే ఇథే ధ్వే - అనునవి ఆత్మనేపద మధ్యమపురు షీజ్ ప్రత్యయములు

వన్ద్ + అ + సే=వన్దసే వన్ద్ + అ +ఇథే=వన్దేథే ( సూ-27 వన్ద్ + అ + ధ్వే = వన్దధ్వే

త్వం వన్దసే యువామ్ వన్దేథే యూయమ్ వన్దధ్వే

### ఉత్తమ పురుష

వన్దే = వందనము చేయుచున్నాను

వన్దావహే = (మేమిద్దఱము) వందనము చేయుచున్నాము

వన్దామహే = వందనము చేయుచున్నారు

వీనిలో ఏ, వహే, మహే - అనునవి ఆత్మనేపద ఉత్తమపురుష తిఙ్ ప్రత్యయములు

వన్ద్+ అ +ఏ=వన్దే (సూ-3) వన్ద్ + అ + వహే = వన్దావహే (సూ-7), వన్ద్ + అ + మహే = వన్దామహే (సూ-7) .

అహం వన్దే , ఆవాం వన్దావహే , వయం వన్దామహే ,

మొదటిగణమునందలి కొన్ని ఆత్మనేపదిధాతువులు -

| | |
|---|---|
| వన్ద్-అభివాదనస్తుత్యోః = వందనముచేయుట | వన్దతే |
| భాష్ - వ్యక్తాయాం వాచి = మాటలాడుట | భాషతే |
| కత్థ్ - శ్లాఘాయామ్ = పొగడుకొనుట | కత్థతే |
| కమ్ప్ - చలనే = కంపించుట, కదలుట | కమ్పతే |
| యత్ - ప్రయత్నే = యత్నించుట | యతతే |
| క్షమ్ - సహనే = క్షమించుట, సహించుట | క్షమతే |
| లభ్ - ప్రాప్తౌ = పొందుట | లభతే |
| వేప్ - కమ్పనే = కంపించుట, వణకుట | వేపతే |
| శఙ్క్ - శఙ్కాయామ్=శంకించుట | శఙ్కతే |
| శిక్ష్ - విద్యోపాదానే = నేర్చుకొనుట | శిక్షతే |
| శ్లాఘ్ - కత్థనే = పొగడుట | శ్లాఘతే |
| సహ్ - మర్షణే = ఓర్చుట | సహతే |
| సేవ్ - సేవనే = సేవచేయుట | సేవతే |
| డీ - విహాయసా గతౌ = ఆకసమునందు ఎగురుట | డయతే |
| ముద్ - హర్షే = సంతోషించుట | మోదతే |
| వృత్ - వర్తనే = ఉండుట | వర్తతే |
| రుచ్ - దీప్తౌ, అభిప్రీతౌ చ = ప్రకాశించుట, ఇష్టమగుట | రోచతే |

వృధ్ - వృద్ధౌ = వర్ధిల్లుట వర్ధతే
భిక్ష్ - భిక్షాయామ్ = బిచ్చమెత్తుట, యాచించుట భిక్షతే
శుభ్ - దీప్తౌ = శోభిల్లుట శోభతే

వయం దేవం వన్దామహే
బుధాః సత్యం భాషన్తే
మూర్ఖాః స్వగుణాన్ కత్థన్తే
వృక్షో వాతేన కమ్పతే
నరా ధనాయ యతన్తే
దేవః పాపానాం పాపాని క్షమతే
నరా ఉద్యోగేన ధనం లభన్తే
హృదయాని భయాద్వేపన్తే
మూర్ఖో మిత్రాణి శఙ్కతే
తాః నృత్యం శిక్షన్తే
జనా నృపాన్ శ్లాఘన్తే
మూర్ఖ త్వం పుత్రాణాం పాపాని సహసే
సేవకా నృపం సేవన్తే
విహగా ఆకాశే డయన్తే
శిష్యాణా మభ్యుదయాదాచార్యో మోదతే
వయం నగరే వర్తామహే
బాలకేభ్యః ఫలాని రోచన్తే
విద్యాలయేషు పఠనేన బాలానాం జ్ఞానం వర్ధతే
భిక్షుకా అన్నం భిక్షన్తే
వసన్తే వృక్షాః పుష్పైః శోభన్తే

సూ - 47 ఝలాం జశోఽన్తే (పా సూ)=పదాన్తమందలి అనునాసిక భిన్న వర్గీయాక్షరములకు అచ్చుగాని నాదహల్లుగాని పరమగు నపుడు అవసానమునందును ఆయా వర్గల మూడవ యక్షరములు (గజడదబలు) ఆదేశమగును

ఉదా - అభ్యుదయాత్ + ఆచార్యః = అభ్యుదయాదాచార్యః, భయాత్+వేపన్తే=భయాద్వేపన్తే (జబగడద అను హల్లులకు జశ్ అనునది ప్రత్యాహారసంజ్ఞ)

సూ - 48 రుచ్యర్థానాం ప్రీయమాణః (పా సూ) = రుచ్యర్థకధాతువుల ప్రయోగమునందు ఇష్టపడువానిని తెలుపు పదమునకు చతుర్థీ విభక్తి వచ్చును

ఉదా - బాలకేభ్యః రోచన్తే = బాలకులకు ఇష్టమగుచున్నవి

నాల్గవ గణము

| | ఏక. | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర పు) | యుధ్యతే | యుధ్యేతే | యుధ్యన్తే |
| (మ పు) | యుధ్యసే | యుధ్యేథే | యుధ్యధ్వే |
| (ఉ పు) | యుధ్యే | యుధ్యావహే | యుధ్యామహే |

వీనిలో యుధ్ అనునది ధాతువు య అనునది వికరణ ప్రత్యయము తే ఇతే అన్తే మున్నగునవి ఆత్మనేపద తిఙ్ ప్రత్యయములు

నాల్గవ గణమునందలి కొన్ని ఆత్మనేపదిధాతువులు -

యుధ్ - సంప్రహారే = యుద్ధముచేయుట యుధ్యతే

దీప్ - దీప్తౌ = ప్రకాశించుట దీప్యతే

విద్ - సత్తాయామ్ = ఉండుట — విద్యతే
జన్ (జా) - ప్రాదుర్భావే = పుట్టుట, కలుగుట — జాయతే
దూ - పరితాపే = పరితపించుట — దూయతే
మన్ - జ్ఞానే = తలంచుట — మన్యతే
ఖిద్ - దైన్యే = ఖేదమును బొందుట — ఖిద్యతే

## ఆరవ గణము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | లజ్జతే | లజ్జేతే | లజ్జన్తే |
| (మ పు) | లజ్జసే | లజ్జేథే | లజ్జధ్వే |
| (ఉ పు) | లజ్జే | లజ్జావహే | లజ్జామహే |

వీనిలో 'లజ్జ్' అనునది ధాతువు 'అ' అనునది వికరణప్రత్యయము, తే, ఇతే అన్తే - మున్నగునవి ఆత్మనేపద తిఙ్ ప్రత్యయములు

ఆరవ గణమునందలి కొన్ని ఆత్మనేపదిధాతువులు -

లజ్జ్ - వ్రీడాయామ్ = సిగ్గుపడుట — లజ్జతే
మృ - ప్రాణత్యాగే = మరణించుట — మ్రియతే
ధృ - అవస్థానే = జీవించియుండుట — ధ్రియతే

సూ - 49 వికరణప్రత్యయము పరమగునపుడు ఆరవ గణమునందలి ధాతువుల చివరి ఋకారము 'రియ్' అని మారును

ఉదా:- మృ + అ + తే = మ్రియతే

## పదవ గణము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | అర్థయతే | అర్థయేతే | అర్థయన్తే |
| (మ పు) | అర్థయసే | అర్థయేథే | అర్థయధ్వే |
| (ఉ పు) | అర్థయే | అర్థయావహే | అర్థయామహే |

వీనిలో 'అర్థ' అనునది ధాతువు 'అయ' అనునది వికరణ ప్రత్యయము తే, ఇతే, అన్తే — మున్నగునవి ఆత్మనేపద తిజ్ ప్రత్యయములు

అర్థ + అయ + తే=అర్థ్ + అయ + తే = అర్థయతే (సూ- 9)

పదవ గణమునందలి కొన్ని ఆత్మనేపదిధాతువులు —

| | |
|---|---|
| అర్థ - ఉపయాచ్ఞాయామ్ = అర్థించుట కోరుట | అర్థయతే |
| మన్త్ర్ - గుప్తపరిభాషణే = మన్త్రాలోచనముచేయుట | మన్త్రయతే |
| తర్జ - తర్జనే = భయపెట్టుట | తర్జయతే |
| తన్త్ర్ - కుటుంబధారణే = పెంచుట, సాకుట | తన్త్రయతే |
| మృగ - అన్వేషణే = వెదకుట | మృగయతే |

(మృగధాతువుల అకారాంత మగుటచే గకారము ఉపధయగును గాని ఋకారము ఉపధ కానేరదు కావున దానికి గుణమురాదు )

యోధా స్సమరాఙ్గణే యుధ్యన్తే
ఆకాశే చన్ద్రో దీవ్యతే
ఆచార్యస్య గృహే పుస్తకాని విద్యన్తే
జ్ఞానా న్మోక్షో జాయతే
సజ్జనానాం హృదయాని పాపైర్దూయన్తే
వయం సూర్యం దేవం మన్యామహే

మిత్రాణాం దుఃఖైర్నరస్య హృదయం భిద్యతే
మూర్ఖా అజ్ఞానాల్లజ్జన్తే
వ్యాధానాం శరైరరణ్యే మృగా మ్రియన్తే
దేవస్య ప్రసాదేన ప్రీయన్తే జీవాః
నృపస్య సచివా మన్త్రయన్తే
చోరా నరాన్ తర్జయన్తే
నరా గృహేషు కుక్కురాన్ తన్త్రయన్తే
బాలాః ఖేలనాయ పత్రాణి మృగయన్తే
యాచకా ధన మర్థయన్తే

సూ - ౬0 యరోఽనునాసికేఽనునాసికో వా (పా సూ) = అనునాసిక హల్లులు పరమగునపుడు వర్గలయందలి మొదటి నల్గు వర్ణములకును ఆవర్గయందలి అనునాసికాక్షరము వికల్పముగా ఆదేశమగును

ఉదా - జ్ఞానాత్ + మోక్షః = జ్ఞానాన్మోక్షః లేక జ్ఞానాద్మోక్షః (సూ - 47)

సూ - ౬ తోర్లి (పా సూ) = తవర్గాక్షరమునకు లకారము పరమగునపుడు పరసవర్ణము (అనగా లకారము) ఆదేశమగును

ఉదా - అజ్ఞానాత్ + లజ్జన్తే = అజ్ఞానాల్లజ్జన్తే

(నకారమునకు లకారము పరమగునపుడు అనునాసిక లకారము ఆదేశమగును ఉదా - పుస్తకాన్ + లిఖతి = పుస్తకాఁల్లిఖతి)

## కర్మార్థకము - భావార్థకము

సకర్మక ధాతువులకు కర్త్రర్థమునందు కర్మార్థమునందును, అకర్మక ధాతువులకు కర్త్రర్థమునందు భావార్థమునందును తిఙన్త రూపము లేర్పడును

సూ - 52 లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః (పా సూ) = సకర్మక ధాతువులకు కర్త్రర్థమునందును కర్మార్థమునందును, అకర్మక ధాతువులకు కర్త్రర్థమునందు భావార్థమునందును, లకారములు చేరును

కర్త్రర్థక క్రియాపదములచే కర్త ఆతడు చేయు పని బోధింపబడును అందుచే ఆ క్రియాపదముల పురుష వచనములు కర్తను అనుసరించి యుండును ఉదా - పఠతి=చదువుచున్నాడు దీనిచే చదువుచున్నవాడు, ఆతడు చేయుపని బోధింపబడుచున్నవి అందుచే కర్త ఏ వచనమునందుండునో క్రియాపదముకూడ అదే వచనమునం దుండును కర్త ఏ పురుషకు సంబంధించునో క్రియాపదముకూడ అదే పురుషమునందుండును. తౌ పఠతః = వారిద్దరు చదువుచున్నారు , తే పఠన్తి = వారు చదువుచున్నారు త్వం పఠసి=నీవు చదువుచున్నావు అహం పఠామి = నేను చదువుచున్నాను

ఇంతకుముందు చెప్పబడిన క్రియాపదములన్నియు కర్త్రర్థకములు.

కర్మార్థక క్రియాపదములచే కర్మ, అది పొందు పని, బోధింపబడును అందుచే ఆ క్రియాపదముల పురుషవచనములు కర్మననుసరించి యుండును ఉదా - పఠ్యతే = చదువబడుచున్నది దీనిచే చదువుచున్న కర్త బోధింపబడుటలేదు చదువబడుచున్నదియు (పాఠము), అది పొందు ఫలితమును (చదువబడుట) బోధింపబడుచున్నవి అందుచే కర్మ ఏ వచనమునందుండునో క్రియాపదముకూడ అదే వచనమునందుండును. కర్మ ఏ పురుషకు సంబంధించునో క్రియ పదముకూడ అదే పురుషమునందుండును పాఠః పఠ్యతే = పాఠము చదువబడుచున్నది పాఠౌ పఠ్యేతే = రెండుపాఠములు చదువబడుచున్నవి పాఠాః పఠ్యన్తే = పాఠములు చదువబడుచున్నవి

కర్మార్థక క్రియాపదములచే కర్మ బోధింపబడుటచే సకర్మక ధాతువులకే కర్మార్థకరూపము లేర్పడును అకర్మధాతువులకు భావార్థక రూపము లేర్పడును

కర్మార్థకరూపములు భావార్థకరూపములును సమానముగనే యుండును కాని భావార్థకములకు ప్రథమ పురుషైక వచనమునందు మాత్రమే ప్రయోగముండును తక్కిన పురుషవచనములలో భావార్థక రూపము లుండవు

ధాతువునకు య అను దానిని చేర్చుటచే కర్మార్థక భావార్థక ధాతు రూపము లేర్పడును వీనికి ఎల్లప్పుడును ఆత్మనేపద లిఙ్ ప్రత్యయములే చేరును వికరణప్రత్యయములు చేరవుగనుక ఇందు గుణ ముల వలన కలుగుభేదములేదు ఉదా - పఠ్ + య + తే = పఠ్యతే = చదువబడుచున్నది లిఖ్ + య + తే = లిఖ్యతే = వ్రాయబడుచున్నది భూ+య+తే=భూయతే=ఉన్నాడు అగుచున్నాడు (ఉండుట అగుట అను భావార్థములు మాత్రమే ఇచ్చట ప్రధానముగా బోధింపబడును )

య అను ప్రత్యయము మూలధాతువులకే చేరును వికరణ ప్రత్యయములు పరమగునపుడు కలుగు ధాత్వాదేశము లిందురావు ఉదా - గమ్+య+తే=గమ్యతే - ఇచ్చట గచ్ఛ్ అను ఆదేశమురాదు దృశ్+య+తే=దృశ్యతే - ఇచ్చట పశ్య అను ఆదేశమురాదు

య అను ఈ ప్రత్యయము పరమగునపుడు ___

) ధాతువు చివరి ఇకార ఉకారములకు దీర్ఘమువచ్చును
ఉదా - జి+య+తే=జీయతే శ్రు+య+తే=శ్రూయతే

2) అసంయుక్త పూర్వకమయిన ఋకారమునకు రి అను ఆదేశము వచ్చును ఉదా - కృ + య + తే = క్రియతే

3) సంయుక్త పూర్వకమైన ఋకారమునకు జాగృ ఋ ధాతువుల ఋకారమునకును గుణము వచ్చును ఉదా - స్మృ+య+తే=స్మర్యతే జాగృ + య + తే = జాగర్యతే ఋ + య + తే = అర్యతే

4) పదవ గణమునందలి ధాతువుల ఉపధయగు అకారమునకు చివరి ఇక్కునకును వృద్ధి ఉపధయగు అకారేతర హ్రస్వమునకు గుణమును వచ్చును

ఉదా - తడ్+య+తే = తాడ్యతే చుర్+య+తే = చోర్యతే

5) దా దే దో ధా ధే మా స్థా గా పా హా సా — అను ధాతువుల చివరి అచ్చునకు ఈకారాదేశ మగును

ఉదా - దా+య+తే=దీయతే స్థా+య+తే=స్థీయతే పా+య+తే= పీయతే

(కాని దా-లవనే హా-గతౌ — అను ధాతువుల అచ్చునకు ఈకారాదేశము రాదు)

6) శంస్ దంశ్ రఞ్జ్ - మున్నగు కొన్ని ధాతువుల అనునాసికమునకు లోపము వచ్చును ఉదా – శంస్ + య + తే = శస్యతే దంశ్ + య + తే = దశ్యతే రఞ్జ్ + య + తే = రజ్యతే

7) వచ్ స్వప్ యజ్ పద్ వస్ ప్రచ్ఛ్ — మున్నగు కొన్ని ధాతువులయందలి యకార వకార రేఫములకు వరుసగా ఇ ఉ, ఋ అను ఆదేశములగును అప్పుడు వానితో గూడియున్న అచ్చు లోపించును ఉదా - వచ్ + య + తే = ఉచ్యతే స్వప్+య+తే=సుప్యతే యజ్+య+తే=ఇజ్యతే వస్+య+తే= ఉష్యతే ప్రచ్ఛ్+య+తే=పృచ్ఛ్యతే

8) ౠకారాన్త ధాతువుల చివరి ౠకారమునకు ఈర్ అను ఆదేశమగును ఉదా - తౄ+య+తే=తీర్యతే

## కర్మార్థక క్రియాపదములు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | పూజ్యతే | పూజ్యేతే | పూజ్యన్తే |
| (మ పు) | పూజ్యసే | పూజ్యేథే | పూజ్యధ్వే |
| (ఉ పు) | పూజ్యే | పూజ్యావహే | పూజ్యామహే |

కర్త్రర్థక ప్రయోగ వాక్యమునందు కర్తృపదము ప్రథమావిభక్తి యందు కర్మపదము ద్వితీయావిభక్తి యందును ఉండును క్రియాపదము యొక్క పురుషవచనములు కర్తననుసరించి యుండును

కర్మార్థక ప్రయోగ వాక్యమునందు కర్తృపదము తృతీయావిభక్తి యందు కర్మపదము ప్రథమావిభక్తియందును ఉండును క్రియాపదము యొక్క పురుషవచనములు కర్మననుసరించి యుండును

భావార్థక ప్రయోగ వాక్యమునందు కర్తృపదము తృతీయావిభక్తి యందును, క్రియపద మెల్లప్పుడు ప్రథమ పురుషైక వచనమునందే యుండును

| పుంలింగము | స్త్రీలింగము | నపుంసకలింగము |
|---|---|---|
| తమ్ = వానిని | తామ్ = ఆమెను | తత్ = దానిని |
| తౌ = వారిద్దరిని | తే = వారిద్దరిని | తే = ఆ రెంటిని |
| తాన్ = వారిని | తాః = వారిని | తాని = వాటిని |
| తేన = వానిచే | తయా = ఆమెచే | తేన = దానిచే |
| తాభ్యామ్ = వారిద్దరిచే | తాభ్యామ్=వారిద్దరిచే | తాభ్యామ్=ఆరెంటిచే |
| తైః = వారిచే | తాభిః = వారిచే | తైః = వాటిచే |

త్వామ్=నిన్ను  యువామ్ = మీ యిద్దరిని  యుష్మాన్ = మిమ్ములను  త్వయా=నీచే  యువాభ్యామ్=మీయిద్దరిచే  యుష్మాభిః=మీచే  మామ్=నన్ను  ఆవామ్=మాయిద్దరిని  అస్మాన్=మమ్ములను  మయా=నాచే  ఆవాభ్యామ్=మాయిద్దరిచే  అస్మాభి =మాచే

కర్త్రర్థకము —

బాలః పారం పఠతి
బాలౌ పారం పఠతః
బాలాః పారం పఠన్తి
త్వం పారం పఠసి
అహం పారం పఠామి
సః పాఠౌ పఠతి
సః పాఠాన్ పఠతి
త్వం పాఠాన్ పఠసి
అహం పాఠౌ పఠామి
పుత్త్రః జనకం నమతి
స్తేనాః ధాన్యం చోరయన్తి
ధనికౌ ధనం యచ్ఛతః

కర్మార్థకము —

బాలేన పాఠః పఠ్యతే
బాలాభ్యాం పాఠః పఠ్యతే
బాలైః పాఠః పఠ్యతే
త్వయా పాఠః పఠ్యతే
మయా పాఠః పఠ్యతే
తేన పాఠౌ పఠ్యేతే
తేన పాఠాః పఠ్యన్తే
త్వయా పాఠాః పఠ్యన్తే
మయా పాఠౌ పఠ్యేతే
పుత్త్రేణ జనకః నమ్యతే
స్తేనైః ధాన్యం చోర్యతే
ధనికాభ్యాం ధనం దీయతే

కర్త్రర్థకము —

సః భవతి
తౌ భవతః
తే భవన్తి
త్వం భవసి
అహం భవామి
వయం నగరే వసామః
ధూర్తాః సరన్తి
మర్త్యాః మ్రియన్తే

భావార్థకము —

తేన భూయతే
తాభ్యాం భూయతే
తైః భూయతే
త్వయా భూయతే
మయా భూయతే
అస్మాభిః నగరే ఉష్యతే
ధూర్తైః స్రియతే
మర్త్యైః మ్రియతే

## అభ్యాసము 3

**[వర్తమానార్థకము(లట్)—ఆత్మనేపదము]**

**తిఙ్ ప్రత్యయములు**

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | తే | ఇతే | అన్తే |
| (మ పు) | సే | ఇథే | ధ్వే |
| (ఉ పు) | ఏ | వహే | మహే |

**క్రియాపదములు**

| | | | |
|---|---|---|---|
| (ప్ర పు) | వర్తతే | వర్తేతే | వర్తన్తే |
| (మ పు) | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| (ఉ పు) | వర్తే | వర్తావహే | వర్తామహే |

**వాక్యప్రయోగములు**

| | | |
|---|---|---|
| సః వర్తతే | తౌ వర్తేతే | తే వర్తన్తే |
| త్వం వర్తసే | యువాం వర్తేథే | యూయం వర్తధ్వే |
| అహం వర్తే | ఆవాం వర్తావహే | వయం వర్తామహే |

క్రింది పాణిని సూత్రముల యర్థములను సోదాహరణముగ వివరింపునది

ఝలాం జశోఽన్తే 2 రుచ్యర్థానాం ప్రీయమాణః 3 యరోఽనునాసికేఽనునాసికో వా 4 తోర్లి 5 లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః

ఆరవ గణమునందలి ధాతువుల తుది ఋకారమునకు వికరణ ప్రత్యయము పరమగునపుడు కలుగు మార్పును సోదాహరణముగ వివరించునది

నకారమునకు లకారము పరమగునపుడు కలుగు మార్పును సోదాహరణముగ వివరించునది

ఎన్నిరకముల తిఙ్ ప్రత్యయములు కలవో తెలిపి వానినిబట్టి ధాతువుల నెన్నిరకములుగా విభజింపవచ్చునో వివరించునది

కర్మార్థక భావార్థక క్రియాపద రూపము లెట్లేర్పడునో సోదాహరణముగ వివరించునది

కర్మార్థకములకు భావార్థకములకునుగల సామ్యభేదములను సోదాహరణముగా వివరించునది

కర్మార్థక భావార్థకరూపము లేర్పడునపుడు మూలధాతురూపములలో కలుగు మార్పులను సోదాహరణముగ వివరించునది

కర్త్రర్థక వాక్యమును కర్మార్థక వాక్యముగా మార్చుటకు చేయవలసిన మార్పులను వివరించునది

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది

నరా దేవం వన్దన్తే
బాలః హస్తౌ జలేన క్షాలయతి
జనాః యుష్మాన్ మృగయన్తే
భృత్యాః మాం సేవన్తే
దేవః అస్మాన్ రక్షతి
భిక్షుకాః అన్నమ్ అర్థయన్తే
అన్నం శరీరం పుష్యతి
కృష్ణస్య దేహం అలఙ్కారైః భూషయతి
నృపాణాం గుణాన్ బుధాః ప్రథయన్తి
చోరాన్ నృపాః దణ్డయన్తి
నరాః సుఖం వాఞ్ఛన్తి
సేనానాయకః సైనికాన్ గణయతి
సదాచారః దేవాన్ ప్రీణయతి
బాలాః క్రీడాఙ్గణే తిష్ఠన్తి
పథికాః జలం పిబన్తి
గృహాద్గృహం యాచకోఽటతి

అయం జనకం నమతి
యోధాః సమరాఙ్గణే యుధ్యన్తే
గృహేషు పుస్తకాని విద్యన్తే
నరాః ఫలాని భక్షయన్తి

క్రింది వాక్యములను సంస్కృతీకరింపుడు —

కాసారములు పద్మములతో శోభిల్లుచున్నవి
శత్రువుయొక్క సైనికులు సమరాంగణమునందు యుద్ధముచేయుచున్నారు
సజ్జనులు అసత్యమును భాషించుచున్నారు
పుత్రులయొక్క అభ్యుదయమునందు బుధులు సంతోషించుచున్నారు
విహగములు వృక్షమునుండి వృక్షమువద్దకు ఎగురుచున్నవి
వసంతమునందు వృక్షములు పుష్పములచే భూషింపబడును
మూర్ఖులచే స్వగుణములు పొగడుకొనబడుచున్నవి
జనకుడు పుత్రునియొక్క దురాచారములచే పరితపించును
సమరాంగణమునందు సైనికులు మరణించుచున్నారు
యాచకులచే అన్నము యాచింపబడుచున్నది
నృపులచే బుధులకొఱకు ధనము ఇయ్యబడుచున్నది
నటులు సజ్జనులను శ్లాఘించుచున్నారు
మీచే దేవుడు నమస్కరింపబడుచున్నాడు
జనకునిచే పుత్రులిద్దరు క్షమింపబడుచున్నారు
మూర్ఖులయొక్క హృదయములు దుఃఖముచే ఖేదపడును
రాముడు విశ్వామిత్రునివలన అస్త్రములను నేర్చుకొనుచున్నాడు
క్రోధమువలన దుఃఖము కలుగును
వసంతమునందు కుసుమములను పొందుచున్నాము
దండనమువలని భయముచేత హృదయము వణకుచున్నది
జనులయొక్క సుఖముకొఱకు నృపుడు యత్నించును

చతుర్థః పాఠః - నాలుగవ పాఠము

# అవ్యయములు

సదృశం త్రిషు లిఙ్గేషు సర్వాసు చ విభక్తిషు
వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్ ॥

మూడు లింగములయందు అన్ని విభక్తులయందు అన్ని వచనములయందును మార్పును చెందక ఎకరూపముగా నుండునది అవ్యయమని భావము

( లిఙ్గ విభక్తి వచన శూన్యా న్యవ్యయాని ॥ )

లింగ విభక్తి వచన బోధకములు కేనివి అవ్యయము లని భావము ఆ ప్రత్యయములు పరమందు లేకపోవుటచేతనే అవ్యయములు మార్పులెక ఎల్లప్పుడు ఏకరూపముగా నుండును

ప్రతిపదోక్తావ్యయములు, లాక్షణికావ్యయములు అని అవ్యయములను రెండురకములుగా విభజింపవచ్చును ప్రతిపదోక్తావ్యయములనే కేవలావ్యయములు అని కూడ అందురు

కొన్నిటిని ప్రతి పదమును గణములలో పేర్కొవి, ఆ గణములందలి శబ్దము లన్నియు అవ్యయములని చెప్పబడుటచే అట్టివి ప్రతిపదోక్తావ్యయము లనబడును

కృదంతములలో కొన్ని అవ్యయములు కలవు తద్ధితాంతములలో కొన్ని అవ్యయములు కలవు సమాసములలో కొన్ని — అనగా అవ్యయీభావ సమాసములు — అవ్యయములు

లక్షణములచే సిద్ధించునవి లాక్షణికములు. లక్షణము లనగా సూత్రములు. కృత్ప్రత్యయ విధాయక సూత్రములచే తద్ధిత ప్రత్యయ విధాయక సూత్రములచే సమాస విధాయక సూత్రములచేతను నిష్పన్నములైన శబ్దస్వరూపముగల అవ్యయములు - లాక్షణికావ్యయము లనబడును. లాక్షణికావ్యయములను కృదంతావ్యయములు తద్ధితాంతావ్యయములు, అవ్యయీభావావ్యయములు - అని మూడు రకములుగా విభజింపవచ్చును.

సూ - 52 స్వరాది నిపాత మవ్యయమ్ (పా సూ) = స్వరాది గణము నందలి శబ్దములు నిపాతములును (అనగా చాది గణము నందలి శబ్దములు) అవ్యయములు

సూ - 53 తద్ధితశ్చా సర్వ విభక్తిః (పా సూ) = అన్ని విభక్తి ప్రత్యయములను చేరనట్టి త. 5 మున్నగు తద్ధిత ప్రత్యయములు అంతమందుగల శబ్దములు అవ్యయములు

సూ - 54 కృన్మేజన్తః (పా సూ) = మకారము, ఏ ఓ ఐ ఔలును అంతమందుగల కృత్ప్రత్యయాంత శబ్దములు అవ్యయములు

సూ - 55 క్త్వా తోసున్ కసునః (పా సూ) = క్త్వా, తోసున్ కసున్ - అను కృత్ప్రత్యయములు అంతమందుగల శబ్దములు అవ్యయములు

(క్త్వా ప్రత్యమునకు బదులుగా వచ్చునట్టి ల్యప్ ప్రత్యయము అంతమందుగల శబ్దములు కూడ అవ్యయములె)

సూ - 56 అవ్యయీభావశ్చ (పా సూ) = అవ్యయీ భావసమాసము కూడ అవ్యయము.

ఈ అవ్యయములన్నియును పాణినీయ వ్యాకరణములో సుబంత ములుగనే పరిగణింపబడును సుబంతత్వసిద్ధికై అవ్యయము లన్నిటికిని మొదట ఒక సుప్ ప్రత్యయము చేరి పిమ్మట అది లోపించును

సూ - 57 అవ్యయాదాప్సుపః (పా సూ) = అవ్యయముకంటె పరముగా నున్న లప్ ప్రత్యయమునకు సుప్ ప్రత్యయమునకును లోపము వచ్చును

సుప్ ప్రత్యయము లోపించినను "ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణమ్ ' అను న్యాయముచే అవ్యయము సుబంతముగా పరిగణింప బడుచున్నది

కొన్ని కేవలావ్యయములు —

చ = (సముచ్చయార్థకము)
వా = కాని లేక

(ఈ రెండును వానితో సంబంధించు ప్రతి పదమునకు పరముగా గాని అట్టి పదములలో చివరి పదమునకు మాత్రము పరముగాని ప్రయో గింపబడును ఉదా - రామశ్చ లక్ష్మణశ్చ వనం గచ్ఛతః (లేదా) రామో లక్ష్మణశ్చ వనం గచ్ఛతః అట్లే 'రామోవా లక్ష్మణోవా అని గాని 'రామో లక్ష్మణోవా' అనిగాని ప్రయోగింపవచ్చును )

న = లేదు కాదు
అపి = కూడ
సహ = తోడ
ఇవ = వలె
వినా = విడచి లేకుండ
ఏవ = ఏ (అవధారణార్థకము)
హి = కదా (ప్రసిద్ధార్థకము)
హే = ఓ (సంబోధనార్థకము)
నమః = నమస్కారము
స్వస్తి = శుభము
అలమ్ = సమర్థుడు చాలును
సదా = ఎల్లప్పుడు
ఏవమ్ = ఈరీతిగ
ఇతి = అని

3 ఇకారాంత పుంలింగ శబ్దములు -

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | కవిః | కవీ | కవయః |
| (సం ప్ర) (హే) | కవే | | |
| (ద్వి వి) | కవిమ్ | | కవీన్ |

పై పదములలో కవి అనునది ప్రాతిపదికము న్ ఔ అస్- అనునవి ప్రథమా విభక్తి సుప్ ప్రత్యయములు మ్, ఔ స్ - అనునవి ద్వితీయా విభక్తి సుప్ ప్రత్యయములు

కవి + స్ = కవిః (సూ - 20)

సూ - 58 ఇకారాంత ఉకారాంత శబ్దములకంటె పరమయిన ప్రథమా, ద్వితీయా విభక్తుల ద్వివచన ప్రత్యయమునకు లోపము దానికి ముందున్న ఇకార ఉకారములకు దీర్ఘమును వచ్చును

కవి + ఔ = కవీ

సూ - 59 జసి చ (పా సూ) = అస్ అను ప్రథమా బహువచన ప్రత్యయము పరమగునపుడు అకారేతర హ్రస్వమునకు గుణము వచ్చును

కవి + అస్ = కవే + అస్ = కవయ్ + అస్ (సూ- 2) = కవయః (సూ-20)

సూ - 60 హ్రస్వస్య గుణః (పా సూ) = సంబోధనమునందు ఏకవచన ప్రత్యయము పరమగునపుడు (అకారేతర) హ్రస్వమునకు గుణము వచ్చును

హేకవి+స్=హేకవే+స్=హేకవే (సూ-23)

కవి+న్=కవీన్ (సూ-24)

ధూర్జటిః = ఈశ్వరుడు
కపిః = కోతి
అరిః = శత్రువు
అలిః = తుమ్మెద
వ్రీహిః = ధాన్యము
రాశిః = ప్రోగు, కుప్ప

వ్యాధిః = రోగము
గిరిః = పర్వతము
కలిః = జగడము
అగ్నిః = అగ్ని
కిరిః = అడవిపంది
పాణిః = చేయి

భక్తాః ధూర్జటిం పూజయన్తి
బాలాః కపీన్ తాడయన్తి
యోధోఽరీన్ జయతి
కమల మలీన్ ప్రీణయతి
భిక్షుకా వ్రీహీన్ ఉఞ్ఛన్తి
కృషీవలో ధాన్యస్య రాశిన్ రచయతి
వ్యాధయో నరాన్ పీడయన్తి
నృపతయోఽపి యతీన్ నమన్తి
దశరథస్య పుత్త్రో దాశరథిః
ఋషయో గిరీన్ గచ్ఛన్తి
రామో లక్ష్మణశ్చ వనే మునీన్ నమతః
నృపతి రుపహారై స్సదా కవీన్ ప్రీణయతి
నరా అతిథిం దేవమివ పూజయన్తి
బుధాః కలీన్ న వాఞ్ఛన్తి
బ్రాహ్మణా అగ్నిం పూజయన్తి
మాతలి రిన్ద్రస్య సారథిః
వ్యాధః కిరీ అరణ్యే పశ్యతి
పాణీ ఈశ్వరం నమతః

సూ - 61 ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్ (పా సూ)=ఈకార, ఊకార, ఏకారములు అంతమందుగల ద్వివచన పదములకు 'ప్రగృహ్యము' అని పేరు

సూ - 62 ప్లుత ప్రగృహ్యా అచి నిత్యమ్ (పా సూ) = ప్లుతములు, ప్రగృహ్యములును అచ్చు పరమగునపుడు ప్రకృతి భావ మును పొందును (అనగా వానికి సంధి రాదని భావము)

ఉదా- కిరీ + అరణ్యే = కిరీ అరణ్యే.

## తృతీయా చతుర్థీ పంచమీ విభక్తులు

| | ఏక. | ద్వి | బహు |
|---|---|---|---|
| (తృ వి) | కవినా | కవిభ్యామ్ | కవిభిః |
| (చ వి) | కవయే | , | కవిభ్యః |
| (పం. వి) | కవేః | ,, | , |

వీనిలో నా, భ్యామ్ భిస్ - అనునవి తృతీయా విభక్తి సుప్ ప్రత్యయములు ఙే, భ్యామ్ భ్యస్ - అనునవి చతుర్థీ విభక్తి సుప్ ప్రత్యయములు అస్, భ్యామ్, భ్యస్ - అనునవి పంచమీవిభక్తి సుప్ ప్రత్యయములు.

సూ - 63 ఘేర్ఙితి (పా సూ) = చతుర్థీ పంచమీ, షష్ఠీ విభక్తుల ఏకవచన ప్రత్యయములు పరమగునపుడు కేవల పతిశబ్దము సఖి శబ్దముతప్ప తక్కిన ఇకారాంత ఉకారాంత శబ్దముల చివరి ఇకార, ఉకారములకు గుణము వచ్చును

కవి+ఎ=కవే+ఎ=కవయే (సూ- 2) కవి+అస్=కవే+అస్

సూ - 64 జసి జసోశ్చ (పా సూ) = ఏకార, ఓకారములకు పంచమీ షష్ఠీ విభక్తుల ఏకవచన ప్రత్యయముల అకారము పర మగునపుడు పూర్వరూప మేకాదేశముగ వచ్చును. (అనగా ఏకార ఓకారములు నిలచియుండి అకారము లోపించునని భావము)

కవే + అస్ = కవేస్ = కవేః (సూ-20)

పుంలింగము —

మణిః = మణి

విధిః = వేదనియమము, అదృష్టము బ్రహ్మ

అసిః = ఖడ్గము

పదాతిః = కాలిబంటు

పవిః = వజ్రాయుధము పిడుగు

బలిః = బలి

అద్రిః = పర్వతము

అఞ్జలిః = దోసిలి

రవిః = సూర్యుడు

అన్ధకారః = చీకటి

ఋష్యమూకః = ఋష్యమూక పర్వతము

నపుంసకలింగము :—

సమరాఙ్గణమ్ = యుద్ధభూమి

కాననమ్ = వనము.

నృపతి శ్శరీరం మణిభి ర్భూషయతి

బ్రాహ్మణో విధినా దేవం పూజయతి

రామః కపిభిస్సహ ఋష్యమూకే వసతి

నృపా అరీన్ అసిభి స్తాడయన్తి

సేనాపతిః పదాతిభి స్సహ సమరాఙ్గణం గచ్ఛతి

ఇన్ద్రః పవినాద్రీన్ తాడయతి

బలిభి ర్విహగాన్ ప్రీణయతి నరః
అఞ్జలివార్ఘ్యం యచ్ఛన్తి పురుషాః
అరిభ్యాం కుప్యతి నృపతిః
మునిభ్యో నమః
స్వస్తి కవిభ్యః
దాశరథి రరిభ్యోఽలమ్
మణిభ్యః స్పృహయన్తి నరాః
కపిభ్యః ఫలాని రోచన్తే
వ్యాధః కిరిభ్యః కాననం గచ్ఛతి
యతిభ్యాం ఫలాని యచ్ఛామః
లోకే రవే రన్ధకారో నశ్యతి
కలిభ్యో దుఃఖాని జాయన్తే
చోరా రాశిభ్యాం ధాన్యం చోరయన్తి
కవయో నృపతిభ్యో ధన మర్జయన్తి
నృపతయ అరిభ్యో రాజ్యం రక్షన్తి
వ్యాధిభ్య శ్శరీరాణి కుష్యన్తి

సూ - 65 సహాయుక్తేఽప్రధానే (పా సూ) = సహ అను అవ్యయము యొక్క యోగమునందు తృతీయావిభక్తి వచ్చును

ఉదా - కపిభిః సహ పదాతిభిః సహ

సూ - 66 నమః స్వస్తి స్వాహా స్వధాఽలంవషడ్యోగాచ్చ (పా సూ)= నమః, స్వస్తి, స్వాహా, స్వధా, అలమ్, వషట్ అను అవ్యయముల యోగమునందు చతుర్థీ విభక్తి వచ్చును

ఉదా - మునిభ్యో నమః, స్వస్తి కవిభ్యః, అరిభ్యోఽలమ్

### షష్ఠీ సప్తమీ విభక్తులు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ష వి) | కవేః | కవ్యోః | కవీనామ్ |
| (స వి) | కవౌ | కవ్యోః | కవిషు |

వీనిలో అస్, ఓస్, నామ్ - అనునవి షష్ఠీ విభక్తి సుప్ ప్రత్యయములు ఔ ఓస్, సు - అనునవి సప్తమీ విభక్తి సుప్ ప్రత్యయములు

కవి + అస్=కవే + అస్ (సూ-63) = కవేస్ (సూ-64) = కవేః (సూ - 20)

సూ - 67 ఇకో యణచి (పా సూ)=అసవర్ణాచ్చు పరమగునపుడు ఇ ఈ లకు యకారము, ఉ, ఊ లకు వకారము, ఋ ౠ లకు రేఫము ఌ కారమునకు లకారమును ఆదేశమగును.

(య, వ, ర, ల - అను హల్లులకు యణ్ అనునది ప్రత్యాహారసంజ్ఞ)

కవి + ఓస్ = కవ్యోస్ = కవోః (సూ-20)

కవి + నామ్ = కవీనామ్ (సూ-42)

సూ - 68 'ఔ' అను సప్తమీ ఏకవచన ప్రత్యయము పరమగునపుడు, కేవల పతిశబ్దము, సఖి శబ్దముతప్ప తక్కిన ఇకారాంత పుంలింగ శబ్దముల చివరి ఇకార ఉకారములకు లోపము వచ్చును

కవి + ఔ = కవ్ + ఔ = కవౌ.

(కేవల పతిశబ్దము తప్ప అని చెప్పుటచే మరియొక శబ్దముతో గూడియున్న పతిశబ్దముయొక్క ఇకారమునకు అనగా భూపతి, సేనాపతి మున్నగు శబ్దముల ఇకారమునకు గూడ లోపము వచ్చునని భావము.

కవి + సు = కవిషు (సూ-44)

| పుంలింగము | విశేషణములు |
|---|---|

అంబుధిః
ఉదధిః } = సముద్రము

హిమః = మంచు

ఆశ్రమః = ఆశ్రమము

ఆదేశః = ఆజ్ఞ

తిమిఙ్గిలః = తిమింగిలము

శ్వాపదః = క్రూరజంతువు

సింహః = సింహము

యజ్ఞః = యజ్ఞము

ప్రశస్య=కొనియాడదగిన

శ్రేష్ఠ = శ్రేష్ఠమైన

నపుంసకలింగము

ఘృతమ్ = నేయి

వచనమ్ = మాట

దాశరథే శ్చరితమ్ ప్రశస్యమ్
కవీనా ఙ్కాళిదాసః శ్రేష్ఠః
గిరీణాం శిఖరేషు హిమః పతతి
ఋషీణాం వచనమ్ ప్రమాణ మితి వదన్తి
అరీణాం సైనికా భూపతినా జీయన్తే
హరేః ప్రసాదేన జనా జీవన్తి
దాశరథేః పుత్రౌ వాల్మీకే రాశ్రమే వసతః
నరపతే రాదేశేన సైనికా స్సమరాఙ్గణం గచ్ఛన్తి
గిరిషు సింహా వసన్తి
అమ్బుధౌ తిమిఙ్గిలా శ్చరన్తి
ఉదధౌ లవణం జలం వర్తతే
అద్రిషు శ్వాపదా వసన్తి
యోధః కిర్యో ర్బాణాన్ అస్యతి

ధూర్జటౌ యతీనాం చిత్తం భవతి
యజ్ఞేష్వగ్నౌ హృత మస్త్యత్ర
యోధానాం పాణి ష్వసయో విద్యన్తే

సూ - 69 వా పదాన్తస్య (పా సూ) పదాంతమందలి అనుస్వారమునకు వర్గీయాక్షరములు, య వ ల అను హల్లులను పరమగునపుడు వికల్పముగా పరసవర్ణము ఆదేశమగును. (అనగా వర్గీయాక్షరములు పరమగునపుడు ఆ యా వర్గల పంచమాక్షరములు, య వ ల లు పరమగునపుడు వరుసగా అనునాసిక య వ ల లును వికల్పముగా ఆదేశమగునని భావము)

ఉదా - కవీనామ్ + కాళిదాసః = కవీనాఙ్కాళిదాసః (లేక)
కవీనాం కాళిదాసః (సూ-6)

(య వ ర ల అను హల్లులకు వర్గీయాక్షరములకును, 'యయ్' అనునది ప్రత్యాహారసంజ్ఞ)

4 ఇకారాంత నపుంసకలింగ శబ్దము -

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | వారి | వారిణీ | వారీణి |
| (సం. ప్ర) | (హే) వారే<br>(హే) వారి | ,, | ,, |
| (ద్వి వి) | వారి | ,, | ,, |

వీనిలో 'వారి' అనునది ప్రాతిపదికము స్ ఈ, ని - అనునవి ప్రథమా విభక్తి సుప్ ప్రత్యయములు మ్, ఈ, ని-అనునవి ద్వితీయా విభక్తి సుప్ ప్రత్యయములు.

సూ - 70 స్వమోర్నపుంసకాత్ (పా సూ) = అకారాంతములు తప్ప తక్కిన నపుంసకలింగ శబ్దములకంటె పరమయిన ప్రథమా ద్వితీయా విభక్తుల యేకవచన ప్రత్యయములకు లోపము వచ్చును

వారి + స్ = వారి    వారి + మ్ = వారి

సూ - 71 సంబోధనమునందు ఏకవచన ప్రత్యయము పరమగునపుడు నపుంసకలింగ శబ్దముల చివరనున్న అకారేతర హ్రస్వములకు గుణము వికల్పముగా వచ్చును

హే వారి + స్ = హే వారే + స్ = హే వారే (సూ-70) (లేదా)
హే వారి + స్ = హే వారి (సూ-70)

సూ - 72 ఇకోఽచి విభక్తౌ (పా సూ) = అజాదిప్రత్యయములు పరమగునపుడు ఇక్కులు అంతమందుగల నపుంసకలింగ శబ్దములకు పరముగా నకారాగమము వచ్చును

వారి + ఈ = వారిన్ + ఈ = వారిణీ (సూ-29).
వారి + ని = వారీణి (సూ-24, 29)

## తృతీయా, చతుర్థీ, పంచమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (తృ వి) | వారిణా | వారిభ్యామ్ | వారిభిః |
| (చ వి) | వారిణే | ,, | వారిభ్యః |
| (పం వి) | వారిణః | , | ,, |

వీనిలో నా, భ్యామ్, భిస్ - అనునవి తృతీయావిభక్తి ప్రత్యయములు ;
ఏ, భ్యామ్, భ్యస్ - అనునవి చతుర్థీ విభక్తిప్రత్యయములు ,
అస్, భ్యామ్, భ్యస్ - అనునవి పంచమీవిభక్తి ప్రత్యయములు.

వారి+నా=వారిణా (సూ-29)  వారి+ఏ=వారిన్+ఏ (సూ-72) = వారిణే (సూ-29)  వారి + అస్ = వారిన్ + అస్ (సూ-72) = వారిణః (సూ-29 20)

## షష్ఠీ, సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ష వి) | వారిణః | వారిణోః | వారీణామ్ |
| (స వి) | వారిణి | ,, | వారిషు |

వారి+అస్=వారిన్+అస్ (సూ-72)=వారిణః (సూ-29 20)
వారి + ఓస్ = వారిన్ + ఓస్ (సూ-72) = వారిణోః (సూ-29, 20)
వారి + నామ్ = వారీణామ్ (సూ-42, 29)  వారి + ఇ = వారిన్ + ఇ (సూ-72)=వారిణి (సూ-29)  వారి+సు=వారిషు (సూ-44)

నపుంసకలింగము —

వారి = నీరు
పాదపాణి = కాలుచేతులు

పుంలింగము —

ఆతపః = ఎండ
వాయసః = కాకి
ఘటః = కుండ

విశేషణములు

అధిక = ఎక్కువ
తృషిత = దప్పిగొన్న
సురభి = పరిమళముగల

నిధిః = నిధి
వారినిధిః = సముద్రము
మత్స్యః = చేప

గ్రీష్మే పల్వలేషు వారీణి శుష్యన్తి
కాసారేషు సదా వారి వర్తతే
ఆతపే జనా అధికం వారి పిబన్తి
తృషితేభ్యో జనేభ్యో వారి యచ్ఛామః
పద్మాని సురభీణి భవన్తి

వాయసో షుబే వారి పిబతి
మేఘా వారి వర్షన్తి
వృక్షా వారిణా రోహన్తి
వారిణా పాదపాణీ క్షాళయామి
సురభిభ్యః కుసుమేభ్యః స్పృహయామః
జనా వారిణ ఇన్ద్రిం పూజయన్తి
వారిభ్యః కూపం తటాకం వా గచ్ఛామః
వారీణాం నిధి ర్వారినిధిః
కమలాని వారిషు రోహన్తి
వారిషు మత్స్యా వసన్తి
బాలా వారిషు క్రీడన్తి

సూ - 73 లోపః శాకల్యస్య (పా సూ) = అకారముకంటె పరముగా మన్న యకార వకారములకు అచ్చు పరమగునపుడు వికల్పముగా లోపము వచ్చును.

ఉదా.- వారిణే+ఇన్ద్రిమ్=వారిణయ్+ఇన్ద్రిమ్ (సూ - 12) = వారిణ ఇన్ద్రిమ్ (లేక) వారిణయిన్ద్రిమ్

## అభ్యాసము 4

### ఇకారాంత పుంలింగము - హరిశబ్దము

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర. వి) | హరిః | హరీ | హరయః |
| (సం ప్ర) | (హే)హరే | ,, | ,, |
| (ద్వి వి) | హరిమ్ | ,, | హరీన్ |
| (తృ వి) | హరిణా | హరిభ్యామ్ | హరిభిః |
| (చ. వి) | హరయే | ,, | హరిభ్యః |

| | | | |
|---|---|---|---|
| (పం వి) | హరేః | హరిభ్యామ్ | హరిభ్యః |
| (ష వి) | ,, | హర్యోః | హరీణామ్ |
| (స వి) | హరౌ | ,, | హరిషు. |

ఇకారాంత నపుంసకలింగము—వారిశబ్దము.

| | ఏక. | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | వారి | వారిణీ | వారీణి |
| (సం. ప్ర) | (హే)వారే<br>(హే)వారి | ,, | ,, |
| (ద్వి వి) | వారి | ,, | ,, |
| (తృ. వి) | వారిణా | వారిభ్యాం | వారిభిః |
| (చ. వి) | వారిణే | , | వారిభ్యః |
| (పం. వి) | వారిణః | ,, | ,, |
| (ష వి) | వారిణః | వారిణోః | వారీణామ్ |
| (స వి) | వారిణి | ,, | వారిషు |

ఇకారాంత పుంలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు

| (ఏక) | (ద్వి) | (బహు) |
|---|---|---|
| స్ | ఔ | అస్ |
| మ్ | ,, | స్ |
| ఆ | భ్యామ్ | భిస్ |
| ఏ | ,, | భ్యస్ |
| అస్ | ,, | ,, |
| ,, | ఓస్ | ఆమ్ |
| ఔ | ,, | సు |

ఇకారాన్త నపుంసకలింగశబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు

| (ఏక.) | (ద్వి.) | (బహు) |
|---|---|---|
| స్ | ఈ | ఇ |
| మ్ | ,, | ,, |
| ఆ | భ్యామ్ | భిస్ |
| ఏ | ,, | భ్యస్ |
| అస్ | ,, | ,, |
| ,, | ఓస్ | ఆమ్ |
| ఇ | ,, | సు. |

అవ్యయములనగా నేమియో వివరించునది

అవ్యయముల నెన్ని రకములుగా విభజింపవచ్చునో సహేతుకముగా వివరించునది

క్రింది పాణిని సూత్రముల యర్థములను సోదాహరణముగ వివరించునది —

) స్వరాదినిపాత మవ్యయమ్.
2) తద్ధితశ్చాసర్వవిభక్తిః.
3) కృన్మేజన్తః
4) క్త్వాతోసున్ కసునః
5) అవ్యయీభావశ్చ
6) అవ్యయాదాప్సుపః
7) జసిచ
8) హ్రస్వస్యగుణః
9) ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్
10) పుతప్రగృహ్యా అచి నిత్యమ్
11) ఘేర్ఙితి
12) జసిజనోశ్చ.
13) సహయుక్తేఽప్రధానే :
14) నమః స్వస్తి స్వాహా స్వధాఽలం వషడ్యోగాచ్చ
5) ఇకోయణచి
16) వా పదాన్తస్య
17) స్వమోర్నపుంసకాత్.
18) ఇకోఽచి విభక్తౌ
19) లోపః శాకల్యస్య

ఇకారాంత పుంలింగ శబ్దములకు ప్రథమా ద్వితీయా విభక్తుల ద్వివచన ప్రత్యయములు పరమగునపుడు కలుగు మార్పులను సోదాహరణముగా వివరించునది

సప్తమీ ఏకవచన ప్రత్యయము పరమగునపుడు ఇకారాంత పుంలింగ శబ్దములకు కలుగు మార్పును సోదాహరణముగా వివరించునది

సంబోధమునందు ఏకవచన ప్రత్యయము పరమగునపుడు ఇకార ఉకారములకు కలుగు మార్పులను సోదాహరణముగా వివరించునది.

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది :—

గ్రీష్మమునందుకూడ కాసారములయందు నీరుండును.

ఆమె నేతిని అగ్నియందు కరగించుచున్నది

భక్తులయొక్క చిత్తములు ఎల్లప్పుడు హరియందుండును

భూపతియొక్క ఆదేశముచే సైనికులు సమరాంగణమునకు పోవుచున్నారు

అడవిపందులయొక్క యూధములు వనమునందు చరించుచున్నవి

నృపతియొక్క సైనికులు శత్రువులను జయించుచున్నారు

కృషీవలుడు వ్రీహులకొఱకు క్షేత్రమును దున్నుచున్నాడు

కవులు ఎల్లప్పుడు భూపతులను శ్లోకములతో వర్ణింతురు

ఉదధియందు నీరు జనులచే త్రాగబడుటలేదు

శత్రువులయొక్క సైనికులు సమరాంగణమునందు భూపతిచే జయింపబడుచున్నారు

గిరులయొక్క గహ్వరములందు శ్వాపదములు ఉండును

బలులచేత వాయసములు సంతోషించుచున్నవి

పిడుగు ఆకాశమునుండి పడుచున్నది

నీటిచే అగ్ని శాంతించుచున్నది

గాలిచే అంబుధి క్షోభిల్లుచున్నది

వజ్రాయుధమువలన గిరులకు భయము కలుగును

గిరి ఉదధినుండి రెండు క్రోసుల దూరము

అధిపతియొక్క ఆదేశముచే కింకరులు గ్రామమునకు పోవుచున్నారు

బాలుడు నీటితో కాలు సేతులను కడుగుకొనుచున్నాడు

వసంతమునందు జనులు సురభిళములగు పుష్పములను పొందుచున్నారు.

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది

సారథిః రథం చోదయతి

కృషివలో ధాన్యస్య రాశీన్ రచయతి

యతయో వ్యాధీన్ న గణయన్తి

నరపతి రుపహారైః కవీన్ ప్రీణయతి

భూపతయః వణిగ్త్రై స్పృహా భాషన్తే

మణిభ్యః స్పృహయన్తి నరాః

బ్రాహ్మణా నృపతిభ్యో ధన మర్థయన్తి

అరణ్యేషు శ్వాపదా వసన్తి

అతపే జనా అధికం వారి పిబన్తి

రవి రాకాశే చరతి

తృషితేభ్యోజనేభ్యో వారి యచ్ఛామః

హరేః ప్రసాదేన జనా జీవన్తి



పఞ్చమః పాఠః - ఐదవ పాఠము

# ఉభయపదులు

| పరస్మైపదము | | | ఆత్మనేపదము | | |
|---|---|---|---|---|---|
| ఏక | ద్వి | బహు | ఏక | ద్వి. | బహు. |
| పచతి | పచతః | పచన్తి | పచతే | పచేతే | పచన్తే |
| పచసి | పచథః | పచథ | పచసే | పచేథే | పచధ్వే |
| పచామి | పచావః | పచామః | పచే | పచావహే | పచామహే. |

(ఉభయపది ధాతువులకు క్రియాఫలము పరగామి అయినపుడు పరస్మైపద ప్రత్యయములు, ఆత్మగామి అయినపుడు ఆత్మనేపద ప్రత్యయములు చేరుననెడి సామాన్య నియమముకలదు కాని ప్రయోగమునందు అట్టి అర్థ నియమము కచ్చితముగా పాటింపబడుటలేదు)

మొదటి గణమునందలి కొన్ని ఉభయపది ధాతువులు .

| | |
|---|---|
| పచ్ - పాకే = వండుట | పచతి - పచతే |
| బుధ్ - బోధనే = తెలిసికొనుట | బోధతి - బోధతే |
| భజ్ - సేవాయామ్ = భజించుట, సేవచేయుట, | భజతి - భజతే |
| యజ్ - దేవపూజాయామ్ = యజ్ఞముచేయుట, దేవపూజ చేయుట | యజతి - యజతే |
| రాజ్ - దీప్తౌ = విరాజిల్లుట | రాజతి - రాజతే |
| శ్రి - సేవాయామ్ = సేవచేయుట, ఆశ్రయించుట | శ్రయతి - శ్రయతే |
| హృ - హరణే = హరించుట, తీసికొనిపోవుట | హరతి - హరతే |
| హ్వే - స్పర్ధాయాం, శబ్దేచ = పిలుచుట | హ్వయతి - హ్వయతే |
| ఖన్ - అవధారణే = ధరించుట | ఖనతి - ఖనతే |

ధృ - ధారణే = ధరించుట ధరతి - ధరతే
నీ - ప్రాపణే = వెంటతీసికొనిపోవుట నయతి - నయతే
ధావ్ - గతిశుద్ధ్యోః = పరుగెత్తుట, ఉతుకుట ధావతి - ధావతే
వహ్ - ప్రాపణే = మోయుట తీసికొనిపోవుట వహతి - వహతే
యాచ్ - యాచ్ఞాయామ్ = యాచించుట యాచతి - యాచతే
వప్ - బీజసన్తానే = విత్తనములు చల్లుట, నాటుట వపతి - వపతే

నాల్గవగణము నందలి కొన్ని ఉభయపది ధాతువులు —

శుచ్ - పూతీభావే = శుచియగుట తడియుట శుచ్యతి - శుచ్యతే
మృష్ - తితిక్షాయామ్ = సహించుట మృష్యతి - మృష్యతే
రఞ్జ్ (రజ్) - రాగే = రంజింపజేయుట ఎఱ్ఱనగుట రజ్యతి - రజ్యతే
శక్ - మర్షణే = సమర్థుడగుట శక్యతి - శక్యతే

ఆరవగణమునందలి కొన్ని ఉభయపది ధాతువులు —

కృష్ - విలేఖనే = దున్నుట కృషతి - కృషతే
ముచ్ (ముఞ్చ్) - మోక్షణే = విడచుట ముఞ్చతి - ముఞ్చతే
సిచ్ (సిఞ్చ్) - క్షరణే = (నీటిని)చల్లుట, తడపుట సిఞ్చతి-సిఞ్చతే
మిల్ - సఙ్గమే = కలియుట మిలతి - మిలతే
క్షిప్ - ప్రేరణే = విసరుట త్రోసివేయుట క్షిపతి - క్షిపతే
విద్ (విన్ద్) - లాభే = పొందుట విన్దతి - విన్దతే

పదవగణమునందు ఆత్మనేపదులుతప్ప తక్కిన ధాతువులన్నియు ఉభయపదులే అందు కేవల పరస్మైపదులు లేవు అందుచే పరస్మైపదులలో నొసంగబడిన పదవగణమునందలి ధాతువులను అన్నింటిని ఉభయపదులుగనే గ్రహింపదగును

ఉదా - పూజయతి - పూజయతే చోరయతి - చోరయతే తాడయతి - తాడయతే ; గణయతి - గణయతే · మొదలగునవి.

శాస్త్రాణాం తత్త్వం ప్రజ్ఞా బోధన్తే
యాచకా అన్నం యాచన్తే
భారం వహతి కిఙ్కరః
జనకః పుత్రాన్ హ్వయతి
మోక్షాయ హరిం భజన్తే భక్తాః
సేనాపతి స్సైనికాన్ నయతి
వయం దేవం యజామహే
పచికా అన్నం పచన్తే
నరా వస్త్రాణి ఆభరణాని చ ధరన్తే
బాలాః క్రీడాఙ్గణే ధావన్తి
కుసుమైః ఫలైశ్చ వృక్షా రాజన్తే
కవయః పండితాశ్చ భూపతే ర్ధనం విన్దన్తే
యతిర్దేహం ముఞ్చతి
యోధా అరిషు శరాన్ క్షిపన్తి
కృషీవలాః క్షేత్రాణి కృషన్తే; బీజాని వపన్తే చ
నరాః స్నానేన శుచ్యన్తే
గ్రీష్మే ఉద్యానస్య వృక్షేషు వారి సిఞ్చామః
ఉద్యానే వారిభ్యః కూపం ఖనన్తి
జ్ఞానాయ శిష్యా ఋషీన్ శ్రయన్తే
ఉద్యానస్య సౌన్దర్యం చిత్తం హరతి.

## ఉ ప స ర్గ లు

క్రియాపదముతో కలిపి ప్రయోగింపబడు ప్ర, పరా, అప — మున్నగునవి ఉపసర్గలనబడును. అవి క్రియాపదమునకు ముందే చేర్చబడును. ఉపసర్గకు క్రియాపదమునకు నడుమ మరియొక పదమును

ప్రయోగింపరాదు. ఉపసర్గకు క్రియాపదమునకును సంధి నిత్యము. ఉపసర్గ చేరుటవలన సామాన్యముగా ధాతువుయొక్క అర్థము మారు చుండును అరుదుగా ధాతువునకు జేరు తిఙ్ ప్రత్యయము (పరస్మై పదము-ఆత్మనేపదము) మారుచుండును.

ఉదా - భవతి = ఉన్నాడు, అగుచున్నాడు · అనుభవతి = అనుభవించు చున్నాడు ఉద్భవతి = పుట్టుచున్నాడు , అభిభవతి పరిభవతి = తిరస్కరించుచున్నాడు , సంభవతి = సంభవించుచున్నది పరాభవతి = పరాభవించుచున్నాడు

గచ్ఛతి = పోవుచున్నాడు సంగచ్ఛతే = కలియుచున్నాడు · అనుగచ్ఛతి=వెంబడించుచున్నాడు· అధిగచ్ఛతి=పొందుచున్నాడు అవగచ్ఛతి = తెలిసికొనుచున్నాడు ఆగచ్ఛతి = వచ్చుచున్నాడు ప్రత్యాగచ్ఛతి=మరలి వచ్చుచున్నాడు, ప్రతిగచ్ఛతి, అభిగచ్ఛతి= ఎదురు వెళ్ళుచున్నాడు

జయతి, విజయతే = జయించుచున్నాడు పరాజయతే = ఓడి పోవుచున్నాడు

రమతే = రమించుచున్నాడు విరమతి = విరమించుచున్నాడు వహతి వహతే = వహించుచున్నాడు ప్రవహతి = ప్రవహించు చున్నది

సూ - 74 ఉపసర్గాః క్రియాయోగే (పా సూ) = క్రియాయోగమునందు ప్రాదులు ఉపసర్గ లనబడును

(ప్రాదులు ఇరువదియొకటి - ప్ర, పరా, అప, సమ్, అను అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, ప్రతి, పరి, ఉప - అనునవి)

సూ - 75 తే ప్రాగ్ధాతోః (పా సూ) = ఉపసర్గ ధాతువులకు ముందే ప్రయోగింపబడవలెను.

ధాత్వర్థం బాధతే కశ్చిత్ కశ్చిత్ తమను వర్తతే,
తమేవ విశినష్ట్యన్యః ఉపసర్గ గతిస్త్రిధా

ఉపసర్గయొక్క ప్రవృత్తి మూడువిధములుగా ఉండును. అది కొన్నిచోట్ల ధాత్వర్థమును బాధించి అన్యార్థమును బోధింపజేయును. కొన్నిచోట్ల ధాత్వర్థమునే అనుసరించి యుండును అచ్చట ఆ ఉపసర్గవలన అర్థము మారదు కొన్నిచోట్ల ఉపసర్గ ధాత్వర్థముయొక్క విశేషమును బోధింపజేయును

ఉదా - తిష్ఠతి = నిలబడుచున్నాడు, ప్రతిష్ఠతే = బయలుదేరి పోవుచున్నాడు

ముఞ్చతి = విడచుచున్నాడు ఆముఞ్చతి = ధరించుచున్నాడు. ఇచ్చట ఉపసర్గవశమున ధాత్వర్థమునకు బాధకలిగి మరియొక అర్థము బోధింపబడుచున్నది

యాతి, ప్రయాతి = పోవుచున్నాడు, విశతి ప్రవిశతి = ప్రవేశించుచున్నాడు ఇచ్చట ఉపసర్గవలన అర్థము మారలేదు

హసతి = నవ్వుచున్నాడు, ప్రహసతి = బిగ్గరగా నవ్వుచున్నాడు. విహసతి పరిహసతి = పరిహాసపూర్వకముగా నవ్వుచున్నాడు - ఇచ్చట ధాత్వర్థముయొక్క విశేషము బోధింపబడుచున్నది

(అస్) - ప్రాస్యతి = పోయుచున్నాడు, పడవేయుచున్నాడు.
నిరస్యతి = నిరసించుచున్నాడు

(నమ్) - అవనమతి = వంగుచున్నాడు ప్రణమతి = నమస్కరించుచున్నాడు

(ని) - అపనయతి = తొలగించుచున్నాడు  ఆనయతి = తీసికొని వచ్చుచున్నాడు  పరిణయతి = వివాహమాడుచున్నాడు ప్రణయతి = రచించుచున్నాడు  వినయతి = శిక్షణనిచ్చు చున్నాడు

(పత్) - ఆపతతి = సంభవించుచున్నది  ఉత్పతతి=ఎగిరిపడుచున్నది అనుపతతి = (ఒకదాని) వెంటనే పడుచున్నది

(తౄ) - అవతరతి = దిగుచున్నాడు  వితరతి = ఇచ్చుచున్నాడు

(దా) - ప్రతియచ్ఛతి = (ఒకదానికి) బదులుగా ఇచ్చుచున్నాడు

(భాష్) - ప్రతిభాషతే = బదులుపలుకుచున్నాడు  సంభాషతే = సంభాషించుచున్నాడు

(ప్రచ్ఛ్)- ఆపృచ్ఛతే=(వెళ్ళుటకు)సెలవు గైకొనుచున్నాడు  సంపృచ్ఛతి = అడుగుచున్నాడు

(మద్) - ప్రమాద్యతి = తప్పుచేయుచున్నాడు, పొరబడుచున్నాడు

(మన్) - అనుమన్యతే=అనుమతించుచున్నాడు  అవమన్యతే = అవమానించుచున్నాడు

(విశ్) - ఉపవిశతి = కూర్చొనుచున్నాడు  ఆవిశతి = ఆవేశించుచున్నాడు  ప్రవిశతి = ప్రవేశించుచున్నాడు

(వృత్) - నివర్తతే ప్రతినివర్తతే = మరలుచున్నాడు  పరావర్తతే = వెనుదిరుగుచున్నాడు  ప్రవర్తతే = ప్రవర్తించుచున్నాడు

(స్థా) - అనుతిష్ఠతి=ఆచరించుచున్నాడు  ఉత్తిష్ఠతి=లేచుచున్నాడు ప్రతిష్ఠతే = బయలుదేరుచున్నాడు

(స్మృ) - విస్మరతి = మరచిపోవుచున్నాడు  సంస్మరతి = సంస్మరించుచున్నాడు

(సృ) - అనుసరతి=అనుసరించుచున్నాడు  ప్రసరతి = ప్రసరించుచున్నది  సంసరతి = సంసారము చేయుచున్నాడు

(సృజ్) - విసృజతి, ఉత్సృజతి = విడచిపెట్టుచున్నాడు .
అతిసృజతి = ఇచ్చుచున్నాడు

(స్మి) - విస్మయతే = అచ్చెరువొందుచున్నాడు

(హృ) - సంహరతి = చంపుచున్నాడు , ప్రహరతి = కొట్టుచున్నాడు ;
ఆహరతి = తినుచున్నాడు, అపహరించుచున్నాడు, బలిఇచ్చు
చున్నాడు విహరతి = విహరించుచున్నాడు , పరిహరతి =
విడచిపెట్టుచున్నాడు అపహరతి = దొంగిలించుచున్నాడు.

| పుంలింగము :— | నపుంసకలింగము — |
|---|---|
| మాషా = మినుములు | చాతుర్యమ్ = నేర్పు |
| తిలాః = నువ్వులు | అర్చనమ్ = పూజించుట |
| యజమానః = యజ్ఞముచేయుచున్నవాడు | శీర్షమ్ = తల |
| భారః = బరువు | |
| ఉద్గమః = బయలువెడలుట | |
| భోగః = భోగము | |
| సంగ్రామః = యుద్ధము | |
| లోకః = లోకము | |

కింకరా స్వదాధిపతీన్ అనుసరన్తి
బుధాః శాస్త్రేస్తత్వ మవగచ్ఛన్తి
పల్వలేభ్యో వరాహా ఉత్తిష్ఠన్తి
సూర్యాల్లోక స్సుఖ మధిగచ్ఛతి
కాసారే కమలా న్యుద్భవన్తి
ఆసనేషు భూపాలా ఉపవిశన్తి
కృష్ణస్య చాతుర్యేణ విస్మయన్తే జనాః
దేవస్యార్చనాయ పుష్పాణ్యానయామి

దణ్డైః కపీన్ ప్రహరన్తి బాలాః
యజమానో మృత మగ్నౌ ప్రాస్యతి
శిర్షం భారేణావనమతి
నావికా స్సముద్రం ప్రవిశన్తి
పుష్పాణా ముద్గమేన వృక్షా విరాజన్తే
యతయో భోగాన్ పరిహరన్తి
శరా బుధా నవమన్యన్తే
మూర్ఖా మిత్రాణి విస్మరన్తి
చోరాః క్షేత్రే ధాన్య మపహరన్తి
యోధా అరీన్ సంహరన్తి సంగ్రామే
నరా స్సముద్రస్య తీరే విహరన్తి
కృషీవల స్తిలేభ్యః ప్రతియచ్ఛతి మాషాన్

## ద్వికర్మక ధాతువులు

కొన్ని క్రియలను బోధించు ధాతువులకు రెండుకర్మలు ఉండును ఆ ధాతువులను ద్వికర్మ ధాతువులందురు అట్టి ధాతువుల కర్మపదములకు రెంటికిని ద్వితీయావిభక్తి వచ్చును అందొకటి ముఖ్యకర్మ రెండవది అముఖ్య కర్మ అముఖ్య కర్మనే 'గౌణకర్మ' అని, 'అకథితకర్మ' అనియు వ్యవహరింతురు అపాదానము మున్నగు కారకవిశేషములుగా వివక్షింపబడని కారకము అకథితకర్మ' అనబడుచున్నది అందుచే అచ్చట పంచమి మున్నగు విభక్తులకు బదులు ద్వితీయావిభక్తి వచ్చును.
' దుహ్ యాచ్ పచ్ దణ్డ్ రుధ్ ప్రచ్ఛి చి బ్రూ శాసు జి మథ్ ముషామ్ కర్మయుక్స్యా దకథితం తథాస్యా న్నీ హృ కృష్ వహామ్ '

దుహ్ మున్నగు పదునారుధాతువులు వాని యర్థములుగల ధాతువులను అకథిత కర్మకలవి అనగా ద్వికర్మకధాతువులని భావము

దుహ్ = పితుకుట : యాచ్ = యాచించుట : వచ్ = వండుట : దణ్డ్=దండనము విధించుట : రుధ్ = అడ్డగించుట . ప్రచ్ఛ్ = ప్రశ్నించుట , చి = (పువ్వులు మున్నగువానిని) కోయుట : బ్రూ = చెప్పుట . శాస్=శాసించుట, జి = జయించుట; మథ్ = మథించుట, ముష్ = దొంగిలించుట , నీ = తీసికొనిపోవుట : హృ = హరించుట, తీసికొనిపోవుట , కృష్ = లాగుట ; వహ్ = మోయుట, మోసికొనిపోవుట.

యాచకా ధనం దనికం యాచన్తే
వయం తణ్డులాన్ ఓదనం పచామః
భూపాలః గర్గాన్ శతం దణ్డయతి
పథికో మాణవకం మార్గం పృచ్ఛతి
ఆచార్యః శిష్యాన్ ధర్మం వదతి
దేవదత్తో యజ్ఞదత్తం శతం జయతి
స్తేనా పథికాన్ ధనాని చోరయన్తి
సేనానాయకః సైనికాన్ సమరాఙ్గణం నయతి
బాలాః పుస్తకాని విద్యాలయం హరన్తి
గోపాలో మేషం గ్రామం కర్షతి
కిఙ్కరో భారం గృహం వహతి
భిక్షుకా అస్మాన్ అన్నం భిక్షన్తే

దుహ్ మున్నగు పన్నెండు ధాతువులు, వాని యర్థముగల ధాతువులును కర్మార్థమునందు ప్రయోగింపబడినపుడు అముఖ్యకర్మ ప్రథమా విభక్తియందు, ముఖ్యకర్మ ద్వితీయావిభక్తి యందును ప్రయోగింపబడును నీ, హృ, కృష్, వహ్ — అను ధాతువులు వాని యర్థముగల ధాతువులును కర్మార్థమునందు ప్రయోగింపబడినపుడు ముఖ్యకర్మ ప్రథమావిభక్తియందు, అముఖ్యకర్మ ద్వితీయావిభక్తి యందును ప్రయోగింపబడును

యాచకైర్ధనికో ధనం యాచ్యతే
అస్మాభి స్తణ్డులా ఓదనం పచ్యన్తే
భూపాలేన గర్గాః శతం దణ్డ్యన్తే
పథికేన మాణవకః మార్గం పృచ్ఛ్యతే
ఆచార్యేణ శిష్యా ధర్మమ్ ఉద్యన్తే
దేవదత్తేన యజ్ఞదత్తః శతం జీయతే
స్తేనైః పథికా ధనాని చోర్యన్తే
సేనానాయకేన సైనికాః సమరాఙ్గణం నీయన్తే
బాలైః పుస్తకాని విద్యాలయం హ్రియన్తే
గోపాలేన మేషో గ్రామం కృష్యతే
కిఙ్కరేణ భారో గృహం ఉహ్యతే
భిక్షుకైర్వయ మన్నం భిక్ష్యామహే

## అభ్యాసము 5

ఉపసర్గలనగా నేమి ? అవి యెన్ని ? వివరించునది
ఉపసర్గల ప్రయోగమునగల విశేషములను వివరించునది
ద్వికర్మకధాతువు లనగా నేమి ? అవి యేవి ? వివరించునది
ద్వికర్మకధాతువుల కర్మార్థక ప్రయోగమునందు వాక్యములో చేయవలసిన మార్పులను వివరించునది

క్రింది పాణినిసూత్రముల యర్థములను సోదాహరణముగా వివరించునది
1 ఉపసర్గాః క్రియాయోగే  2 తే ప్రాగ్ధాతోః

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది —

కుచేలుడు ధనమును కృష్ణుని యాచించుచున్నాడు
నృపతియొక్క ఆదేశము సేనాపతిచే ఆదరింపబడుచున్నది

భూపతులు పుత్రులతోడ ఉద్యానములందు విహరించుచున్నారు
విద్యాలయములయందు పఠించుటచేత బాలురు జ్ఞానమును పొందు
చున్నారు
యతులచే సుఖము, దుఃఖమునుకూడ పరిహరింపబడుచున్నది
మణులయొక్క ప్రకాశముచే భూపతులయొక్క ప్రాసాదములు విరాజిల్లు
చున్నవి.
కపులు వృక్షములందు కూర్చొనుచున్నవి.
బాలురు ఆడుటకొఱకు క్రీడాంగణముగురించి బయలుదేరుచున్నారు.
సంగ్రామమునందు సైనికులచే శత్రువులు సంహరింపబడుచున్నారు.
బుధులను మూర్ఖులు నిరసించుచున్నారు
విద్యాలయమునుండి బాలురు మరలి వచ్చుచున్నారు.
పర్వతములనుండి నిర్ఝరములు ప్రవహించుచున్నవి.
బుధులచే శాస్త్రములయొక్క తత్త్వము తెలిసికొనబడుచున్నది.
రాముని యొక్క సారథిచే రథము వనమునకు తీసికొని పోబడుచున్నది.
చోరులచే ధాన్యము అపహరింపబడుచున్నది.
మూర్ఖులచే మిత్రులు విస్మరింపబడుచున్నారు
ప్రాజ్ఞులు నరులను అవమానింపరు.
మీచే మాషములు తిలలకు బదులుగా ఇయ్యబడుచున్నవి.
మాచే ఉద్యానమునుండి పుష్పములు తీసికొనిరాబడుచున్నవి.
ఋషులు, మానవులకు ధర్మమును చెప్పుచున్నారు



## షష్ఠః పాఠః - ఆరవ పాఠము

---

కొన్ని తద్ధితాంతావ్యయములు —

అతః = ఇందువలన ఇచ్చటనుండి

అత్ర } = ఇచ్చట ఇచ్చటికి
ఇహ }

అధునా } = ఇప్పుడు
ఇదానీమ్ }

ఇత్థమ్ = ఈవిధముగ

తతః = అందువలన అచ్చటనుండి

తత్ర = అచ్చట అచ్చటికి

తదా } = అప్పుడు
తదానీమ్ }

తథా = ఆవిధముగ

సర్వతః = { అన్నింటివలన / అంతటనుండి

సర్వత్ర = అంతట

సర్వదా } = ఎల్లప్పుడు
సదా }

సర్వథా = అన్నివిధములుగ

(ప్రశ్నార్థకములు)

కుతః = ఎందువలన? ఎచటినుండి

కుత్ర } = ఎచ్చట ? ఎచ్చటికి ?
క్వ }

కదా = ఎప్పుడు ?

కథమ్ = ఏవిధముగ ?

(సంబంధార్థకములు)

యతః = { ఎందువలన / ఎచ్చటనుండి

యత్ర = ఎచ్చట, ఎచ్చటికి

యదా = ఎప్పుడు

యథా = ఎవిధముగ

5 ఉకారాంత పుంలింగ శబ్దములు -

## ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర. వి) | గురుః | గురూ | గురవః |
| (సం ప్ర) | హేగురో | ,, | ,, |
| (ద్వి వి) | గురుమ్ | ,, | గురూన్ |

పై పదములలో 'గురు' అనునది ప్రాతిపదికము. స్, ఔ, అస్ అనునవి ప్రథమావిభక్తి సుప్ ప్రత్యయములు. మ్, ఔ, న్ - అనునవి ద్వితీయావిభక్తి సుప్ ప్రత్యయములు

గురు+స్=గురుః (సూ - 20), గురు+ఔ=గురూ (సూ - 58); గురు+అస్=గురో+అస్ (సూ - 59)=గురవః (సూ- 2, 20); (హే) గురు+స్ = (హే) గురో + స్ (సూ-60) = (హే) గురో (సూ-23). గురు + న్ = గురూన్ (సూ-24)

తరుః = చెట్టు
సాధుః = మంచివాడు, సాధువు
బిన్దుః = బిందువు
జన్తుః = జంతువు, ప్రాణి
శిశుః = శిశువు
ఇషుః = బాణము
అసాధుః - చెడ్డవాడు
రిపుః = శత్రువు

ధర్మః = ధర్మము
మాతులః = మేనమామ
శైలః = పర్వతము
గజః = ఏనుగు
తూలః = దూది

విశేషణములు :-
నమ్ర = వంగిన
బహు = ఎక్కువ
సాధు = మంచి
లఘు = తేలికయైన

తరవః ఫలై ర్నమ్రా భవన్తి
దుఃఖేஉపి ధర్మం న త్యజన్తి సాధవః
మేఘేభ్యో వారిణో బిన్దవః పతన్తి
శిలానపి మూర్ఖాః ప్రహరన్తి
యోధా అరిష్విషూన్ క్షిపన్తి
పరపతే స్సైనికా శ్శత్రూన్ జయన్తి
కృష్ణో జనకే సాధుః అసాధుర్మాతులే
సంగ్రామే రిపూన్ సంహరన్తి వీరాః
సముద్రేஉపి బహవో జన్తవో వసన్తి
యదాలోకే ధర్మో నశ్యతి తదా విష్ణురవతరతీతి వదన్తి
'శైలే శైలే న మాణిక్యం, మౌక్తికం న గజే గజే
సాధవో నచ సర్వత్ర చన్దనం న వనే వనే
తృణాదపి లఘు స్తూలః తూలాదపి చ యాచకః'
వాయు ర్వహతి రేణూన్

సూ - 76 సాధ్వసాధు ప్రయోగేచ (వార్తికమ్) = సాధు అసాధు
అను శబ్దముల యోగమునందు సప్తమీ విభక్తి వచ్చును
ఉదా - కృష్ణోజనకే సాధుః అసాధుర్మాతులే

సూ - 77 వీప్సార్థమునందు పదము ద్విరుక్తమగును
ఉదా - శైలే శైలే = అన్ని పర్వతములయందు

తృతీయా చతుర్థీ పంచమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (తృ వి) | గురుణా | గురుభ్యామ్ | గురుభిః |
| (చ వి) | గురవే | ,, | గురుభ్యః |
| (పం వి) | గురోః | ,, | , |

వీనిలో నా, భ్యామ్, భిస్ - అనునవి తృతీయావిభక్తి ప్రత్యయములు ఏ, భ్యామ్, భ్యస్ - అనునవి చతుర్థీ విభక్తి ప్రత్యయములు. అస్, భ్యామ్, భ్యస్ - అనునవి పంచమీవిభక్తి ప్రత్యయములు.

గురు+నా=గురుణా (సూ-29) గురు+భిస్=గురుభిః (సూ-20) గురు+ఏ=గురో+ఏ (సూ-63). = గురవే (సూ-12). గురు+భ్యస్ = గురుభ్యః (సూ-20) గురు + అస్=గురో + అస్ (సూ-63)=గురోస్ (సూ-64) = గురోః (సూ-20)

| | |
|---|---|
| వాయుః = గాలి | అభిషేకః = అభిషేకము |
| పశుః = పశువు, జంతువు | హేమన్తః = హేమంతఋతువు |
| పరశుః = గండ్రగొడ్డలి | పరాజయః = ఓటమి |
| సూనుః = కొడుకు | కృషిః = వ్యవసాయము |
| శమ్భుః = శివుడు | |
| మృత్యుః = మరణము | |

వాయునా తరవః కమ్పన్తే
గుణేన హీనాః పశుభిః సమానాః
ప్రభుభిర్నరా రక్ష్యన్తే
పరశురామః పరశునా శత్రూన్ ప్రహరతి
సూనుభి స్సహ జనక స్సమ్భాషతే
గురుభిః పాఠా బోధ్యన్తే విద్యాలయేషు
అభిషేకః శమ్భవే రోచతే
అర్చనం విష్ణవే రోచతే
రిపుభ్యో క్రుధ్యతి వీరః
హేమన్తే తరుభ్యః పర్ణాని పతన్తి
గురుభ్యః శిష్యా జ్ఞానం లభన్తే

మృత్యోర్భయం న గణయన్తి సాధవః
ప్రాజ్ఞః శాస్త్రే సూమర్థ్యః పరాజయ మిచ్ఛతి
అన్నాద్ధేతోః కృషి మాచరన్తి కృషీవలాః
జ్ఞానాద్ధేతోః విద్యాలయం గచ్ఛన్తి బాలాః

సూ - 78 తక్కువయైన, లేని అను అర్థములుగల శబ్దముల యోగము నందు తృతీయా విభక్తి ఎచ్చును ఉదా - గుణేన హీనాః

సూ - 79 హేతుశబ్దము తత్పర్యాయములగు నిమిత్తాది శబ్దములను తలచుగ తృతీయాది విభక్తులన్నింటియందును ప్రయోగింప బడును అప్పుడు అవి యే విభక్తియందుండునో హేతు వాచకముకూడ అదే విభక్తియం దుండును
ఉదా - అన్నాత్ హేతోః జ్ఞానాత్ హేతోః

సూ - 80 ఝయో హోఽన్యతరస్యామ్ (పా సూ) = అనునాసికములు తప్ప తక్కిన వర్గీయాక్షరములకంటె పరమయిన హకారము నకు పూర్వ సవర్ణము అనగా ఆవర్గ యందలి నాల్గవ అక్షరము వికల్పముగా ఆదేశమగును
ఉదా - అన్నాత్+హేతోః = అన్నాద్+హేతో (సూ-47) = అన్నాద్ధేతోః

షష్ఠీ, సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ష వి) | గురోః | గుర్వోః | గురూణామ్ |
| (స వి) | గురౌ | ,, | గురుషు |

వీనిలో అస్, ఓస్, నామ్ - అనునవి షష్ఠీవిభక్తి సుప్ ప్రత్యయములు ఔ ఓస్, సు - అనునవి సప్తమీవిభక్తి సుప్ పత్యయములు

గురు + ఓస్ = గురోః (సూ - 67 20)   గురు + నామ్ =
గురూణామ్ (సూ-42, 29)   గురు + సు = గురుషు (సూ-44)

<u>పుంలింగము</u>

పాణ్డుః = పాండురాజు
బాహుః = భుజము బాహువు
ఇన్దుః, విధుః = చంద్రుడు
పాంసుః = ధూళి
బన్ధుః = బంధువు
అభిలాషః = కోరిక
కలఙ్కః = మచ్చ
శుక్లపక్షః = శుక్లపక్షము
పాదపః = చెట్టు
స్నేహః = స్నేహము

<u>విశేషణములు</u>

పరమ = ఎక్కువ గొప్ప

<u>నపుంసకలింగము</u> —

కారుణ్యమ్ = దయ
బిమ్బమ్ = బింబము
శిశిరః (పుం), శిశిరమ్ (న) = శిశిరఋతువు
వజ్రః (పుం), వజ్రమ్ (న) = వజ్రాయుధము

పాణ్డోః పుత్రాః పాణ్డవాః
విష్ణోః ప్రసాదేన నరాణాం సుఖం జాయతే
ప్రభు ర్బాహ్వో ర్బలేన రాజ్యం రక్షతి
గురూణా మాదేశాన్ అనుతిష్ఠామః
సాధూనాం జన్తుషు పరమం కారుణ్యం వర్తతే
మోక్షే నాధూనా మభిలాషోఽధికః
ఇన్దౌ కలఙ్కో దృశ్యతే
విధోర్బిమ్బం శుక్లపక్షే వర్ధతే
బాలాః సర్వదా పాంసుషు క్రీడన్తి
గురోః పుత్రమపి గురుమివ పూజయన్తి

'పాదపానాం భయం వాయోః పద్మానాం శిశిరా ద్భయమ్
పర్వతానామ్ భయం వజ్రాత్, సాధూనాం దుర్జనాద్భయమ్'
సజ్జనా బన్ధుషు స్నేహేన వర్తన్తే

6 ఉకారాంత నపుంసకలింగశబ్దములు —

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | మధు | మధునీ | మధూని |
| (సం ప్ర) | (హే) మధో<br>(హే) మధు | ,, | ,, |
| (ద్వి వి) | మధు | ,, | ,, |

వీనిలో మధు' అనునది ప్రాతిపదికము స్ ఈ ని - అనునవి ప్రథమావిభక్తి సుప్ ప్రత్యయములు మ్, ఈ ని - అనునవి ద్వితీయా విభక్తి సుప్ ప్రత్యయములు

మధు+స్ = మధు (సూ-70) మధు + ఈ = మధునీ (సూ-72) మధు + ని = మధూని (సూ-24), (హే) మధు + స్ = హేమధో + స్ (సూ-71) = హేమధో (సూ-23) (లేదా) (హే) మధు + స్ = (హే) మధు (సూ-23) మధు + మ్ = మధు (సూ-70)

తృతీయా, చతుర్థీ పంచమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (తృ వి) | మధునా | మధుభ్యామ్ | మధుభిః |
| (చ వి) | మధునే | ,, | మధుభ్యః |
| (పం వి) | మధునః | ,, | ,, |

వీనిలో నా, భ్యామ్, భిస్ - అనునవి తృతీయావిభక్తి సుప్ ప్రత్యయములు. ఏ, భ్యామ్, భ్యస్ - అనునవి చతుర్థీవిభక్తి సుప్ ప్రత్యయములు. అస్ భ్యామ్, భ్యస్ - అనునవి పంచమీ విభక్తి సుప్ ప్రత్యయములు.

మధు+ఏ=మధునే (సూ-72) మధు + అస్ = మధునః (సూ-72, 20)

## షష్ఠీ సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ష వి) | మధునః | మధునోః | మధూనామ్ |
| (స. వి) | మధుని | ,, | మధుషు. |

**నపుంసకలింగము:-**

అశ్రు = కన్నీరు
మధు = తేనె
వస్తు = వస్తువు
అవస్తు = వస్తువు కానిది
అమ్బు = నీరు
వసు = ధనము
జిహ్వాగ్రమ్ = నాలుక కొస
హాలాహలమ్ = విషము
పుచ్ఛమ్ = తోక
మాధుర్యమ్=తియ్యదనము

**విశేషణములు:-**

వల్గు = సుందరమైన
స్వాదు = రుచియైన
హిత = మేలునుకలిగించుట
దుర్లభ = పొందశక్యముకాని
చారు = అందమైన
తను = సూక్ష్మమైన, తక్కువయైన

**పుంలింగము -**

ఆరోపః = ఆరోపము
భ్రమరః = తుమ్మెద
విభవః = సంపద.

నేత్రాభ్యామ్ అశ్రూణి ముఞ్చతి బాలః
ఖలానాం జిహ్వాగ్రే మధు హృదయే హలాహలంచ విద్యతే
వస్తుని అవస్తున ఆరోపో ఽజ్ఞానమ్
వల్గునా పద్మేన చిత్తం హ్రియతే
స్వాదు హితం చ ఔషధం దుర్లభం భవతి
భ్రమరా మధునే లుభ్యన్తి
మయూరస్య పుచ్ఛం చారు వర్తతే
మధుని మాధుర్యం వర్తతే
అమ్బుని కమలాని రోహన్తి
భ్రమరాః పుష్పేషు మధు పిబన్తి
వసూని వాఞ్ఛన్తి మానవాః
తనుషు విభవేషు బన్ధుభిః పరిహ్రియన్తే నరాః

7 ఋకారాంత పుంలింగశబ్దములు.

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | నేతా | నేతారౌ | నేతారః |
| (సం ప్ర) | (హే) నేతః | , | , |
| (ద్వి- వి) | నేతారమ్ | | నేతౄన్ |

వీనిలో 'నేతృ అనునది ప్రాతిపదికము స్ ఔ, అస్ - అనునవి ప్రథమావిభక్తి సుప్ ప్రత్యయములు, అమ్ ఔ, న్ - అనునవి ద్వితీయా విభక్తి సుప్ ప్రత్యయములు

సూ - 8 ఋకారాంత పుంలింగ శబ్దములకు ప్రథమైక వచన ప్రత్యయము పరమగునపుడు ఋకారమునకు అకారాదేశము సుప్ ప్రత్యయమునకు లోపమును వచ్చును
ఉదా - నేతృ + స = నేతా

సూ - 82 సంబోధనమునందు ఏకవచన ప్రత్యయము పరమగునపుడు, సప్తమీవిభక్తి ఏకవచన ప్రత్యయము పరమగునపుడును ఋకారాంత శబ్దముల ఋకారమునకు గుణమువచ్చును
(హే) నేతృ + స = (హే) నేతర్ + స్

సూ - 83 హల్లుకంటె పరమయిన ప్రథమైక వచన ప్రత్యయమునకు లోపము వచ్చును ఉదా - (హే) నేతర్+స్ = (హే)నేతర్

సూ - 84 ఖరవసానయోర్విసర్జనీయః (పా సూ) = శ్వాసహల్లు (ఖర్) పరమగునపుడు, ఏమియు పరముగా లేనప్పుడును రేఫము నకు విసర్గాదేశమగును ఉదా - (హే)నేతర్=(హే)నేతః

సూ - 85 విరామోఽవసానమ్ (పా సూ) = వర్ణములు లేకుండుటకు అవసానమని పేరు

సూ - 86 ప్రథమావిభక్తి ద్వివచన బహువచన ప్రత్యయములు, ద్వితీయా విభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయములును పరమగునపుడు ఋకారాంత పుంలింగ శబ్దముల ఋకారము నకు 'ఆర్' అను ఆదేశమగును
ఉదా - నేతృ + ఔ = నేతారౌ నేతృ + అస్ = నేతారస్ = నేతారః (సూ-20) నేతృ + అమ్ = నేతారమ్
నేతృ + న్ = నేతౄన్ (సూ-24)

సూ - 87 పితృ భ్రాతృ జామాతృ, దేవృ, నృ సవ్యేష్టృ మున్నగు కొన్ని శబ్దములకు ప్రథమావిభక్తి ద్వివచన బహువచన ప్రత్యయములు, ద్వితీయావిభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయ ములను పరమగునపుడు ఋకారమునకు గుణము వచ్చును
ఉదా - పితృ+ఔ=పితరౌ పితృ + అస్ = పితరస్=పితరః (సూ-20), పితృ + అమ్ = పితరమ్

| | ఏక. | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | పితా | పితరౌ | పితరః |
| (సం. ప్ర) | (హే) పితః | ,, | ,, |
| (ద్వి. వి) | పితరమ్ | ,, | పితౄన్ |

ఋకారాంత శబ్దములలో పితృ, భ్రాతృ, జామాతృ, దేవృ, నృ, సవ్యేష్టృ - మున్నగు సంజ్ఞావాచకములు పుంలింగములు, నేతృ కర్తృ ద్రష్టృ - మున్నగునవి ధాతువునకు కర్త్రర్థములో 'తృ' అను కృత్ ప్రత్యయము చేరుటచే ఏర్పడిన శబ్దములగుటచే విశేష్యనిఘ్నములు కావున విశేష్య వాచకముయొక్క లింగమునందు ప్రయోగింపబడును

(పితృ శబ్దము ద్వివచనమునందు ప్రయోగింపబడినపుడు తల్లి దండ్రులు అను అర్థమునిచ్చును పితరౌ = తల్లిదండ్రులు)

పుంలింగములు -

సప్తా = మునిమనుమడు
జామాతా = అల్లుడు
భర్తా=ధరించువాడు, భర్త యజమాని
ధాతా = ధరించువాడు, బ్రహ్మ
ద్వేష్టా = ద్వేషించువాడు, శత్రువు
వక్తా = చెప్పువాడు
శ్రోతా = వినువాడు
భ్రాతా = సోదరుడు
నేతా=తీసికొనిపోవువాడు, నాయకుడు
మన్త్రః = మన్త్రము

కర్తా = చేయువాడు
ద్రష్టా = చూచువాడు

నపుంసకలింగము —

పథ్యమ్ = మేలునుకలిగించునది
ఋణమ్ = అప్పు

వ్యాసో వశిష్ఠస్య నప్తా
పుత్త్రేణ పితరౌ వన్ద్యేతే
రామో జనకస్య జామాతా
భర్తారమ్ అనుసరన్తి కిఙ్కరాః
ధాతా జనాన్ సృజతి
వీరాః సంగ్రామే ద్వేష్టౄన్ జయన్తి
ఋషయో మన్త్రాణాం ద్రష్టారః
జనా దాతౄన్ శ్లాఘన్తే
పద్యస్య వక్తా శ్రోతా వ దుర్లభః
లక్ష్మణో భరత శ్శత్రుఘ్నశ్చ రామస్య భ్రాతరః
హేపితః, అగ్రజేన సహాహం నగరం గచ్ఛామి.

సూ - 88 కృత్ప్రత్యయాంతముల యోగమునందు వాని కర్మవాచకములకు షష్ఠీభక్తి వచ్చును.
ఉదా - ఋణస్య కర్తా = ఋణమును చేయువాడు

సూ - 89 గుణకర్మణి వేష్యతే (వార్తికమ్ = కృత్ప్రత్యయాన్త యోగమునందు వాని అముఖ్యకర్మకు షష్ఠీవిభక్తి వికల్పముగా వచ్చును ఉదా - సారథిః రథస్య సమరాఙ్గణస్య నేతా (లేక) సారథిః రథస్య సమరాఙ్గణం నేతా

## తృతీయా చతుర్థీ పంచమీ విభక్తులు

| | ఏక. | ద్వి | బహు. |
|---|---|---|---|
| (తృ వి) | నేత్రా | నేతృభ్యామ్ | నేతృభిః |
| (చ వి) | నేత్రే | ,, | నేతృభ్యః |
| (పం. వి) | నేతుః | ,, | ,, |

వీనిలో ఆ, భ్యామ్, భిస్ - అనునవి తృతీయావిభక్తి సుప్ ప్రత్యయములు. ఏ భ్యామ్, భ్యస్ - అనునవి చతుర్థీ విభక్తి సుప్ ప్రత్యయములు అస్, భ్యామ్, భ్యస్ - అనునవి పంచమీవిభక్తి సుప్ ప్రత్యయములు.

నేతృ+ఆ=నేత్రా (సూ-67) నేతృ+భిస్=నేతృభిః (సూ-20)

నేతృ+ఏ=నేత్రే (సూ-67). నేతృ+భ్యస్=నేతృభ్యః (సూ-20)

సూ - 90 ఋకారాంత శబ్దములకు పంచమీ షష్ఠీ విభక్తుల ఏకవచన ప్రత్యయము పరమగునపుడు ఋకారమునకు ఉర్ అను ఆదేశము సుప్ ప్రత్యయమునకు లోపమును వచ్చును

ఉదా - నేతృ + అస్=నేతుర్=నేతుః (సూ-84)

గన్తా = పోవువాడు

శ్వశురః = మామ { భార్యతండ్రి లేక భర్తతండ్రి }

వక్తా = పండువాడు

పఠితా = చదువువాడు

సవ్యేష్టా = సారథి

రక్షితా = రక్షించువాడు

దాతా = ఇచ్చువాడు

మార్గే గన్తృభిః తటాకేషు జలం పీయతే

లక్ష్మణో భ్రాత్రా సహ వనం గచ్ఛతి

జ్యేష్ఠో భ్రాతా పిత్రా సమో భవతి

జమాతృభిః శ్వశురస్య గృహాశం స్వర్గేణ తుల్యం మన్యతే

వక్తృభిః ఓదనః పచ్యతే

విద్యాలయేషు పఠితృభిః గురూణా మాదేశా అనుస్రియన్తే

నృపతిః సమరాఙ్గణే సవ్యేష్టృభిః సహ సమ్భాషతే

నృపతే రాదేశాద్ రక్షితృభిః నగరం రక్ష్యతే

జామాత్రే శ్వశురః పారితోషికం యచ్ఛతి

పితృభ్యాం నమః
దాతృభ్యో ధనం లభన్తే యాచకాః
పితుః భ్రాతుర్వా ధనం లభన్తే బాలాః

సూ - 91 తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయా న్యతరస్యామ్ (పా సూ) = 'సమానమైన' అను అర్థముగల శబ్దముల యోగమునందు వికల్పముగా తృతీయావిభక్తి వచ్చును. ఉదా - పిత్రా సమః భ్రాత్రా సదృశః స్వర్గేణతుల్యమ్ తృతీయావిభక్తి రాని పక్షమున షష్ఠీవిభక్తి వచ్చును. తులా, ఉపమా అను శబ్దముల యోగమునందు షష్ఠీవిభక్తి మాత్రమే వచ్చును ఉదా - పితుః సమః భ్రాతుః సదృశః, స్వర్గస్య తుల్యమ్ కృష్ణస్య తులా కృష్ణస్య ఉపమా

షష్ఠీ, సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ష వి) | నేతుః | నేత్రోః | నేతౄణామ్ |
| (స వి) | నేతరి | ,, | నేతృషు |

వీనిలో అస్, ఓస్ నామ్ - అనునవి షష్ఠీవిభక్తి సుప్ ప్రత్యయములు ఇ, ఓస్, సు-అనునవి సప్తమీవిభక్తి సుప్ ప్రత్యయములు

నేతృ + అస్ = నేతుః (సూ-90, 84) నేతృ + ఓస్ = నేత్రోః (సూ-67, 20) నేతృ+నామ్=నేతౄణామ్ (సూ-42 28), నేతృ + ఇ=నేతరి (సూ-82) నేతృ + సు=నేతృషు (సూ-44)

సూ - 92 నృశబ్దమునకు నామ్ ప్రత్యయము పరమగునపుడు దీర్ఘము వికల్పముగా వచ్చును
ఉదా - నృ+నామ్=నౄణామ్ (లేక) నృణామ్ (సూ-28)

భ్రాతృవ్యః } = సోదరునిపుత్రుడు
భ్రాత్రీయః }

పితృవ్యః = పినతం , పెదతండ్రి

పితామహః = తాత (తండ్రి తండ్రి)

ప్రపితామహః = ముత్తాత

దేవా = మరది

నా = నరుడు

స్రష్టా = సృజించువాడు

భ్రాతుః పుత్రో భ్రాతృవ్యో భ్రాత్రీయో వా భవతి
పితుః భ్రాతా పితృవ్యః
పితుర్వచనేషు రామస్యాదరోఽధికః
వప్తుః లాభేన భారతదేశీయా అధికం మోదన్తే
ద్వేష్టౄణామ్ అభ్యుదయం న సహన్తే వీరాః
పితుఃపితా పితామహః   పితామహస్యపితా ప్రపితామహః
భర్తుః భ్రాతా దేవా ; భర్తుర్జనకో శ్వశురః
నృణామ్ అధిపతి ర్నృపతిః
నేతౄణామ్ ఆదేశాన్ అనుసరన్తి సైనికాః
లోకానాం స్రష్టుః వచనం ప్రమాణమ్
ద్వేష్టృషు శరాన్ క్షిపన్తి యోధాః
పిత్రోః వచనమనుతిష్ఠన్తి పుత్రాః

౮ ఋకారాంత నపుంసకలింగ శబ్దములు.

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక. | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | కర్తృ | కర్తృణీ | కర్తౄణి |
| (సం ప్ర) | (హే) కర్తః<br>(హే) కర్తృ | (హే) కర్తృణీ | (హే)కర్తౄణి |
| (ద్వి వి) | కర్తృ | కర్తృణీ | కర్తౄణి |

వీనిలో కర్తృ అనునది ప్రాతిపదికము స్, ఈ ని - అనునవి ప్రథమావిభక్తి సుప్ ప్రత్యయములు మ్ ఈ, ని - అనునవి ద్వితీయా విభక్తి సుప్ ప్రత్యయములు.

కర్తృ + స్ = కర్తృ (సూ-70) కర్తృ + ఈ = కర్తృణీ (సూ-72 28) కర్తృ+ని=కర్తౄణి (సూ-24 28) (హే)కర్తృ+స = (హే) కర్తర్ + స (సూ-71) = (హే)కర్తర్ (సూ-88) = (హే) కర్తః (సూ-84) (లేదా) (హే) కర్తృ+స్=హేకర్తృ (సూ-70) కర్తృ+మ్=కర్తృ (సూ-70)

## తృతీయా చతుర్థీ పంచమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (తృ వి) | కర్తృణా | కర్తృభ్యామ్ | కర్తృభిః |
| (చ వి) | కర్తృణే | ,, | కర్తృభ్యః |
| (పం వి) | కర్తృణః | ,, | ,, |

వీనిలో ఆ, భ్యామ్, భిస్ - అనునవి తృతీయావిభక్తి ప్రత్యయములు ఏ భ్యామ్, భ్యస్ - అనునవి చతుర్థీవిభక్తి ప్రత్యయములు. అస్, భ్యామ్ భ్యస్ - అనునవి పంచమీవిభక్తి ప్రత్యయములు.

కర్తృ+ఆ= కర్తృణా (సూ-72 28), కర్తృ + భిస్ = కర్తృభిః (సూ-20), కర్తృ + ఏ = కర్తృణే (సూ-72 28) కర్తృ + భ్యస్ = కర్తృభ్యః (సూ-20) కర్తృ + అస్=కర్తృణః (సూ-72 28, 20),

## షష్ఠీ సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ష వి) | కర్తృణః | కర్త్రృణోః | కర్తృణామ్ |
| (స వి) | కర్తృణి | కర్తృణోః | కర్తృషు |

వీనిలో అస్ ఓస్, నామ్ - అనునవి షష్ఠీవిభక్తి ప్రత్యయములు, ఇ, ఓస్ సు - అనునవి సప్తమీవిభక్తి ప్రత్యయములు

కర్తృ+ఓస్=కర్తృణోః (సూ-72 28 20) కర్తృ+నామ్ = కర్త్రృణామ్ (సూ-42, 28) కర్తృ+ఇ = కర్త్రృణి (సూ-72 28) కర్తృ+సు=కర్తృషు (సూ-44)

నపుంసకలింగము —

దైవతమ్ = దేవుడు
శీతమ్ = చలి
ముఖమ్ = నోరు
అపత్యమ్ = సంతానము
కళత్రమ్ = భార్య
విమానః (పుం) / విమానమ్ (న) = విమానము
కుటుమ్బః (పుం) / కుటుమ్బమ్ (న) = కుటుంబము

పుంలింగము —

ఉపకారః = ఉపకారము

విశేషణములు -

సఫల = సఫలమైన
శ్లాఘ్య=కొనియాడదగిన
అప్రియ = అనిష్టమైన

దేవస్య ద్రష్టృణీ నేత్రే సఫలే ఇతి భక్తేన మన్యేత
అప్రియస్యాపి పద్మస్యైవ వక్తృణీ మిత్రాణి
శీతా ద్వాతా దాతపాదపి మానవానాం రక్షితౄణి గృహాణి
వేదానాం పరితౄణి ముఖాని ప్రశన్నాని

కావ్యానాం శ్రోతృణీ శ్రోత్రే శ్లాఘ్యే భవతః
కామానాం దాతృణి దైవతాని పూజయన్తి నరాః
ఆకాశే గన్తృభిర్విమానైర్విహరన్తి దేవాః
ఉపకారస్యైవకర్తృణే మిత్రాయాపి ద్రుహ్యతి మూర్ఖః
న్యాణాం వేతృణే అపత్యాయ స్పృహయతః పితరౌ
ధర్మస్య ద్వేష్టృణః కళత్రాత్ కులం వినశ్యతి
కుటుమ్బస్య భర్తృణో౽పత్యస్య గుణాన్ శ్లాఘన్తే నరాః
లోకానాం స్రష్టృణి దైవతే భక్తానాం చిత్తాని రమన్తే"

సూ - 93 తృతీయాదిషు భాషితపుంస్కం పుంవద్గాలవస్య (పా సూ) = భాషితపుంస్కమగు ఇగంత నపుంసకలింగ శబ్దములకు తృతీయాది విభక్తులయందలి అజాది ప్రత్యయములు పరమగునపుడు వికల్పముగా పుంవద్భావము కలుగును (అనగా విశేషణ వాచకములగు ఇకారాంత ఉకారాంత, ఋకారాంత నపుంసకలింగశబ్దములకు తృతీయాది విభక్తులయందలి అజాది ప్రత్యయములు పరమగునపుడు వికల్పముగా ఆయా పుంలింగ శబ్దములకువలె గూడ రూపనిష్పత్తి కలుగునని భావము)

ఉదా — సురభి = సువాసనకలది

| | | | |
|---|---|---|---|
| (చ వి) | సురభిణే / సురభయే | సురభిభ్యామ్ | సురభిభ్యః |
| (పం వి) | సురభిణః / సురభేః | " | " |
| (ష వి) | " | సురభిణోః / సురభ్యోః | సురభీణామ్ |
| (స వి) | సురభిణి / సురభౌ | " | సురభిషు |

## మృదు = మెత్తనిది

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (చ వి) | మృదునే<br>మృదవే | మృదుభ్యామ్ | మృదుభ్యః |
| (పం వి) | మృదునః<br>మృదోః | ” | |
| (ష వి) | మృదునః<br>మృదోః | మృదునోః<br>మృద్వోః | మృదూనామ్ |
| (స వి) | మృదుని<br>మృదౌ | ” | మృదుషు |

## కర్తృ = చేయునది

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (తృ వి) | కర్తృణా<br>కర్త్రా | కర్తృభ్యామ్ | కర్తృభిః |
| (చ వి) | కర్తృణే<br>కర్త్రే | ” | కర్తృభ్యః |
| (పం వి) | కర్తృణః<br>కర్తుః | కర్తృణోః<br>కర్త్రోః | కర్తౄణామ్ |
| (స వి) | కర్తృణి<br>కర్తరి | ” | కర్తృషు |

తఱచుగా ఋకారాంత నపుంసకలింగ శబ్దములన్నియు భాషిత పుంస్కములే. అందుచే ఆ శబ్దములన్నింటికి తృతీయాది విభక్తులలో అజాది ప్రత్యయములు పరమగునపుడు పై విధముగ రెండు రూపము లేర్పడును.

# అ భ్యా స ము 6

## ఉకారాంత పుంలింగము – తరు శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | తరుః | తరూ | తరవః |
| (సం ప్ర) | (హే) తరో | (హే) తరూ | (హే)తరవః |
| (ద్వి వి) | తరుమ్ | తరూ | తరూన్ |
| (తృ వి) | తరుణా | తరుభ్యామ్ | తరుభిః |
| (చ వి) | తరవే | | తరుభ్యః |
| (పం వి) | తరోః | | ,, |
| (ష వి) | , | తర్వోః | తరూణామ్ |
| (స వి) | తరౌ | | తరుషు |

సఖి పతి శబ్దములుతప్ప తక్కిన ఇకారాంత పుంలింగశబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు ఉకారాంత పుంలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములను ఎకరూపముగనే యుండును ఆ ఇకారాంత పుంలింగ శబ్దరూపము లేర్పడునపుడు కలుగు వ్యాకరణ కార్యములు ఉకారాంత పుంలింగ శబ్దరూపము లేర్పడునపుడు కలుగు వ్యాకరణ కార్యములును సమానముగనే యుండును

అట్లే ఇకారాంత నపుంసక లింగ శబ్దములకు, ఉకారాంత నపుంసక లింగ శబ్దములకును చేరు విభక్తి ప్రత్యయములు ఆ రెండు శబ్దములకు విభక్తి ప్రత్యయములు చేరునపుడు కలుగు వ్యాకరణ కార్యములును సమానముగనే యుండును

### ఉకారాంత నపుంసకలింగము - వస్తుశబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | వస్తు | వస్తునీ | వస్తూని |
| (సం ప్ర) | (హే)వస్తో<br>(హే)వస్తు | (హే)వస్తునీ | (హే)వస్తూని |
| (ద్వి వి) | వస్తు | వస్తునీ | వస్తూని |
| (తృ వి) | వస్తునా | వస్తుభ్యామ్ | వస్తుభిః |
| (చ వి) | వస్తునే | | వస్తుభ్యః |
| (పం వి) | వస్తునః | " | " |
| (ష వి) | " | వస్తునోః | వస్తూనామ్ |
| (స వి) | వస్తుని | " | వస్తుషు |

### ఋకారాంత పుంలింగము—ధాతృశబ్దము

| | | | |
|---|---|---|---|
| (ప్ర వి) | ధాతా | ధాతారౌ | ధాతారః |
| (సం ప్ర) | (హే) ధాతః | (హే) ధాతారౌ | (హే)ధాతారః |
| (ద్వి వి) | ధాతారమ్ | ధాతారౌ | ధాతౄన్ |
| (తృ వి) | ధాత్రా | ధాతృభ్యామ్ | ధాతృభిః |
| (చ వి) | ధాత్రే | " | ధాతృభ్యః |
| (పం వి) | ధాతుః | " | " |
| (ష వి) | " | ధాత్రోః | ధాతౄణామ్ |
| (స వి) | ధాతరి | " | ధాతృషు |

### ఋకారాంత నపుంసకలింగము—దాతృశబ్దము

| | | | |
|---|---|---|---|
| (ప్ర వి) | దాతృ | దాతృణీ | దాతౄణి |
| (సం ప్ర) | (హే) దాతః<br>(హే) దాతృ | (హే) దాతృణీ | (హే)దాతౄణి |

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ద్వి వి) | దాతౄ | దాతృణీ | దాతౄణి |
| (తృ వి) | దాతృణా<br>దాత్రా | దాతృభ్యామ్ | దాతృభిః |
| (చ వి) | దాతృణే<br>దాత్రే | ,, | దాతృభ్యః |
| (పం వి) | దాతృణః<br>దాతుః | ,, | , |
| (ష వి) | ,, | దాతృణోః<br>దాత్రోః | దాతౄణామ్ |
| (స వి) | దాతృణి<br>దాతరి | ,, | దాతృషు |

ఋకారాంత పుంలింగ శబ్దములకు చేరు సుప్ ప్రత్యయములు

| (ఏక) | (ద్వి) | (బహు) |
|---|---|---|
| స్ | ఔ | అస్ |
| అమ్ | ఔ | న్ |
| ఆ | భ్యామ్ | భిస్ |
| ఎ | | భ్యస్ |
| అస్ | , | , |
| | ఓస్ | నామ్ |
| ఇ | | సు |

ఋకారాన్త నపుంసకలింగ శబ్దములకు చేరు సుప్ ప్రత్యయములు

| (ఏక) | (ద్వి) | (బహు) |
|---|---|---|
| ప్ | ఈ | ని |
| మ్ | , | ,, |

తృతీయాది విభక్తులలో ఋకారాంత పుంలింగ శబ్దములకు వలెనే యుండును

భాషిత పుంస్కము అనగా నేమి? భాషిత పుంస్కములైన ఇగంత నపుంసకలింగ శబ్దములకు ఎచ్చ టెచ్చట పుంవద్భావము కలిగి పుంలింగ శబ్దములకువలె వికల్పరూపము లేర్పడును? వివరించునది

క్రింది పాణినీయ సూత్రముల యర్థములను సోదాహరణముగ వివరించునది.

1 ఝయో హో ఽన్యతరస్యామ్. 2 ఖరవసానయో ర్విసర్జనీయః. 3 విరామో ఽవసానమ్. 4 తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయా ఽన్యతరస్యామ్ 5 తృతీయాదిషు భాషితపుంస్కం పుంవద్గాలవస్య. 6 సాధ్వసాధు ప్రయోగేచ (వా). 7 గుణకర్మణి వేష్యతే (వా).

తుల్యవయైన, లేని అను అర్థములు గల శబ్దముల యోగమునందు వచ్చు విభక్తిని సోదాహరణముగ వివరించునది

హేత్వర్థకశబ్దములు, హేతువాచక శబ్దములును ఏయే విభక్తుల యందు ప్రయోగింపబడునో సోదాహరణముగ వివరించునది.

కృత్ప్రత్యయాంతముల కర్మవాచకమునకు వచ్చు విభక్తిని సోదాహరణముగ వివరించునది

క్రింద పేర్కొన్న సందర్భములలో ఋకారాంత పుంలింగ శబ్దములకు కలుగు వ్యాకరణ కార్యములను సోదాహరణముగ వివరించునది.

1 ప్రథమైకవచన ప్రత్యయము పరమగునపుడు -

2 సంబోధనమునందు ప్రథమైకవచన ప్రత్యయము పరమగునపుడు, సప్తమీ ఏకవచన ప్రత్యయము పరమగునపుడును -

3. ప్రథమా విభక్తి ద్వివచన బహువచన ప్రత్యయములు, ద్వితీయా విభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయములును పరమగునపుడు -

4 పితృ, భ్రాతృ, జామాతృ-మున్నగు శబ్దములకు ప్రథమా విభక్తి ద్వివచన బహువచన ప్రత్యయములు, ద్వితీయా విభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయములును పరమగునపుడు -

5 పంచమీ, షష్ఠీ విభక్తుల ఏకవచన ప్రత్యయములు పరమగునపుడు -

6 నృ శబ్దమునకు 'నామ్' ప్రత్యయము పరమగునపుడు -

ఈ పాఠములోని వాక్యములలో భాషిత పుంస్కములగు ఇగంత శబ్ద రూపములకు బదులు వాని వికల్పరూపములను (అనగా పుంవద్భావమువలన కలిగిన రూపములను) చేర్చి వ్రాయునది.

సమానార్థములో క్రింది శబ్దముల లింగ భేదములను గుర్తించునది —

శిశిరః (పుం)
శిశిరమ్ (న) } = శిశిరఋతువు

విమానః (పుం)
విమానమ్ (న) } = విమానము

వజ్రః (పుం)
వజ్రమ్ (న) } = వజ్రాయుధము

కుటుమ్బః (పుం)
కుటుమ్బమ్ (న) } = కుటుంబము

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది .—

తరువులయందు పుష్పములు వికసించుచున్నవి

సజ్జనులు సాధువులయొక్క వచనములను అనుసరింతురు

యోధులు బాణము (ఇషు) లతో శత్రువులను సంహరింతురు

తక్కువయైన సంపదలందు బంధువులు నరులను పరిహరింతురు

దుఃఖములందుకూడ సాధువులచే ధర్మము త్యజింపబడదు

వాయువుచే ధూళియొక్క రేణువులు హరింపబడును

బాలురు గురువులవలన పాఠములను తెలిసికొనుచున్నారు
ప్రభువులచే రాజ్యము శత్రువులనుండి రక్షింపబడును
వశిష్ఠునియొక్క మునిమనుమడగు వ్యాసుని నమస్కరించుచున్నాను
ధాతచే మనుజులు సృజింపబడుచున్నారు
ఋణమును చేయునట్టి తండ్రిని శత్రువుతో సమానునిగా తలంతురు
పుష్పములయందలి మధువును భ్రమరములు త్రాగును
తల్లిదండ్రులచే శిశువులు పోషింపబడుచున్నారు
జ్యేష్ఠుడగు సోదరుని తండ్రితో సమానునిగా చెప్పుచున్నారు
వినాయకుడు శంభువుయొక్క సూనుడు
అన్నమును ఇచ్చువాడుకూడ తండ్రితో సమానుడు అగును
పుత్త్రులు తల్లిదండ్రులయొక్క ఆదేశములను ఆచరింతురు
గురువుయొక్క గురువునుకూడ గురువునువలె పూజింతురు
ప్రపితామహుడు మునిమనుమలకొఱకు మోదకములను తెచ్చుచున్నాడు
తరువులయందు విహంగములు నివసించును.



సప్తమః పాఠః - ఏడవ పాఠము

# తిజంతములు - అనద్యతనభూతార్థకము (లఙ్)

సంస్కృతభాషలో ధాతువులకు వేర్వేరు అర్థములలో మొదట పదివిధములగు లకారములను చేర్చి, పిమ్మట ఆ లకారములకు ఆదేశములుగా మూడు పురుషములయందు మూడువచనముల యందును తిఙ్ ప్రత్యయములనుచేర్చి క్రియాపద రూపముల నిష్పత్తి పేర్కొనబడుచున్నది

లట్, లిట్ లుట్, లృట్, లేట్ లోట్, లఙ్, లిఙ్, లుఙ్, లృఙ్ - అనునవి దశవిధ లకారములు.

వీనిలో లేట్ రూపములు వైదికభాషయందే యుండును. లిఙ్ రూపములు విధ్యర్థకములు వేరుగ, ఆశీరర్థకములు వేరుగను ఉండును. అందుచే లౌకిక సంస్కృతమునందు లేట్టును విడచినను విధిలిఙ్, ఆశీర్లిఙ్ అనువానిని వేరుగ పరిగణించుటవలన పదిలకారములు సంభవించుచున్నవి

'లడ్వర్తమానే లేడ్వేదే, భూతే లుఙ్ లఙ్ లిటస్తథా,
విధ్యాశిషోస్తు లిఙ్ లోటౌ లృఙ్ లృట్ లుట్చ భవిష్యతి.'

లట్ వర్తమానార్థమునందు, లుఙ్, లఙ్, లిట్ - అనునవి భూతార్థమునందు, లిఙ్, లోట్ - అనునవి విధ్యర్థమునందు, ఆశీరర్థమునందును, లృఙ్, లృట్, లుట్ - అనునవి భవిష్యదర్థమునందును వచ్చును.

భూతార్థమునందు వచ్చునట్టి మూడు లకారములలో లుఙ్ భూతార్థమును మాత్రము వివక్షించినపుడు, లఙ్ అనద్యతన భూత

కాలార్థమును వివక్షించినపుడు, లిట్ భూతానద్యతన పరోక్షార్థములను వివక్షించినపుడును వచ్చును

భవిష్యదర్థమునందు వచ్చునట్టి మూడు లకారములలో లృట్ భవిష్యదర్థమును మాత్రము వివక్షించినపుడు లుట్, అనద్యతన భవిష్యత్కాలార్థమును వివక్షించినపుడు, లృఙ్ కార్యకారణ భావమును వివక్షించినపుడును వచ్చును

ఇంతకుముందు పాఠములలో చెప్పబడిన క్రియాపదములన్నియు లఙంత రూపములు తిఙ్ ప్రత్యయము లన్నియు లట్టునకు వచ్చునట్టి తిఙ్ ప్రత్యయములు

## లఙ్ - పరస్మైపదము

### ప్రథమ పురుష

అవసత్ = నివసించెను

అవసతామ్ = (ఇద్దరు) నివసించిరి

అవసన్ = నివసించిరి

వీనిలో 'వస్ అనునది ధాతువు త్, తామ్ అన్ - అనునవి (పరస్మైపదములో) ప్రథమ పురుష లఙ్ ప్రత్యయములు

సూ - 94 లుఙ్ లఙ్ లృఙ్ క్ష్వడుదాత్తః (పా సూ) = లుఙ్ లఙ్ లృఙ్ ప్రత్యయములు పరమగునపుడు హలాది ధాతువులకు ముందు అకారము ఆగమముగా వచ్చును

అ + వస్ + అ + త్ = అవసత్   అ + వస్ + అ + తామ్ = అవసతామ్   అ + వస్ + అ + న్ = అవసన (సూ-8)

(లట్ రూపములయందు వలెనే లఙ్ రూపములయందు గూడ వికరణప్రత్యయము చేరుట మున్నగు గణకార్యములు ప్రవర్తించును)

సః అవసత్   తౌ అవసతామ్   తే అవసన్

మధ్యమ పురుష

అవసః = నివసించితివి

అవసతమ్ = (మీరిద్దరు) నివసించితిరి

అవసత = నివసించితిరి.

వీనిలో స్, తమ్, త - అనునవి (పరస్మైపదములో) మధ్యమ పురుష లఙ్ ప్రత్యయములు

అ + వస్ + అ + స్=అవసః (సూ-20) అ+వస్+అ+తమ్=అవసతమ్ అ + వస్ + అ + త = అవసత

త్వమ్ అవసః యువామ్ అవసతమ్ యూయమ్ అవసత.

ఉత్తమ పురుష

అవసమ్ = నివసించితిని

అవసావ = (మేమిద్దరము) నివసించితిమి

అవసామ = నివసించితిమి

వీనిలో అమ్, వ మ - అనునవి (పరస్మైపదములో) ఉత్తమ పురుష లఙ్ ప్రత్యయములు

అ+వస్+అ+అమ్ = అవసమ్ (సూ-8) అ+వస్+అ+వ = అవసావ (సూ-7) అ + వస్ + అ + మ = అవసామ (సూ-7)

అహమ్ అవసమ్ ఆవామ్ అవసావ వయమ్ అవసామ.

సూ - 95 ఆడజాదీనామ్ (పా సూ) = లఙ్ లఙ్, లృఙ్ ప్రత్యయములు పరమగునపుడు అజాది ధాతువులకుముందు అకారము ఆగమముగా వచ్చును

సూ - 96 ఆటశ్చ (పా సూ) = ధాతువునకు ముందుచేరిన ఆకారాగమమునకు ధాతువు మొదటి అచ్చునకును కలిసి వృద్ధి ఏకాదేశముగా వచ్చును

కాలార్థమును వివక్షించినపుడు, లిట్ భూతానద్యతన పరోక్షార్థములను వివక్షించినపుడును వచ్చును

భవిష్యదర్థమునందు వచ్చునట్టి మూడు లకారములలో ల్ృట్ భవిష్యదర్థమును మాత్రము వివక్షించినపుడు లుట్, అనద్యతన భవిష్యత్కాలార్థమును వివక్షించినపుడు ల్ృఙ్ కార్యకారణ భావమును వివక్షించినపుడును వచ్చును.

ఇంతకుముందు పాఠములలో చెప్పబడిన క్రియాపదములన్నియు లడంత రూపములు తిఙ్ ప్రత్యయము లన్నియు లట్టునకు వచ్చునట్టి తిఙ్ ప్రత్యయములు

## లఙ్ - పరస్మైపదము

### ప్రథమ పురుష

అవసత్ = నివసించెను

అవసతామ్ = (ఇద్దరు) నివసించిరి

అవసన్ = నివసించిరి

వీనిలో 'వస్' అనునది ధాతువు త్ తామ్ అన్ - అనునవి (పరస్మైపదములో) ప్రథమ పురుష లఙ్ ప్రత్యయములు

సూ - 84 లుఙ్ లఙ్ ల్ృఙ్ క్ష్వడుదాత్తః (పా సూ) = లుఙ్ లఙ్ ల్ృఙ్ ప్రత్యయములు పరమగునపుడు హలాది ధాతువులకు ముందు అకారము ఆగమముగా వచ్చును

అ + వస్ + అ + త్ = అవసత్ అ + వస్ + అ + తామ్ = అవసతామ్ అ + వస్ + అ + న్ = అవసన (సూ-3)

(లట్ రూపములయందు వలెనే లఙ్ రూపములయందు గూడ వికరణప్రత్యయము చేరుట మున్నగు గణకార్యములు ప్రవర్తించును )

సః అవసత్ తౌ అవసతామ్ తే అవసన్

మధ్యమ పురుష

అవసః = నివసించితివి

అవసతమ్ = (మీరిద్దరు) నివసించితిరి

అవసత = నివసించితిరి.

వీనిలో స్, తమ్, త - అనునవి (పరస్మైపదములో) మధ్యమ పురుష లఙ్ ప్రత్యయములు

అ + వస్ + అ + స్=అవసః (సూ-20) అ+వస్+అ+తమ్= అవసతమ్ అ + వస్ + అ + త = అవసత

త్వమ్ అవసః యువామ్ అవసతమ్ యూయమ్ అవసత.

ఉత్తమ పురుష

అవసమ్ = నివసించితిని

అవసావ = (మేమిద్దరము) నివసించితిమి

అవసామ = నివసించితిమి

వీనిలో అమ్, వ, మ - అనునవి (పరస్మైపదములో) ఉత్తమ పురుష లఙ్ ప్రత్యయములు

అ+వస్+అ+అమ్ = అవసమ్ (సూ-3) అ+వస్+అ+వ = అవసావ (సూ-7) అ + వస్ + అ + మ = అవసామ (సూ-7)

అహమ్ అవసమ్ అవామ్ అవసావ వయమ్ అవసామ.

సూ - 95 అడజాదీనామ్ (పా సూ) = లఙ్, లుఙ్, లృఙ్ ప్రత్యయములు పరమగునపుడు అజాది ధాతువులకుముందు అకారము ఆగమముగా వచ్చును

సూ - 96 ఆటశ్చ (పా సూ) = ధాతువునకు ముందుచేరిన అకారాగమమునకు ధాతువు మొదటి అచ్చునకును కలిసి వృద్ధి ఏకాదేశముగా వచ్చును

ఉదా - అ + అట్ + అ + త్ = అటత్   అ + ఇచ్ఛ్ + అ + త్ = ఐచ్ఛత్   అ + ఉక్ష్ + అ + త్ = ఔక్షత్

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర. పు) | ఐచ్ఛత్ | ఐచ్ఛతామ్ | ఐచ్ఛన్ |
| (మ పు) | ఐచ్ఛః | ఐచ్ఛతమ్ | ఐచ్ఛత |
| (ఉ. పు) | ఐచ్ఛమ్ | ఐచ్ఛావ | ఐచ్ఛామ |

ఉపసర్గలు పరినిష్పన్నములైన క్రియాపద రూపములకే చేరును

ఉదా - ప్ర + అవిశత్ = ప్రావిశత్

ధాతా లోకే జనాన్ అసృజత్

సేనాపతి ర్యుద్ధాయ సైనికాన్ సమరాఙ్గణమ్ అనయత్

మూర్ఖ ఉపకారస్య కర్తృ మిత్రం వ్యస్మరత్

పితరౌ మోదకైః పుత్రాన్ అప్రీణయతామ్

బాలాః ఖేలనాయ క్రీడాఙ్గణం ప్రావిశన్

రామో లక్ష్మణశ్చ వనే వ్యవసతామ్

యూయం హరిమ్ అనమత

పథికా నగరాన్నగరం పర్యాటన్

యువాం భోజనాయోదనమ్ అపచతమ్

త్వం దైవతానాం ప్రసాదేన రిపూన్ అజయః

ఆవాం నిష్కాన్ అగణయావ

లక్ష్మణోఽపి భ్రాత్రా సహ వనమ్ అగచ్ఛత్

వయం విద్యాలయే పాఠాన్ అపఠామ

అహం వ్యాకరణస్య పుస్తకమ్ అరచయమ్

రక్షకాః నగరే జనాన్ చోరేభ్యోఽరక్షన్

విద్యాలయే పఠితారో బాలాః పారితోషికాన్ ఐచ్ఛన్

అహం హస్తౌ పాదౌచ ప్రాక్షాళయమ్
తౌ హరే రుపవనాత్ కుసుమా న్యానయతామ్
స్తేనాః నారాయణస్య గృహాద్వస్తూ న్యపాహరన్
శ్వశురస్యాదరేణ జామాతా తుష్యత్

## లజ్ - ఆత్మనేపదము

### ప్రథమ పురుష

అవన్దత = వందనము చేసెను
అవన్దేతామ్ = (ఇద్దరు) వందనము చేసిరి
అవన్దన్త = వందనము చేసిరి

వీనిలో త, ఇతామ్ అన్త - అనునవి (ఆత్మనేపదములో) ప్రథమ పురుష లజ్ ప్రత్యయములు

అ + వన్ద్ + అ + త = అవన్దత అ + వన్ద్ + అ + ఇతామ్ = అవన్దేతామ్ (సూ-27) అ + వన్ద్ + అ + అన్త = అవన్దన్త (సూ-3)
సః అవన్దత తౌ అవన్దేతామ్ , తే అవన్దన్త

### మధ్యమ పురుష

అవన్దథాః = వందనము చేసితివి
అవన్దేథామ్ = (మీరిద్దరు) వందనము చేసితిరి
అవన్దధ్వమ్ = వందనము చేసితిరి.

వీనిలో థాః, ఇథామ్ ధ్వమ్ - అనునవి (ఆత్మనేపదములో) మధ్యమపురుష లజ్ ప్రత్యయములు

అ + వన్ద్ + అ + థాః = అవన్దథాః అ = వన్ద్ + అ + ఇథామ్= అవన్దేథామ్ (సూ-27) అ + వన్ద్ + అ + ధ్వమ్ = అవన్దధ్వమ్
త్వమ్ అవన్దథాః యువామ్ అవన్దేథామ్ యూయమ్ అవన్దధ్వమ్

## ఉత్తమ పురుష

అవన్దే = వందనము చేసితిని

అవన్దావహి = (మేమిద్దరము) వందనము చేసితిమి

అవన్దామహి = వందనము చేసితిమి

వీనిలో ఇ వహి మహి - అనునవి (ఆత్మనేపదములో) ఉత్తమ పురుష లఙ్ ప్రత్యయములు

అ + వన్ద్ + అ + ఇ = అవన్దే   అ + వన్ద్ + అ + వహి = అవన్దావహి (సూ-7)  అ + వన్ద్ + అ + మహి = అవన్దామహి (సూ-7)

అహమ్ అవన్దే, ఆవామ్ అవన్దావహి వయమ్ అవన్దామహి

రామో లక్ష్మణశ్చ వనే రాక్షసైస్సహ యుధ్యేతామ్

పాండవాః కౌరవాశ్చ ద్రోణాచార్య దస్త్రాణ్య శిక్షన్త

కృష్ణో మిత్రస్యాభ్యుదయేన అమోదత

నృపస్యాదేశేన శరో యోద్ధేనా త్యజ్యత

చోరేణ గృహం ప్రావిశ్యత

ఆవాం వణిగ్భిస్సహ అభాషావహి

యువాం మిత్రైస్సహ దుఃఖాన్యసహేథామ్

బాలైర్నూతనాని పుస్తకాన్యైష్యన్త

యోధాభ్యాం శరైః స్సమరాఙ్గణే రిపవోఽమ్రియన్త

యూయం గురూన్ అవన్దధ్వమ్

వ్యాధాః వనే వ్యాఘ్రాన్ అమృగయన్త

వాల్మీకినా రామాయణం వ్యరచ్యత

భక్తా విష్ణుం మోక్షమ్ అయాచన్త

వయం దేవం దుఃఖేషు రక్షితారమ్ అమన్యామహి

మరికొన్ని పరస్మైపది ధాతువులు —

| (మొదటి గణము) | లట్ - లఙ్ |
|---|---|
| చిత్ - సంజ్ఞానే=తెలివినందుట గుర్తించుట | చేతతి - అచేతత్ |
| నన్ద్ - సమృద్ధౌ=వర్ధిల్లుట సంతోషించుట | నన్దతి - అనన్దత్ |
| క్రన్ద్ - అహ్వానే రోదనే చ=పిలుచుట ఏడ్చుట | క్రన్దతి - అక్రన్దత్ |
| అర్చ్ - పూజాయామ్ = పూజించుట | అర్చతి - ఆర్చత్ |
| మూర్ఛ్ - మోహసముచ్ఛ్రాయయోః = మూర్ఛిల్లుట పెరుగుట | మూర్ఛతి - అమూర్ఛత్ |
| వ్రజ - గతౌ = వెళ్ళుట | వ్రజతి - అవ్రజత్ |
| జప - మానసే = జపించుట | జపతి - అజపత్ |
| చుమ్బ్ - వక్త్రసంయోగే = చుంబించుట | చుమ్బతి - అచుమ్బత్ |
| క్రుశ్ - ఆహ్వానే, రోదనేచ = పిలచుట ఏడ్చుట | క్రోశతి - అక్రోశత్ |
| శంస్ - స్తుతౌ = స్తుతించుట | శంసతి - అశంసత్ |
| లగ్ - సంగే = లగ్నమగుట కలియుట | లగతి - అలగత్ |
| ధ్వన్ - శబ్దే = ధ్వనించుట | ధ్వనతి - అధ్వనత్ |
| జ్వల్ - దీప్తౌ = మండుట | జ్వలతి - అజ్వలత్ |
| గ్లై - హర్షక్షయే = వాడిపోవుట అలసిపోవుట | గ్లాయతి - అగ్లాయత్ |
| మ్లై - హర్షక్షయే = వాడిపోవుట అలసిపోవుట | మ్లాయతి - అమ్లాయత్ |
| ధ్యై - చిన్తాయామ్ = ధ్యానించుట | ధ్యాయతి - అధ్యాయత్ |
| ష్ణై - వేష్టనే, శౌచేచ = స్నానముచేయుట | స్నాయతి - అస్నాయత్ |
| స్రు - గతౌ = స్రవించుట | స్రవతి - అస్రవత్ |
| తర్జ - భర్త్సనే = భయపెట్టుట | తర్జతి - అతర్జత్ |
| శుచ్ - శోకే = శోకించుట | శోచతి - అశోచత్ |

| (నాల్గవగణము) | లట్ - లఙ్ |
|---|---|
| పుష్ప - వికసనే = పూయుట | పుష్ప్యతి - అపుష్ప్యత్ |
| దుష్ - వైకృత్యే = చెడిపోవుట | దుష్యతి - అదుష్యత్ |
| శుధ్ - శౌచే = పరిశుద్ధమగుట | శుధ్యతి - అశుధ్యత్ |
| సిధ్ - సంరాద్ధౌ = సిద్ధించుట | సిధ్యతి - అసిధ్యత్ |
| తృప్ - ప్రీణనే=తృప్తినందుట తృప్తిపరచుట | తృప్యతి - అతృప్యత్ |
| స్నిహ్ - ప్రీతౌ = స్నేహించుట | స్నిహ్యతి - అస్నిహ్యత్ |
| భ్రమ్ (భ్రామ్) - అనవస్థానే = తిరుగుట | భ్రామ్యతి - అభ్రామ్యత్ |
| మద్ (మాద్) - హర్షే = సంతోషించుట మత్తిల్లుట | మాద్యతి - అమాద్యత్ |
| కృశ్ - తనూకరణే = కృశించుట, కృశింపజేయుట | కృశ్యతి - అకృశ్యత్ |
| హృష్ - హృష్టౌ = సంతోషించుట | హృష్యతి - అహృష్యత్ |

| (ఆరవ గణము) | లట్ - లఙ్ |
|---|---|
| గుమ్ఫ్ - గ్రన్థే = కూర్చుట | గుమ్ఫతి - అగుమ్ఫత్ |
| ఉజ్ఝ్ - ఉత్సర్గే = విడచుట | ఉజ్ఝతి - ఔజ్ఝత్ |
| కుచ్ - సంకోచనే = ముడుచుకొనుట | కుచతి - అకుచత్ |
| మృశ్ - ఆమర్శనే = స్పృశించుట | మృశతి - అమృశత్ |
| కిర్ - విక్షేపే = చల్లుట | కిరతి - అకిరత్ |

వయం మిత్రస్యాభ్యుదయేన అనన్దామ

యదా శిశు రక్రన్దత్ తదా నేత్రాభ్యామ్ అశ్రూణి అస్రవన్

భక్తా దేవాన్ అర్చన్, తేన తే అతృప్యన్

పితా పుత్రస్య శీర్షమ్ అమృశత్ అచుమ్బచ్చ

దశరథస్య మరణేన రామో లక్ష్మణశ్చ వనే అశోచతామ్ అమూర్ఛతాంచ

కవయః సర్వదా నృపతీన్ శంసన్తి, తే కవిషు స్నిహ్యన్తి చ

బ్రాహ్మణాస్తటాకే స్నాయన్తి శుధ్యన్తి మన్త్రాన్ జపన్తి చ

కృష్ణో బన్ధుభిస్సహ బృన్దావనమ్ అవ్రజత్, తత్రతైః సహ అభ్రామ్యత్

యదా చన్ద్రస్య ప్రకాశో లగతి తదా పద్మాని సంకుచన్తి

యతశ్చోర ఆవామ్ అతర్జత్ తత ఆవామ్ అక్రోశావ

యజమానా ఘృత మగ్నౌ ప్రాస్యన్తి తతోఽగ్నిస్సర్వదా జ్వలతి

యూయం దేవమ్ అహ్వాయత్ తేన దేవోఽహృష్యత్

వసన్తే వృక్షాః పుష్ప్యన్తి పుష్పేషు భ్రమరా మధు పిబన్తి మాద్యన్తి చ

త్వం ఖలస్య స్నేహేన అముష్యః

యత్నైః కార్యాణి సిధ్యన్తి

గ్రీష్మే చణ్డేనాతపేన బాలానాం ముఖాన్యగ్లాయన్

ఆతపేన కుసుమాని మ్లాయన్తి

యదా ఆకాశే మేఘాః ధ్వనన్తి తదా మయూరా నృత్యన్తి

వ్యాధిభిర్నరాః కృశ్యన్తి

తాః పుష్పాణి గుమ్ఫన్తి

యతయః కామాన్ ఉజ్ఝన్తి

కృషీవలః క్షేత్రే బీజాన్యకిరత్

సూ - 97 స్తోః శ్చునా శ్చుః (పా సూ) = సకారతవర్గాక్షరములకు శకార చవర్గాక్షరములతో కలయిక యున్నపుడు వరుసగా శకార చవర్గాక్షరములు ఆదేశములగును

ఉదా - అచమృత్ + చ = అచమృచ్చ, మన్త్రిన్ + జపన్తి = మన్త్రిఞ్జపన్తి.

మరికొన్ని ఆత్మనేపదిధాతువులు -

| (మొదటిగణము) | లట్ - లఙ్ |
|---|---|
| స్వాద్ - ఆస్వాదనే = ఆస్వాదించుట | స్వాదతే - ఆస్వాదత |
| లోక్ - దర్శనే = చూచుట | లోకతే - అలోకత |
| లజ్జ్ - గతౌ, భోజనవివృత్తౌచ = గెంతుట దాటుట, లంఘనము చేయుట | లజ్జతే - అలజ్జత |
| లమ్బ్ - అవస్రంసనే = వ్రేలాడుట | లమ్బతే - అలమ్బత |
| ఈక్ష్ - దర్శనే = చూచుట | ఈక్షతే - ఐక్షత |
| భాస్ - దీప్తౌ = ప్రకాశించుట | భాసతే - అభాసత |
| కాశ్ - దీప్తౌ = ప్రకాశించుట | కాశతే - అకాశత |
| ద్యుత్ - దీప్తౌ = ప్రకాశించుట | ద్యోతతే - అద్యోతత |
| స్రంస్ - అవస్రంసనే = క్రిందపడుట | స్రంసతే - అస్రంసత |
| రమ్ - క్రీడాయామ్ = రమించుట ఆడుట | రమతే - అరమత |
| స్మిఙ్ - ఈషద్ధసనే = చిరునవ్వునవ్వుట | స్మయతే - అస్మయత |
| త్రై - పాలనే = రక్షించుట | త్రాయతే - అత్రాయత |
| కృప్ - సామర్థ్యే = సమర్థుడగుట | కల్పతే - అకల్పత |
| త్రప్ - లజ్జాయామ్ = సిగ్గుపడుట | త్రపతే - అత్రపత |

| (నాల్గవగణము) | లట్ - లఙ్ |
|---|---|
| షూ - ప్రాణిప్రసవే = కనుట | సూయతే - అసూయత |
| మా - మానే = కొలుచుట | మాయతే - అమాయత |
| పద్ - గతౌ = పొందుట | పద్యతే - అపద్యత |
| ప్రీ - ప్రీతౌ = సంతోషించుట | ప్రీయతే - అప్రీయత |

దృ - ఆదరే = ఆదరించుట ద్రియతే - అద్రియత

(ఉద్+)విజ్ - భయచలనయోః = భయపడుట ఉద్విజతే - ఉదవిజత

బాలకా మోదకాన్ ఆస్వాదన్త
ఆఞ్జనేయః సముద్రమ్ అలఙ్ఘత
భక్తాన్ సంకటేభ్యో త్రాయతే విష్ణుః
ఆకాశే విమానమ్ ఐక్షామహి
రామస్య శరీరే భూషణాని మణిభిః ద్యోతన్తే
విఘ్నాద్భయేన కార్యం నారభతే మూర్ఖః
అజ్ఞానేన త్రపన్తే బాలాః
భక్తానాం చిత్తాని సర్వదా ఈశ్వరే రమన్తే
పుష్పేభ్యో మధునో బిన్దూన్యస్రంసన్త
జ్ఞానం మోక్షాయ కల్పతే
శిశవః సదా స్మయన్తే
నగరేషు ప్రాసాదా భాసన్తే
ఆపణేషు చిత్రాణి వస్త్రాణి లమ్బన్తే తాని జనా లోకన్తే
ఆకాశే నక్షత్రాణి ప్రకాశన్తే
ఒలీవస్య కళత్రం ప్రశస్యం పుత్రమ్ అసూయత
ఉద్యోగస్య ఫలం ప్రతిపద్యన్తే నరాః
ఖేలనేన సర్వదా ప్రీయన్తే బాలకాః
క్షేత్రే ధాన్యమ్ అమాయన్త కృషీవలాః
యదా శ్వాపదాన్ లోకన్తే తదా జనా ఉద్విజన్తే
నృపతయో లోకాశ్చ బుధాన్ సదా ఆద్రియన్తే

## అ భ్యా స ప్ర:— 7

| | పరస్మైపద లఙ్ ప్రత్యయములు ఏక | ద్వి. | బహు. | ఆత్మనేపద లఙ్ ప్రత్యయములు ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|---|---|---|
| (ప్ర. పు) | త్ | తామ్ | అన్ | త | ఇతామ్ | అన్త |
| (మ. పు) | స్ | తమ్ | త | థాః | ఇథామ్ | ధ్వమ్ |
| (ఉ. పు) | అమ్ | వ | మ | ఇ | వహి | మహి |

దశవిధ లకారములను పేర్కొని అవి ఏ అర్థములో ధాతువులకు చేరునో వివరింపుడు.

క్రింది పాణినిసూత్రముల యర్థములను సోదాహరణముగ వివరింపుడు.

1. లుఙ్ లఙ్ లృఙ్ క్ష్వడుదాత్తః ; 2 ఆడజాదీనామ్ 3 ఆటశ్చ. 4 స్తోః శ్చునా శ్చుః

పరస్మైపదమునందును, ఆత్మనేపదమునందును లజంత రూప నిష్పత్తి ప్రకారమును వివరింపుడు.



అష్టమః పాఠః - ఎనిమిదవ పాఠము

# కృదన్తములు

సంస్కృతభాషలో సుప్ ప్రత్యయములకు ప్రకృతులయిన ప్రాతిపదికములు నాలుగు రకములు గలవు—కృదంతములు, తద్ధితాంతములు, సమాసములు, కేవల ప్రాతిపదికములు.

సూ - 98 అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్ (పా సూ) =ధాతువు, ప్రత్యయము, ప్రత్యయాంతములవు అర్థవంతమైన తక్కిన శబ్దస్వరూపము ప్రాతిపదికము అనబడును

సూ - 99 కృత్తద్ధితసమాసాశ్చ (పా సూ) = కృదంతము, తద్ధితాంతము, సమాసముకూడ ప్రాతిపదికము లనబడును.

అందు కృదంతములనగా కృత్ ప్రత్యయములు అంతమందుగల శబ్దములని యర్థము. ధాతువునకు చేయనట్టియు, ప్రాతిపదికత్వ సంపాదక మగునట్టియు, తిజ్భిన్న ప్రత్యయములకు కృత్ ప్రత్యయములని పేరు.

సూ - 100 కృదతిఙ్ (పా సూ) = ధాతువునకు విధింపబడిన తిఙ్ భిన్నమైన ప్రత్యయము 'కృత్' అనబడును

క్త, క్తవత్, శతృ శానచ్ క్త్వా, ల్యప్, తవ్య, అనీయర్ః యత్ తృచ్ ణ్వుల్, ల్యుట్, ఆ తి - మున్నగునవి కృత్ ప్రత్యయములు.

కృదంతములలో కొన్ని విశేషణ వాచకములు కావున అవి విశేష్యనిఘ్నములు, అందుచే అవి విశేష్యముయొక్క లింగవచన విభక్తుల ననుసరించి ప్రయోగింపబడును.

కొన్ని కృదంతములు విశేష్యవాచకములు అందుచే అవి నియత లింగములుగ నుండును.

కొన్ని కృదంతములు అవ్యయములుగ ప్రయోగింపబడుచున్నవి

(కృదంతములను గురించి కొన్ని సామాన్య నియమములు ఇచ్చట పేర్కొనబడును విశేషములు ముమ్ముందు వివరింపబడును)

1) క్త ప్రత్యయాంతములు —

భూతకాలార్థమునందు ధాతువునకు 'త అను దానిని చేర్చుటచే క్త ప్రత్యయాంతశబ్దము లేర్పడును ఈ ప్రత్యయము సకర్మకధాతువులకు కర్మార్థమునందును అకర్మక ధాతువులకు భావార్థమునందును చేరును

ఉదా - జి + త = జిత = జయింపబడిన భూత + త = భూత= అయిన, ఉండిన

కొన్ని ధాతువులకంటె పరమగునపుడు 'త' అను ఈ ప్రత్యయమునకు ముందు ఇకారమాగమముగా చేయను (దీనిని ఇడాగమమందురు) ఉదా -పఠ్+త=పఠిత=చదువబడిన పత్+త=పతిత=పడిన

'త అను ఈ ప్రత్యయము పరమగునపుడు కొన్ని ధాతువులలో గల యకార వకార రేఫ లకారములకు వరుసగా ఇ ఉ, ఋ ఌ అను వర్ణము లాదేశములగును అప్పుడు వానితో చేరియున్న అచ్చు లోపించును ఉదా - వద్ + త = వద్ + ఇత = ఉదిత = చెప్పబడిన, వప్ + త = ఉప్త = నాటబడిన

2) తుమున్ ప్రత్యయాంతములు .

కొఱకు అను అర్థములో ధాతువునకు 'తుమ్' అనునది చేరి తుమున్ ప్రత్యయాంతరూపము లేర్పడును ఉదా - గమ్ + తుమ్ = గన్తుమ్ = వెళ్ళుటకొఱకు దా + తుమ్ = దాతుమ్ = ఇచ్చుటకొఱకు .

తుమ్ అనునది పరమగునపుడు ధాతువు తుది ఇక్కానకు, ఉపధయగు హ్రస్వ ఇక్కానకును గుణము వచ్చును ఉదా - నీ + తుమ్ = నేతుమ్= తీసికొనిపోవుటకొఱకు. భుజ్ + తుమ్ = భోక్తుమ్ = భుజించుటకొఱకు

కొన్ని ధాతువులకంటె పరమగునపుడు 'తుమ్' అనుదానికి ముందు ఇకారమాగమముగా చేయును ఉదా - పఠ్ + తుమ్ = పఠితుమ్ = చదువుటకొఱకు చర్ + తుమ్ = చరితుమ్ = చరించుటకొఱకు. తుమున్ ప్రత్యయాంతములు అవ్యయములు (సూ-54)

3) క్త్వాప్రత్యయాంతములు —

సూ - 0 సమానకర్తృకయోః పూర్వకాలే (పా సూ) = సమానకర్తృకములైన రెండు క్రియలలో మొదటిక్రియను తెలుపు ధాతువునకు త్వా అను ప్రత్యయము చేరును.
ఉదా - జి+త్వా=జిత్వా=జయించి (జిత్వా గచ్ఛతి=జయించి పోవుచున్నాడు )

కొన్ని ధాతువులకంటె పరమయినపుడు త్వా ప్రత్యయమునకు ముందు ఇకారమాగమముగా చేరును

ఉదా - పఠ్+త్వా=పఠిత్వా = చదివి చర్ + త్వా = చరిత్వా = చరించి

4) ల్యప్ ప్రత్యయాంతములు -

సూ - 02 ఉపసర్గ పూర్వకమైన ధాతువుకంటె పరమయిన త్వా ప్రత్యయమునకు 'య' అనునది ఆదేశమగును
ఉదా - అను + భూ + త్వా = అనుభూయ

క్త్వాప్రత్యయాంతములు ల్యప్ ప్రత్యయాంతములును అవ్యయములు (సూ-55)

### 5) తవ్య ప్రత్యయాంతములు (లేక) తవ్యత్ ప్రత్యయాంతములు —

తవ్య అను ప్రత్యయము సకర్మక ధాతువులకు కర్మార్థము నందును అకర్మక ధాతువులకు భావార్థమునందును చేరును భావార్థమునందు చేరునపుడు ఆ పద మెల్లప్పుడును నపుంసకలింగ ప్రథమైక వచనమునందే యుండును ఈ ప్రత్యయము పరమగునపుడు ధాతువు చివరి ఇక్కునకు ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణము వచ్చును కొన్ని ధాతువులకంటె పరమగునపుడు ఈ ప్రత్యయము నకు ముందు ఇకారము ఆగమముగా చేరును. ఉదా - జి + తవ్య = జేతవ్య = జయింపబడదగిన బుధ్ + తవ్య = బోద్ధవ్య = తెలిసికొనబడ దగిన పఠ్ + తవ్య = పఠితవ్య = చదువబడదగిన ఏధ్ + తవ్య = ఏధితవ్యమ్ = వర్ధిల్లదగినది భూ + తవ్య = భవితవ్యమ్ = ఉండదగినది

వస్ ధాతువునకు మాత్రము ఈ తవ్య ప్రత్యయము కర్త్రర్థము నందు చేరును ఈ ప్రత్యయము పరమగునపుడు వస్ ధాతువు అకారము నకు వృద్ధి అనగా ఆకారమువచ్చును

ఉదా - వస్ + తవ్య = వాస్తవ్య = నివసించునట్టి

### 6) అనీయర్ ప్రత్యయాంతములు —

సకర్మక ధాతువులకు కర్మార్థమునందు అకర్మక ధాతువులకు భావార్థమునందు 'అనీయ' అనునది చేరును ఈ ప్రత్యయము పరమగునపుడు ధాతువు తుది ఇక్కునకు ఉపధయగు హ్రస్వఇక్కునకును గుణము వచ్చును భావార్థమునందు చేయునపుడు ఆ పద మెల్లప్పుడు నపుంసకలింగ ప్రథమైక వచనమునందే ఉండును

ఉదా - పఠ్ + అనీయ = పఠనీయ = చదువబడదగిన కృ + అనీయ = కరణీయ = చేయబడదగిన ఎధ్ + అనీయ = ఎధనీయమ్ = వర్ధిందగినది

7) 'య ప్రత్యయాంతములు —

య అనునది ధాతువునకు చేరుటచే ఈ ప్రత్యయాంత రూపము లేర్పడును ఇదికూడ సకర్మక ధాతువులకు కర్మార్థమునందు అకర్మకధాతువులకు భావార్థమునందును చేరును ఈ ప్రత్యయము పర మగునపుడు ధాతువు చివరి ఇ ఈ లకు ఉ ఊ లకును ఉపధ యగు ఇకార ఉకారములకును గుణము వచ్చును ఓకారమునకు అవ్ అను ఆదేశమగును ఉదా - నీ + య = నేయ = తీసికొనిపోదగిన భూ+య = భో+య = భవ్య = ఉండదగిన కాదగిన బుధ్+య = బోధ్య = తెలిసికొనదగిన

ఈ ప్రత్యయము పరమగునపుడు ధాతువు తుది ఆకారమునకు ఏకారాదేశము ఋకారమునకు వృద్ధియు వచ్చును ఉదా - దా + య = దేయ = ఇవ్వబడదగిన కృ + య = కార్య = చేయబడదగిన

హ్రస్వముకంటె పరమగునపుడు ఈ ప్రత్యయమునకు ముందు తకారము ఆగమముగా చేరును

ఉదా - స్తు+య=స్తుత్య=స్తుతింపబడదగిన (ఇ స్తు వృజ్ దృ జుష్ అను ధాతువులకును ఋకారోపధములగు ధాతువులకును య' ప్రత్యయము పరమగునపుడు అచ్చునకు మార్పురాదు )

ఈ ప్రత్యయము పరమగునపుడు కలుగు వ్యాకరణ కార్యములను బట్టి ఇది కొన్నిచోట్ల యత్ ప్రత్యయముగ, కొన్నిచోట్ల ణ్యత్ ప్రత్యయముగ కొన్నిచోట్ల క్యప్ ప్రత్యయముగ పేర్కొనబడుచున్నది

8) ణ్వుల్ ప్రత్యయాంతములు —

ణ్వుల్ ప్రత్యయము ధాతువునకు కర్త్రర్థమునందు చేరును ధాతువునకు చేరినవెంటనే దీనికి అక అను ఆదేశమువచ్చును 'అక

అనునది పరమగునపుడు ధాతువు తుది యచ్చునకు ఉపధయగు అకారము నకు వృద్ధియు ఉపధయగు అకారేతర హ్రస్వమునకు గుణమును వచ్చును (కాని కొన్ని మకారాంత ధాతువుల అకారమునకు వృద్ధిరాదు)

ఉదా - నీ + అక = నై + అక=నాయక=వెంటతీసికొనిపోవునట్టి పచ్+ అక=పాచక=వండునట్టి పుష్ + అక = పోషక = పోషించునట్టి

అక అనునది పరమగునపుడు ఆకారాన్త ధాతువుల చివర యకారము ఆగమముగా చేరును ఉదా - స్థా + అక = స్థాయక = నిలచి యుండునట్టి . దా + అక = దాయక = ఇచ్చునట్టి

## ౪) తృచ్ ప్రత్యయాంతములు —

ధాతువునకు కర్త్రర్థమునందు 'తృ' అనునది చేరి తృచ్ ప్రత్యయాంత రూపము ఏర్పడును ఈ ప్రత్యయము పరమగునపుడు ధాతువు చివరి ఇక్కునకు ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణము వచ్చును

ఉదా - నీ + తృ = నేతృ = వెంటతీసికొనిపోవునట్టి (నాయకుడు) పచ్ + తృ = పక్తృ = వండునట్టి

## ౦) ల్యుట్ ప్రత్యయాంతములు —

ధాతువునకు భావార్థమునందు ల్యుట్ ప్రత్యయము చేరను పిమ్మట దీనికి 'అన' అను ఆదేశము వచ్చును అన అనునది పరమగు నపుడు ధాతువు చివరి ఇక్కునకు ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణము వచ్చును ఈ ల్యుట్ ప్రత్యయాంతములు సామాన్యముగా నిత్యనపుంసకలింగములు ఉదా - పఠ్ + అన = పఠనమ్ = చదువుట స్మృ + అన = స్మరణమ్ = స్మరించుట పుష్ + అన = పోషణమ్ = పోషించుట

1 ) అ ప్రత్యయాంతములు —

ధాతువునకు భావార్థమునందు చేరు మరియొక ప్రత్యయము 'అ' అనునది ఈ ప్రత్యయము చేరునప్పుడు కలుగు వ్యాకరణ కార్యములలోగల భేదమునుబట్టి ఇది కొన్నిచోట్ల ఘఞ్ ప్రత్యయముగ కొన్నిచోట్ల ణ ప్రత్యయముగ, కొన్నిచోట్ల క ప్రత్యయముగ, కొన్నిచోట్ల అచ్ ప్రత్యయముగ - ఈవిధముగ వేర్వేరు రూపములలో వ్యవహరింపబడుచున్నది

అ అను ప్రత్యయము పరమగునపుడు కొన్ని ధాతువులలో అచ్చునకు గుణము కొన్ని ధాతువులలో అచ్చునకు వృద్ధియు వచ్చును. అ' ప్రత్యయాంత శబ్దములన్నియు నిత్యపుంలింగములు.

ఉదా - జి + అ = జయః = జయము, పచ్ + అ = పాకః = వంట యుజ్ + అ = యోగః = కలయిక.

9 ఆకారాంత స్త్రీలింగ శబ్దములు —

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | లతా | లతే | లతాః |
| (సం ప్ర) | (హే) లతే | ,, | ,, |
| (ద్వి. వి) | లతామ్ | ,, | ,, |

వీనిలో 'లతా అనునది ప్రాతిపదికము స్ ఈ, అస్ - అనునవి ప్రథమా విభక్తి సుప్ ప్రత్యయములు మ్, ఈ, స్ - అనునవి ద్వితీయా విభక్తి సుప్ ప్రత్యయములు

సూ - 03 ఆకారాన్త, ఈకారాన్త స్త్రీలింగ శబ్దములకంటె పరమయిన ప్రథమైకవచన ప్రత్యయము లోపించును

ఉదా - లతా + స్ = లతా

లతా + ఈ = లతే (సూ-27) లతా + అస్=లతాః (సూ-22, 21) లతా + స్ = లతాః (సూ-20) కాని లక్ష్మీ శబ్దముకంటె పరమయిన ప్రథమైక వచన ప్రత్యయమునకు లోపమురాదు

ఉదా - లక్ష్మీ + స్ = లక్ష్మీః (సూ-20)

సూ - 04 సంబుద్ధౌచ (పా సూ) = ఆకారాంత స్త్రీలింగ శబ్దముల ఆకారమునకు సంబోధనైకవచనమునందు ఏకారాదేశమగును ఉదా - (హే) లతా + స్ = (హే)లతే + స్ = (హే)లతే (సూ-23)

సూ - 05 అమ్బార్థనద్యోర్హ్రస్వః (పా సూ) = సంబోధనైక వచనమునందు అంబ (అమ్మ) అను అర్థముగల శబ్దముల ఆకారమునకు నిత్య స్త్రీలింగములైన ఈకారాంత ఊకారాంత శబ్దముల ఈకార ఊకారములకును హ్రస్వము వచ్చును

ఉదా - (హే) అమ్బా + స్ = (హే) అమ్బ + స్ = హే అమ్బ (సూ-23)

| స్త్రీలింగము | పుంలింగము |
|---|---|
| చన్ద్రికా = వెన్నెల | అర్థః = ధనము సొత్తు |
| విద్యా = విద్య | చకోరః = చకోరపక్షి |
| ప్రజా = ప్రజ | జడః = మందబుద్ధికలవాడు |
| లలనా = స్త్రీ | ఉద్యమః = ప్రయత్నము |
| | మనోరథః = కోరిక |
| | ప్రయాగః = ప్రయాగయనెడి స్థలము |

| అవ్యయములు - | | విశేషణములు - |
|---|---|---|
| గుమ్ఫ్+త్వా = గుమ్ఫిత్వా | = కూర్చి | పరకీయ = ఇతరులకు సంబంధించినది |
| క్రీడ్+తుమ్= క్రీడితుమ్ | =ఆడుటకొఱకు | స్వప్ + త = సుప్త = నిద్రించిన |
| | | ఆత్మీయ = తన సంబంధమైన |

విశేషణవాచక ప్రాతిపదికములను స్త్రీలింగములో ప్రయోగింపవలెనన్నచో వానికి ఒకానొక ప్రత్యయమును చేర్చినచో అవి స్త్రీలింగ ప్రాతిపదికములుగ మారును అట్టి ప్రత్యయములను స్త్రీ ప్రత్యయములందురు. ఆ, ఈ, ఊ, తి - అనునవి స్త్రీ ప్రత్యయములు

అందు సామాన్యముగ అకారాంత శబ్దములకు 'ఆ అను స్త్రీ ప్రత్యయముచేరును ఉదా. అధిక + ఆ = అధికా, అల్ప + ఆ = అల్పా

లోపాముద్రా అగస్త్యస్య భార్యా
గంగా చ యమునా చ ప్రయాగే సంగచ్ఛేతే
'అర్థో హి కన్యా పరకీయ ఏవ
చకోరాః చన్ద్రికాం పిబన్తి
'వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే
'ఉద్యమేన హి సిధ్యన్తి కార్యాణి న మనోరథైః
నహి సుప్తస్య సింహస్య ప్రవిశన్తి ముఖే మృగాః'
ఉద్యానే నృపతేః కన్యాః క్రీడన్తి
ఆత్మీయాన్ పుత్రానివ నృపతిః ప్రజాస్త్స్నియతే
పుష్పాణి గుమ్ఫిత్వా శీర్షే ధరన్తే లలనాః
ఉపవనే క్రీడితుం కన్యే అగచ్ఛతామ్
రామో జనకస్య కన్యాం పర్యణయత్

## తృతీయా చతుర్థీ, పంచమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (తృ వి) | లతయా | లతాభ్యామ్ | లతాభిః |
| (చ వి) | లతాయై | | లతాభ్యః |
| (పం వి) | లతాయాః | | |

వీనిలో ఆ భ్యామ్ భిస్ (భిః) అనునవి తృతీయావిభక్తి సుప్ ప్రత్యయములు ఎ భ్యామ్ భ్యస్ (భ్యః) అనునవి చతుర్థీ విభక్తి సుప్ ప్రత్యయములు అస్ భ్యామ్, భ్యస్ (భ్యః) అనునవి పంచమీ విభక్తి సుప్ ప్రత్యయములు

సూ - 06 ఆజి చాపః (పా సూ) = ఆ, ఓస్ అను ప్రత్యయములు పరమగునపుడు ఆకారాంత స్త్రీలింగ శబ్దముల ఆకారమునకు ఏకారాదేశమగును

ఉదా - లతా + ఆ = లతే + ఆ = లతయా (సూ-12)

సూ - 07 యాడాపః (పా సూ) = ఆకారాంత స్త్రీలింగ శబ్దములకంటె పరమయిన చతుర్థీ పంచమీ షష్ఠీ సప్తమీ విభక్తుల ఏకవచన ప్రత్యయములకు ముందు 'యా' అనునది ఆగమముగా చేరును ఉదా - లతా + ఏ = లతా + యా + ఏ = లతాయై (సూ-2 ) లతా + అస్ = లతా + యా + అస్ = లతాయాః (సూ-22, 20)

**స్త్రీలింగము**

వాచా = మాట
మాలా = మాలిక, దండ
క్రీడా = ఆట
దేవతాః = దేవతలు
పూజా = పూజ

**పుంలింగము**

లాభః = లాభము
ఉత్సాహః = ఉత్సాహము
కలహః = కలహము
అనురాగః = అనురాగము

**స్త్రీలింగము -**

ప్రభా = కాన్తి
పాఠశాలా = పాఠశాల బడి
కథా = కథ
చిన్తా = విచారము
ప్రభా = కాంతి

**నపుంసకలింగము -**

స్వాస్థ్యమ్ = శాంతి

**అవ్యయములు -**

ఆ+చర్+తుమ్= ఆచరితుమ్ } =ఆచరించుటకు
ఆ+నీ+తుమ్= ఆనేతుమ్ } = తెచ్చుటకు
కృ + తుమ్ = కర్తుమ్ } = చేయుటకు

విద్యయా సమో బన్ధుర్నవర్తతే
మిత్రం వాదాభి రామ్ అనాస్త్వయత్
మాలాః గుమ్ఫిత్వా కన్యాభ్యోఽయచ్ఛత్
కన్యాః క్రీడాభిర్జనకం ప్రీణయన్తి
దేవతాభ్యోబలిం యచ్ఛన్తి మానవాః
చన్ద్రికయా భూష్యతే ఆకాశః
దేవస్యపూజామ్ ఆచరితుమ్ కుసుమాన్యవయమ్
దేవస్య పూజాయాశ్చిత్తస్య స్వాస్థ్యం లభ్యతే
పూజాయై పుష్పాణ్యానేతుమ్ ఉపవన మగచ్ఛామ
నరాదేవతాభ్యః సుఖస్య లాభం వాఞ్ఛన్తి
మణీనాం ప్రభాభిర్నృపాణాం ప్రాసాదా విరాజన్తే
బాలికా భోజనం కర్తుమ్ పాఠశాలయా ఆగచ్ఛన్తి
ప్రజాభ్యః స్వస్తి
వీరాణాం కథాభ్యో బాలేషూత్సాహో వర్ధతే
కలహ ఇవానురాగోఽపివాచాయా ఏవోద్భవతి
చిన్తాయాః శరీరం కృశ్యతి

## షష్ఠీ, సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ష వి) | లతాయాః | లతయోః | లతానామ్ |
| (స వి) | లతాయామ్ | ,, | లతాసు |

వీనిలో అస్ ఓస్, నామ్ - అనునవి షష్ఠీ విభక్తి ప్రత్యయములు అమ్ ఓస్ సు - అనునవి సప్తమీవిభక్తి ప్రత్యయములు

లతా + ఓస్ = లతే + ఓస = లతయోః (సూ- 2 20)

లతా + అమ్ = లతా + యా + అమ్ (సూ-107) = లతాయామ్ (సూ-22)

స్త్రీలింగము -

మిథిలా = మిథిలానగరము
రథ్యా = రాజమార్గము
ఛాయా = నీడ
కలా = కళ
లంకా = లంకానగరము
గంగా = గంగానది
త్రపా = సిగ్గు
అఙ్గనా = స్త్రీ
నిశా = రాత్రి
జరా = ముసలితనము
తృష్ణా = కోరిక, ఆశ

పుంలింగము -

నిశాచరః = రాక్షసుడు

విశేషణములు -

శ్రమ్ + త = శ్రాన్త = అలసిన
పావన = పవిత్రమైన

లతానాం పుష్పాణి సురభీణి భవన్తి
మిథిలాయాః నృపో జనకః
భార్యాయాః పితా శ్వశురః

విద్యాయాం ప్రజ్ఞానామాదరోఽధికః
రథ్యాయాం రథాస్సంచరన్తి
శ్రాన్తాః పథికా వృక్షస్య ఛాయాయామ్ ఉపావిశన్
చన్ద్రః కలానాం నిధిః అతః కలానిధిరితి కథ్యతే
అలకాయాం కుబేరో వసతి
గంగాయా జలం పావనమ్ ఇతి మన్యతే
త్రపాఙ్గనాయాః పరమం విభూషణమ్
నిశాయాం చరన్తి నిశాచరాః
జరాయామపి నరాణాం తృష్ణా నశామ్యతి

10 ఈకారాంత స్త్రీలింగశబ్దము —

ప్రథమా ద్వితీయా విభక్తులు

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | నదీ | నద్యౌ | నద్యః |
| (సం ప్ర) | (హే) నది | , | , |
| (ద్వి వి) | నదీమ్ | ,, | నదీః |

వీనిలో నదీ' అనునది ప్రాతిపదికము. స్, ఔ, అస్ - అనునవి ప్రథమావిభక్తి ప్రత్యయములు మ్, ఔ, స్ - అనునవి ద్వితీయావిభక్తి ప్రత్యయములు

నదీ + స్ = నదీ (సూ- 03) నదీ + ఔ = నద్యౌ (సూ-67). నదీ+అస్=నద్యః (సూ-67 0) (హే) నదీ+స్ = (హే) నది + స్ (సూ- 05) = (హే) నది (సూ-23).

| స్త్రీలింగము - | పుంలింగము - |
|---|---|
| జననీ = తల్లి | భవః |
| వాపీ = దిగుడుబావి | మృడః } = శివుడు |
| తారా = నక్షత్రము | శర్వః |

**స్త్రీలింగము -**

రజనీ = రాత్రి

నారీ = స్త్రీ

మహీ = భూమి

**పుంలింగము -**

మాతులః = మేనమామ

ప్రారంభః = ప్రారంభము

సంక్రమః = వంతెన

**విశేషణములు -**

ప్ర + స్థా + త = ప్రస్థిత } = బయలుదేరిన

**అవ్యయములు -**

ఆ+హృ+తుమ్ =ఆహర్తుమ్ } = తెచ్చుటకు

గమ్+తుమ్= గన్తుమ్ } = వెళ్ళుటకు

ఇన్ద్రస్య పత్నీ ఇన్ద్రాణీ వరుణస్య పత్నీ వరుణానీ

కౌసల్యా కైకేయీ సుమిత్రా చ దశరథస్య పత్న్యః

యదా రామో సీతయా లక్ష్మణేన చ సహ వనం గన్తుం
ప్రస్థితోఽభవత్ తదా జనన్యో అశోచతామ్

శర్వస్య పత్నీ శర్వాణీ రుద్రస్య పత్నీ రుద్రాణీ మృడస్య
పత్నీ మృడానీ భవస్య పత్నీ భవానీ

నాటకస్య ప్రారంభే సూత్రధారో నటీమ్ ఆహ్వయతి

నార్యో జలమ్ ఆహర్తుం వాపీమ్ అగచ్ఛన్

వశిష్ఠస్య పత్నీ అరున్ధతీ , తాం జానకీ వనే అనమత్

జనకస్య పుత్రీ జానకీ తాం దాశరథిః పర్యణయత్

పర్వతేభ్యో నద్య ఉద్భవన్తి

చన్ద్రేణ తారాభిశ్చ రజనీ శోభతే

మాతులస్య పత్నీ మాతులానీ ఆచార్యస్యపత్నీ ఆచార్యానీ

మహీం పాలయన్తి మహీపాలాః

సంక్రమేణ నదీం తరన్తి జనాః

## తృతీయా చతుర్థీ పంచమీా విభక్తులు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (తృ వి) | నద్యా | నదీభ్యామ్ | నదీభిః |
| (చ వి) | నద్యై | ,, | నదీభ్యః |
| (పం వి) | నద్యాః | ,, | ,, |

వీనిలో ఆ భ్యామ్, భిస్ (భిః) - అనునవి తృతీయావిభక్తి ప్రత్యయములు ఏ, భ్యామ్ భ్యస్ (భ్యః) - అనునవి చతుర్థీవిభక్తి ప్రత్యయములు అస్ భ్యామ్ భ్యస్ (భ్యః) - అనునవి పంచమీవిభక్తి ప్రత్యయములు నదీ + ఆ = నద్యా (సూ-67)

సూ - 08 ఆణ్నద్యాః (పా సూ) = ఈకారాంత ఊకారాంత స్త్రీలింగ శబ్దములకంటె పరమయిన చతుర్థీ పంచమీ షష్ఠీ (సప్తమీ) విభక్తుల ఏకవచన ప్రత్యయములకు ముందు ఆకరము అగమముగా చేరును

నదీ + ఏ = నదీ + ఆ + ఏ = నదీ + ఐ (సూ-2 )=నద్యై (సూ-69)

నదీ + అస్ = నదీ + అ + అస్ = నదీ + అస్ (సూ-2) = నద్యాః (సూ-67, 20)

స్త్రీలింగము -

పుత్రీ = కూతురు

మహిషీ = (పట్టపు) రాణి

దాసీ = దాసి

సఖీ = చెలికత్తె, స్నేహితురాలు

నగరీ, పురీ = పట్టణము

సహచరీ = స్నేహితురాలు, భార్య

నపుంసకలింగము -

గీతమ్ = పాట

జాలమ్ = వల

పుంలింగము:-

కపోతః = పావురము

దూతః = దూత

స్త్రీలింగము -

పత్నీ = భార్య
కౌశామ్బీ = కౌశాంబీనగరము
గృహిణీ = ఇల్లాలు
పఞ్చవటీ=పంచవటియను ప్రదేశము
ఆజ్ఞా = ఆజ్ఞ

విర్ + గమ్ = వెడలిపోవుట
ప్రతి + ఆ + గమ్ = తిరిగివచ్చుట
ఉద్+ డీ = పైకి ఎగురుట

అవ్యయములు -

ఆ+దా+య= ఆదాయ } = తీసికొని
త్యజ్+త్వా= త్యక్త్వా } = విడచి

లట్ - లఙ్

విర్గచ్ఛతి - విరగచ్ఛత్
ప్రత్యాగచ్ఛతి - ప్రత్యాగచ్ఛత్
ఉడ్డయతే - ఉదడయత

ధీరా మహ్యాః స్వర్గం గచ్ఛన్తి
జననీ పుత్రీభి సహ ఆపణ మగచ్ఛత్
మహిషీ దాసీభ్యామ్ అక్రుధ్యత్
సీతాయాః సఖ్యై గీతా న్యరోచన్త
సేనాపతే రాజ్ఞయా సైనికా నగర్యాః సమరాఙ్గణమ్ అవ్రజన్
శకున్తలా సహచరీభ్యామ్ అన్వగమ్యత
జాలమ్ ఆదాయ కపోతా మహ్యా ఆకాశే ఉదడయన్త
వాపీభ్యో నార్యో జలమ్ ఆనయన్
పంచవట్యాః రామో లక్ష్మణేన సహ విరగచ్ఛత్
కదాత్వమ్ అవన్తీమ్ అగచ్ఛఇతి మహిష్యా దాస్యఅపృచ్ఛ్యత
రామస్య పత్న్యై ఫలా న్యరోచన్త
కౌశామ్బ్యా దూతః ప్రత్యాగచ్ఛ దితి సచివో నృపమ్ అవదత్
యతో రామః పితురాజ్ఞయా పుర్యా వన మగచ్ఛత్ తతో
లక్ష్మణః సీతా చ పురీం త్యక్త్వా తమన్వగచ్ఛతామ్

నరః పత్న్యై పుష్పాణ్యానయత్
గృహిణ్యా గృహే అన్నమ్ అపచ్యత
నృపస్య పత్న్యై దాస్యై పారితోషికమ్ అదీయత

షష్ఠీ సప్తమీ విభక్తులు

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ష వి) | నద్యాః | నద్యోః | నదీనామ్ |
| (స వి) | నద్యామ్ | ,, | నదీషు |

వీనిలో అస్, ఓస్ నామ్ — అనునవి షష్ఠీ విభక్తి సుప్ ప్రత్యయములు అమ్, ఓస్, సు — అనునవి సప్తమీ విభక్తి సుప్ ప్రత్యయములు

నదీ + అస్ = నదీ + ఆ + అస్ (సూ 108) = నదీ + అస్ (సూ 22) = నద్యాః (సూ 67, 20)
నదీ + ఓస్ = నద్యోః (సూ 67 20) నదీ + అమ్ = నద్యామ్ (సూ 67)
నదీ + సు = నదీషు (సూ 44)

స్త్రీలింగము -

ఇన్ద్రాణీ = ఇంద్రునిభార్య
గోదావరీ = గోదావరీనది
కౌముది = వెన్నెల
వాణీ = మాట
వారణాసీ = వారణాసీనగరము
శ్రద్ధా = శ్రద్ధ
ప్రమదా = స్త్రీ

విశేషణములు -

ని+స్నా+త= నిష్ణాత = నేర్పరియైన

జయన్త ఇన్ద్రాణ్యాః పుత్రః
జనన్యా హృదయమ్ అపత్యేషు స్నిహ్యతి
మహిష్యా వచనేషు దాసీనామ్ అధికా శ్రద్ధా వర్తతే

గ్రీష్మే వాపీషు నృపతయః పత్నీభిః సహ స్నాయన్తి తత్ర క్రీడన్తి చ
బుధానాం వాణ్యాం మాధుర్యం విద్యతే
నదీనాం జలం మధురమ్ భవతి
గోదావర్యా జలైః క్షేత్రేషు సస్యాని రోహన్తి
కౌముద్యాం విహరన్తి ప్రమదాః
మహిషీణాం వచన మనుతిష్ఠన్తి దాస్యః
రజన్యామ్ ఆకాశే తారాశ్చన్ద్రశ్చ ద్యోతన్తే
శకున్తలాయాః సఖ్యోః పరమః స్నేహః
శాస్త్రేషు నిష్ణాతాః పణ్డితా బహవో వారాణస్యామ్ అవసన్

11 ఊకారాంత స్త్రీలింగశబ్దములు —

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | వధూః | వధ్వౌ | వధ్వః |
| (సం ప్ర) | (హే) వధు | | ,, |
| (ద్వి వి) | వధూమ్ | , | వధూః |
| (తృ వి) | వధ్వా | వధూభ్యామ్ | వధూభిః |
| (చ వి) | వధ్వై | | వధూభ్యః |
| (పం వి) | వధ్వాః | , | |
| (ష వి) | , | వధ్వోః | వధూనామ్ |
| (స వి) | వధ్వామ్ | , | వధూషు |

ఈకారాంత స్త్రీలింగశబ్దములకు ఊకారాంత స్త్రీలింగ శబ్దములకును చేరు విభక్తి ప్రత్యయములు ఏకరూపముగనే యుండును ఆ ప్రత్యయములు పరమగునపుడు ఆ రెండు శబ్దములలో కలుగు వ్యాకరణ కార్యములుకూడ సమానమే ఈకారాంత శబ్దముల

ఈకారమునకు హ్రస్వము ఇకారముకాగా ఊకారాంత శబ్దముల ఊకారమునకు హ్రస్వము ఉకారమగును. ఈకారమునకు యణాదేశము యకారముకాగా ఉకారమునకు యణాదేశము వకారమగును ఈవిధముగా ఊకారాంత స్త్రీలింగ శబ్దరూపములు ఊహింపదగును కాని ఊకారాంత స్త్రీలింగ శబ్దముల ప్రథమైక వచన ప్రత్యయమునకు లోపమురాదు ఇదే యొక్కటే ఆ రెండు శబ్దములకుగల భేదము

| స్త్రీలింగము | పుంలింగము |
|---|---|
| వధూః=స్త్రీ భార్య కోడలు | ఉద్వాహః = వివాహము |
| శ్వశ్రూః = అత్తగారు | గజః = ఏనుగు |
| సరయూః = సరయూనది | తురగః = అశ్వము |
| చమూః = సేన | |
| కణ్డూః = దురద తీట | **అవ్యయము** - |
| స్నుషా = కోడలు | అప+నీ+తుమ్ =అపనేతుమ్ } పోగొట్టుకొనుటకు |
| జానకీ = సీత | |
| మిధిలా = మిధిలానగరము | |

నపుంసకలింగము -

ఘృష్ + అన = ఘర్షణమ్ = ఒరపిడి, రాపిడి

శ్వశురస్య పత్నీ శ్వశ్రూః
జానకీ శ్వశ్రూ రక్షన్తి
స్నుషాః శ్వశ్ర్వా వచన మనుతిష్ఠన్తి
స్నుషాభిః శ్వశ్ర్వోః వస్త్ర న్తే
చమూనాం నేతా చమూః సమరాఙ్గణ మనయత్
చమ్వా అధిపతి శ్చమూపతిః

చమూషు రథాః గజాః తురగాః పదాతయశ్చ వర్తన్తే
దిలీపో వధ్వాసహ వశిష్ఠస్యాశ్రమ మగచ్ఛత్
దశరథస్య వధ్వః పుత్రాణా ముద్వాహేభ్యో మిథిలా మగచ్ఛన్
పాణ్డవా బహూని దినాని వధ్వాసహ వనే వ్యవసన్
నృపాణాం వధ్వః దాస్యో సేవన్తే
వనే గజాః శరీరాణాం కణ్డూమ్ వృక్షైః సహ ఘర్షణేన అపనయన్తి
సరయ్వాస్తీరే అయోధ్యావర్తతే

## అభ్యాసము 8

| ఆకారాంత స్త్రీలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు | | | ఈకారాంత ఊకారాంత స్త్రీలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు | | |
|---|---|---|---|---|---|
| (ఏక) | (ద్వి) | (బహు) | (ఏక) | (ద్వి) | (బహు) |
| స్ | ఈ | అస్ | స్ | ఔ | అస్ |
| మ్ | ,, | స్ | మ్ | | స్ |
| ఆ | భ్యామ్ | భిస్ | ఆ | భ్యామ్ | భిస్ |
| ఏ | ,, | భ్యస్ | ఏ | ,, | భ్యస్ |
| అస్ | | ,, | అస్ | | |
| ,, | ఓస్ | నామ్ | ,, | ఓస్ | నామ్ |
| ఆమ్ | ,, | సు | ఆమ్ | ,, | సు |

ప్రాతిపదికము లెన్నిరకములు గలవో సోదాహరణముగ వివరింపుము.
కృత్ప్రత్యయములనగా నేమి? సోదాహరణముగ వివరింపుము.

చమూషు రథాః గజాః తురగాః పదాతయశ్చ వర్తన్తే
దిలీపో వధ్వాసహ వశిష్ఠస్యాశ్రమ మగచ్ఛత్
దశరథస్య వధ్వః పుత్త్రాణా ముద్వాహేభ్యో మిథిలా మగచ్ఛన్
పాణ్డవా బహూని దినాని వధ్వాసహ వనే వ్యవసన్
నృపాణాం వధూః దాస్యో సేవన్తే
వనే గజాః శరీరాణాం కణ్డూమ్ వృక్షైః సహ ఘర్షణేన అపనయన్తి
సరయ్వాస్తీరే అయోధ్యావర్తతే.

## అభ్యాసము 8

| ఆకారాంత స్త్రీలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు | | | ఈకారాంత ఊకారాంత స్త్రీలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు | | |
|---|---|---|---|---|---|
| (ఏక) | (ద్వి) | (బహు.) | (ఏక.) | (ద్వి.) | (బహు.) |
| స్ | ఈ | అస్ | స్ | ఔ | అస్ |
| మ్ | ,, | స్ | మ్ | ,, | స్ |
| ఆ | భ్యామ్ | భిస్ | ఆ | భ్యామ్ | భిస్ |
| ఏ | ,, | భ్యస్ | ఏ | ,, | భ్యస్ |
| అస్ | ,, | ,, | అస్ | ,, | ,, |
| ,, | ఓస్ | నామ్ | ,, | ఓస్ | నామ్ |
| ఆమ్ | ,, | సు | ఆమ్ | ,, | సు. |

ప్రాతిపదికము లెన్నిరకములు గలవో సోదాహరణముగ వివరించునది.

కృత్ప్రత్యయములనగా నేమి ? సోదాహరణముగ వివరించునది.

క్రింది పాణిని సూత్రములను సోదాహరణముగ వివరించుము.

1 అర్థవదధాతు ర ప్రత్యయః ప్రాతిపదికమ్ 2. కృత్తద్ధిత సమాసాశ్చ. 3 కృదతిఙ్ 4 సమానకర్తృకయోః పూర్వకాలే. 5. సమ్పూర్వాచ. 6 అజిచావః. 7 యాడాపః 8 అణ్ణద్యాః

నదీశబ్దమునకు లక్ష్మీ శబ్దమునకు ఏ విభక్తిలో రూపభేదముండునో వివరించుము.

నదీశబ్దరూపములకు, వధూ శబ్దరూపములకుగల సామ్యభేదములను వివరించుము.

లతాశబ్దమునకు అమ్బాశబ్దమునకును ఏ విభక్తిలో రూపభేదముండునో వివరించుము

క్రింది వాక్యములను సంస్కృతీకరించుము —

లోకమువందు శాస్త్రములందు నిష్ణాతులైన ప్రజలు చాలామంది కలరు

మంచినృపులు ప్రజలను తమ (సంబంధమైన) పుత్రులనువలె సాకుదురు.

ప్రజలయొక్క ఉద్యమములచే లోకమువందు కళలు వర్ధిల్లినవి

ఉపవనమునందు నృపతియొక్క కన్యలిద్దరు ఆడుకొనిరి

స్త్రీలు నదులనుండి నీటిని తెచ్చిరి

వారణాసియందు గంగానది ప్రవహించుచున్నది

గంగయందు చాలమంది జనులు అన్నిదినములయందు స్నానము చేయుదురు

జనకుని పుత్రియైన రాముని పత్నియైన సీతను రావణుడు అపహరించెను

రాముడు జానకితోడ లక్ష్మణునితోడను చాలదినములు గోదావరియొక్క తీరమునందలి పంచవటియందు నివసించెను

ఆవని ఉమా_ర్తైలకొఱకు నగరిమండి చాలవస్తువులను తెచ్చెను.

దిగుడుబావియొక్క జలమునందు కమలములు పెరుగుచున్నవి

పక్షులు కుసుమములయొక్క మాలికలను కూర్చి, వానితో మహిషిని భూషించిరి.

దాసీలు మహిషియొక్క ఆజ్ఞను ఆచరించుటకొఱకు వెడలిపోయిరి

నృపతియొక్క కన్యలు వెన్నెలయందు ఆడుకొనుటకు ఉద్యానమును ప్రవేశించిరి

దేవతలయొక్క పూజలయందు స్త్రీలు గీతములను పాడుదురు

క్రిందివాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది :—

ద్రుపదస్య పుత్రీ పాండవానాం జననీం అవన్దత

శకు_న్తలా సఖీభ్యా మన్వగమ్యత

దిలీపస్య పత్నీ పు_త్రమ్ అసూయత

దిలీపః ఆత్మీయాన్ పుత్రానివ ప్రజాః అత_న్త్రియత

పక్ష్యః కుసుమానాం మాలా అగుమ్ఫన్

వృద్ధాః బాలాన్ కథాభిః ప్రీణయ_న్తి

వరాదేవతాభ్యః కామానాం లాభాన్ వాఞ్ఛ_న్తి

దేవస్య పూజాయై కుసుమాన్యానయన్ నార్యః

జరయా శరీరం క్షీయతే

హరిర్వ్యాధాభి ర్మిత్రం సా_న్త్వయతి.



## 12 ఇకారాంత స్త్రీలింగ శబ్దములు :—

ఇకారాంత స్త్రీలింగ శబ్దములకు తృతీయైకవచనమునందు 'అ' అను ప్రత్యయము చేరును.

ఉదా - మతి + అ = మత్యా (సూ-67).

ద్వితీయా బహువచనమునందు 'స్' అను ప్రత్యయముచేరును. అది పరమగునపుడు ఇకారమునకు దీర్ఘమువచ్చును.

ఉదా - మతి + స్ = మతీః (సూ-20)

సప్తమీ ఏకవచనమునందు అమ్, ఔ అను రెండు ప్రత్యయములను చేరును - ఉదా - మతి + అమ్ = మత్యామ్ (సూ-67) లేక మతి + ఔ = మతౌ (సూ-68)

తక్కిన విభక్తులలో ఇకారాంత పుంలింగ శబ్దమునకు (కవి శబ్దమునకు) వలె రూపము లేర్పడును

## 13 ఉకారాంత స్త్రీలింగ శబ్దములు —

ఉకారాంత స్త్రీలింగ శబ్దములకు గూడ తృతీయైకవచనమునందు 'అ అను ప్రత్యయము, ద్వితీయా బహువచనమునందు 'స్' అను ప్రత్యయమును, సప్తమీ ఏకవచనమునందు 'అమ్' 'ఔ' అను రెండు ప్రత్యయములను చేరును 'స్' అను ద్వితీయా బహువచన ప్రత్యయము పరమగునపుడు ఉకారమునకు దీర్ఘము వచ్చును

ఉదా.- ధేను + అ = ధేన్వా (సూ-67). ధేను + స్ = ధేనూః (సూ-20); ధేను + అమ్ = ధేన్వామ్ (సూ-67) లేక ధేను + ఔ=ధేనౌ (సూ-68)

తక్కిన విభక్తులలో ఉకారాంత పుంలింగశబ్దమునకు (గురు శబ్దమునకు) వలె రూపము లేర్పడును

చతుర్థీ, పంచమీ, షష్ఠీ విభక్తుల యేకవచనములందు ఇకారాంత స్త్రీలింగ శబ్దములకు ఈకారాంత స్త్రీలింగ శబ్దమునకు (నదీ శబ్దమునకు) వలెను, ఉకారాంత స్త్రీలింగశబ్దమునకు ఊకారాంత స్త్రీలింగ శబ్దమునకు (వధూశబ్దమునకు) వలెను కూడ రూపము లేర్పడును అనగా 'ఆణ్నద్యాః' (సూ-108) అను సూత్రముచే కలుగు ఆకారము ఇకారాంత ఉకారాంత స్త్రీలింగశబ్దములకంటె పరమగు చతుర్థీ పంచమీ, షష్ఠీ విభక్తుల ఏకవచన ప్రత్యయములకు ముందు వికల్పముగా వచ్చును. అది రాని పక్షములో 'ఘేర్ఙితి' (సూ-88) అను సూత్రముచే ఇకార ఉకారములకు గుణము వచ్చునని భావము.

ఇకారాంత స్త్రీలింగము — మతిశబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | మతిః | మతీ | మతయః |
| (సం ప్ర) | (హే) మతే | ,, | ,, |
| (ద్వి వి) | మతిమ్ | ,, | మతీః |
| (తృ వి) | మత్యా | మతిభ్యామ్ | మతిభిః |
| (చ వి) | మత్యై<br>మతయే | ,, | మతిభ్యః |
| (పం వి) | మత్యాః<br>మతేః | ,, | ,, |
| (ష వి) | ,, | మత్యోః | మతీనామ్ |
| (స వి) | మత్యామ్<br>మతౌ | ,, | మతిషు |

### ఉకారాంత పుంలింగము - ధేనుశబ్దము

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | ధేనుః | ధేనూ | ధేనవః |
| (సం ప్ర) | (హే) ధేనో | ,, | ,, |
| (ద్వి వి) | ధేనుమ్ | ,, | ధేనూః |
| (తృ. వి) | ధేన్వా | ధేనుభ్యామ్ | ధేనుభిః |
| (చ వి) | ధేన్వై<br>ధేనవే | ,, | ధేనుభ్యః |
| (పం వి) | ధేన్వాః<br>ధేనోః | ,, | , |
| (ష వి) | ,, | ధేన్వోః | ధేనూనామ్ |
| (స వి) | ధేన్వామ్<br>ధేనౌ | ,, | ధేనుషు |

### 4 ఋకారాంత స్త్రీలింగ శబ్దములు

స్వసృ, మాతృ, దుహితృ, యాతృ, ననాన్దృ - అనునవి ఐదు మాత్రమే ఋకారాంత స్త్రీలింగశబ్దములు కలవు ఈ శబ్దములన్నిటికిని ద్వితీయా బహువచనమునందు 'స్' అను సుప్ ప్రత్యయము చేరును. ఆ ప్రత్యయము పరమగునపుడు ఋకారమునకు దీర్ఘము వచ్చును

ఉదా - స్వసృ+స్=స్వసౄః మాతృ + స్ = మాతౄః తక్కిన చోట్ల స్వసృ శబ్దమునకు నేతృశబ్దమునకువలె మాతృ, దుహితృ, యాతృ, ననాన్దృశబ్దములకు పితృశబ్దమునకువలెను రూపము లేర్పడును.

### ఋకారాంత స్త్రీలింగము — స్వసృశబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | స్వసా | స్వసారౌ | స్వసారః |
| (సం. ప్ర) | (హే) స్వసః | ,, | ,, |
| (ద్వి. వి) | స్వసారం | ,, | స్వసౄః |

తృతీయాది విభక్తులలో ఋకారాంత పుంలింగశబ్దములకువలె రూపముల నూహించునది

### ఋకారాంత స్త్రీలింగము — మాతృశబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | మాతా | మాతరౌ | మాతరః |
| (సం ప్ర) | (హే) మాతః | ,, | ,, |
| (ద్వి వి) | మాతరమ్ | , | మాతౄః |

తృతీయాది విభక్తులలో ఋకారాంత పుంలింగ శబ్దములకువలె రూపము లూహించునది.

విశేషణ వాచకములగు నేతృ మున్నగు శబ్దములకు 'ఈ' అను స్త్రీ ప్రత్యయమును చేర్చుటచే స్త్రీలింగ రూపము లేర్పడును కావున ఆ శబ్దములన్నింటికి నదీశబ్దమునకువలెనే విభక్త్యంత రూపములు నిష్పన్నమగును

ఉదా - నేతృ + ఈ = నేత్రీ (సూ-67), కర్తృ + ఈ = కర్త్రీ (సూ-67)

స్త్రీలింగము:-

మూర్తిః=విగ్రహము ఆకారము
అనురక్తిః = అనురాగము
కీర్తిః = కీర్తి
కాన్తిః = కాంతి
ప్రీతిః = ఇష్టము, సంతోషము
ముక్తిః = మోక్షము
భ్రాన్తిః = భ్రమ
ప్రకృతిః = స్వభావము, ప్రజ
బుద్ధిః } = బుద్ధి, ఆలోచన,
మతిః } అభిప్రాయము
శ్రుతిః = వేదము
స్మృతిః = స్మృతిగ్రంథము
రతిః = రతిదేవి, ఆనందము
నీతిః = నీతి
భూమిః = భూమి
సుకృతిః = మంచిపని
దుష్కృతిః = చెడ్డపని
వసతిః = నివాసము
కృతిః = పని
సన్తతిః = సంతానము
ప్రతికృతిః = చిత్తరువు ప్రతిక్రియ
వ్యక్తిః = వ్యక్తి
శక్తిః = శక్తి

స్తుతిః = స్తోత్రము
సృష్టిః = సృష్టి
ధేనుః = ఆవు
రజ్జుః = త్రాడు
కాకుః = కాకుస్వరము
తనుః = శరీరము
లఙ్కా = లంకానగరము
అయోధ్యా = అయోధ్యానగరము
మృగయా = వేట
నిన్దా = నింద
వర్షాః (నిత్యబహు) = వర్షాకాలము
మాతా = తల్లి
దుహితా = కూతురు
యాతా = తోటికోడలు
ననాన్దా = ఆడపడుచు
స్వసా = చెల్లెలు, సోదరి

పుంలింగము:-

సర్పః = పాము
ప్రకర్షః = ఆధిక్యము
సునృపతిః = మంచిరాజు
కునృపతిః = చెడ్డరాజు
వరః = వరుడు

**విశేషణములు –**

దా + తృ = దాతృ = ఇచ్చునట్టి
(దాతా = దాత)
భృ + తృ = భర్తృ = భరించునట్టి
(భర్తా = యజమాని, భర్త)
కృ + తృ = కర్తృ = చేయునట్టి
(కర్తా = చేయువాడు)
వి+ధా+తృ=విధాతృ=చేయునట్టి
(విధాతా = బ్రహ్మ)
రక్ష్+తృ=రక్షితృ=రక్షించునట్టి
(రక్షితా – రక్షించువాడు)
సమ్+హృ+తృ = సంహర్తృ = సంహరించునట్టి
(సంహర్తా=సంహరించువాడు)
చల = చంచలమైన

**అవ్యయములు –**

దృశ్ + తుమ్ = ద్రష్టుమ్ = చూచుటకు
దృశ్ + త్వా = దృష్ట్వా = చూచి
హన్ + త్వా = హత్వా = చంపి
ప్రతి+ని+వృత్+య = ప్రతినివృత్య = మరలి
ఆ+గమ్+య = ఆగత్య = వచ్చి
ప్ర+నమ్+య = ప్రణమ్య = నమస్కరించి

దేవతానాం మూర్తీః ప్రజాః పూజయన్తి
మాతౄణాం శిశుష్వనురక్తి రధికా భవతి
దాతౄణాం కీర్తిర్లోకే సర్వత్ర ప్రసరతి
భర్తురస్య కాన్త్యా జనానా మాహ్లాదో జాయతే
రామో రావణం హత్వా, లఙ్కాయాః ప్రతినివృత్య, అయోధ్యామ్ ఆగత్య, తత్ర మాతౄః ప్రణమ్య, ప్రీత్యా భరతం శత్రుఘ్నం చ ఆశ్లిష్యత్
ధేన్వాః క్షీరం మధురం పథ్యం చ భవతి
రఘోః పితా దిలీపో వధ్వా సుదక్షిణయా సహ వశిష్ఠస్య ధేనుమ్ అసేవత

ముక్తయే హరిం భజన్తే యతయః
భ్రాన్త్యా రజ్జుం సర్పం మన్యన్తే
ప్రకృత్యా లక్ష్మీ శ్చపలా భవతి
బుద్ధేః ప్రకర్షా త్కీర్తి ర్జాయతే
యాత్యాః నవాన్దరం చ ప్రీత్యాఽవదత్ పితా
అర్జునః శ్రీకృష్ణస్య స్వసారం సుభద్రాం పర్యణయత్
శ్రుతే రేవార్థం స్మృతయో వదన్తి
రతే ర్భర్తా మన్మథః
దుష్టాయా నీతేర్నృపతి ర్వినశ్యతి
కాక్వా వాక్యస్యార్థో విపరిణమతి
ద్రుపదో దుహితరం పాణ్డవేభ్యోఽయచ్ఛత్
వర్షాసు భూమిం కృష్ట్వా బీజాని వపన్తి కృషీవలాః
సుకృతినాం దుష్కృతినాం చ ఫల మనుభూయతే నరైః
మృగయాయై వనంగతో దుష్యన్తః కణ్వస్య వసతి మగచ్ఛత్
దేవే అనురక్తి రేవ భక్తి రితి వ్యవహ్రియతే
మూర్ఖాణాం స్తుతిర్నిన్దా వా న గణయన్తి బుధాః
సృష్టేః కర్తా విధాతా, రక్షితా విష్ణుః సంహర్తా శివః
కాలేన వశో న్తమర్వ్వర్ధతే బుద్ధిస్తు న వర్ధతే.
పరస్యతు తమర్బుద్ధిశ్చ వర్ద్ధతే
ప్రకృతయో సునృపతిన్ భక్త్యా సేవన్తే ; కునృపతిన్ భయేన సేవన్తే
నరస్య కృతిభిరేవ ప్రకృతిమపి జ్ఞాతుం ప్రభవన్తి ప్రాజ్ఞాః
సన్తతే రభావేన నరాః ఖిన్నా భవన్తి
ఆదౌ వధ్వాః ప్రతికృతిం దృష్ట్వా, తతో వ్యక్తిం ద్రష్టుం గచ్ఛన్తి నరాః
సాధవో దుర్జనానాం ప్రతికృతిం కర్తుం న వాఞ్ఛన్తి

గృహకృత్యేషు సాహాయ్యస్య కర్త్రీం దుహితరమ్ అభినన్దన్తి
అన్నస్య దాత్రీ నారీ మాతేవ పూజ్యతే
దేవ్యాః పూజయిత్రీభిర్నారీభిః పుష్పాణ్యాదీయన్తే
పరిత్రీభ్యః కుమారీభ్యః పుస్తకాని దీయన్తే
శిశోః పాలయిత్రీ నారీ ధాత్రీ ఇతి కథ్యతే

### కృదంతములు - క్తిన్ ప్రత్యయాంతములు -

ధాతువునకు 'తి' అను దానిని చేర్చుటచే క్తిన్ ప్రత్యయాంత రూపము లేర్పడును క్తిన్ ప్రత్యయము సామాన్యముగా, భావార్థము నందు చేరును. కొన్నిచోట్ల ఇది విభక్త్యర్థములందుగూడ చేరును క్తిన్ ప్రత్యయాంత శబ్దములన్నియు స్త్రీలింగములు

ఉదా.- కృ + తి = కృతిః = చేయుట చేత . స్తు + తి = స్తుతిః = స్తుతించుట, స్తోత్రము . గమ్ + తి = గతిః = నడచుట, నడక ; సృజ్ + తి = సృష్టిః = సృజించుట సృష్టి

మరికొన్ని ఉభయపది ధాతువులు·—

| (మొదటిగణము) | (పరస్మై) (ఆత్మనే) |
|---|---|
| గుహ్ - సంవరణే = కప్పుట, మూయుట | గుహతి - గూహతే |
| భృ - భరణే = భరించుట మోయుట | భరతి - భరతే |
| శప్ - ఆక్రోశే = తిట్టుట, శపించుట | శపతి - శపతే |
| వే - తన్తుసన్తానే = (బట్టలు) నేయుట | వయతి - వయతే |
| సజ్జ్ - గతౌ = సిద్ధమగుట | సజ్జతి - సజ్జతే |
| లష్ - కాన్తౌ = కోరుట | లషతి - లషతే |

| (నాల్గవగణము) | (పరస్మై) (ఆత్మనే) |
|---|---|
| శప్ - ఆక్రోశే = తిట్టుట శపించుట | శప్యతి - శప్యతే |
| నహ్ - బంధనే = కట్టుట | నహ్యతి - నహ్యతే |
| లష్ - కాన్తౌ = కోరుట | లష్యతి - లష్యతే |
| (ఆరవ గణము) | |
| తుద్ - వ్యథనే = పొడుచుట బాధించుట | తుదతి - తుదతే |
| దిశ్ - అతిసర్జనే = ఇచ్చుట | దిశతి - దిశతే |
| లిమ్పు - ఉపదేహే = పైపూతపూయుట | లిమ్పతి - లిమ్పతే |
| భ్రజ్జ్ (భృజ్జ్) - పాకే = వండుట, వేపుట | భృజ్జతి - భృజ్జతే |
| (పదవగణము) | |
| మణ్డ్ - భూషాయామ్ = అలంకరించుట | మణ్డయతి - మణ్డయతే |
| మూల్ - రోహణే = పెరుగుట | మూలయతి - మూలయతే |
| కీర్త్ - సంశబ్దనే = కీర్తించుట | కీర్తయతి - కీర్తయతే |
| సూద్ - క్షరణే = స్రవించుట | సూదయతి - సూదయతే |
| దల్ / దౄ } విదారణే = చీల్చుట | { దాలయతి - దాలయతే / దారయతి - దారయతే |
| వర - ఈప్సాయామ్ = కోరుట | వరయతి - వరయతే |
| రూప-రూపక్రియాయామ్=రూపమును తయారుచేయుట చూపించుట } | రూపయతి - రూపయతే |

**స్త్రీలింగము -**

అమవాస్యా = అమావాస్యా
నిర్దోషతా = దోషములేకుండుట
రాత్రిః = రాత్రి

**నపుంసకలింగము -**

వి+జృమ్భ+అన =విజృమ్భణమ్ } =విజృంభించుట
నవనీతమ్ = వెన్న
ఉలూఖలమ్ = రోలు

| పుంలింగము :— | నపుంసకలింగము .— |
|---|---|
| ఉత్సవః = ఉత్సవము | అఞ్జనమ్ = కాటుక |
| తన్తువాయః = బట్టలు నేయువాడు | శాకమ్ = కూర |
| పరశుః = గండ్రగొడ్డలి | శ్రుతమ్ = చదువు |
| | విత్తమ్ = ధనము |

అవ్యయములు —

లభ్ + తుమ్ = లబ్ధుమ్ = పొందుటకు

గమ్ + తుమ్ = గన్తుమ్ = వెళ్ళుటకు

ప్ర + విశ్ + య = ప్రవిశ్య = ప్రవేశించి

విశేషణములు —

క్రుధ్ + త = క్రుద్ధ = కోపగించిన

వప్ + త = ఉప్త = నాటబడిన

స్థా + త = స్థిత = నిలబడిన, ఉన్న

క్రియాపదములు —

అభి + లష్ = కోరుట —

(లట్) అభిలషతి అభిలష్యతి ;

(లఙ్) అభ్యలషత్, అభ్యలష్యత్

ని + సూద్ = నిషూద్ = చంపుట —

(లట్) నిషూదయతి — నిషూదయతే ,

(లఙ్) న్యషూదయత్ — న్యషూదయత

అభి + నన్ద్ = అభినందించుట —

(లట్) అభినన్దతి · (లఙ్) అభ్యనన్దత్,

ఖలా ఆత్మీయా దుష్కృతీర్గూహన్తే

సుజనః కుటుమ్బం భరతి

క్రుద్ధామునయో ఖలాన్ శపన్తి

తన్తువాయాః వస్త్రాణి వయన్తి

శత్రోర్విజృమ్భణేన నృపతిః సంగ్రామాయ సజ్జతే

జామాతా శ్వశురాత్పారితోషికాన్ లబ్ధుమ్ అభిలషతే

నవనీతస్య చౌర్యేణ క్రుద్ధా మాతా కృష్ణమ్ రజ్జ్వా ఉలూఖలే అనహ్యత్

ఖలాః సర్వదా సాధూన్ శప్యన్తి

పుత్రః పిత్రాసహ నగరం గన్తుమ్ అభిలష్యతి

చోరా రాత్రౌ గృహం ప్రవిశ్య తత్రస్థితాన్ జనాన్ తుదన్తి ధనమ్ అపహరన్తి చ

దాతారో యాచకేభ్యో ధనం దిశన్తి

అమావాస్యాయాం రాత్రా వన్ధకారః సర్వత్రాఞ్జనం లిమ్పతీవ దృశ్యతే

మాతా గృహే శాకం భృజ్జతి, బాలకేభ్యో రోచతే తత్

ఉత్సవేషు నరాః శరీరాణి వస్త్రైర్భూషణైశ్చ మణ్డయన్తే

కృషీవలై రుప్తాని బీజాని క్షేత్రే మూలయన్తి

భక్తాః సదా దేవం కీర్తయన్తే

వీరాః సంగ్రామే శత్రూన్ విషూదన్తి

భార్గవః పరశునా క్షత్రియాణాం శీర్షాణి అదాలయత్

శ్వాపదాః జన్తూనాం దేహాన్ విదారయన్తి   మాంసం ఖాదన్తి చ

'కన్యావరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్'

ప్రకృత్యా సాధుభిర్జనైః సర్వత్ర నిర్దోషతా రూప్యతే.

## అభ్యాసము 9

### ఇకారాంత ఉకారాంత స్త్రీలింగశబ్దములకు చేరు విభక్తిప్రత్యయములు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | స్ | ఔ | అస్ |
| (ద్వి వి) | మ్ | ,, | స్ |
| (తృ వి) | ఆ | భ్యామ్ | భిస్ |
| (చ వి) | ఏ | ,, | భ్యస్ |
| (పం వి) | అస్ | ,, | ,, |
| (ష వి) | | ఓస్ | నామ్ |
| (స వి) | ఆమ్ ఔ | ,, | సు |

1. ఈ పాఠములోని వాక్యములలోగల ఇకారాంత ఉకారాంత స్త్రీలింగ శబ్ద రూపములకు బదులు వాని వికల్పరూపములను చేర్చి వ్రాయునది
2. ఇకారాంత, ఉకారాంత స్త్రీలింగశబ్దములలో ఏ యే విభక్తులలో రెండేసి రూపములుండును ? ఆ రూపముల నిష్పత్తి ప్రకారమును వివరించునది
3. ఋకారాంత స్త్రీలింగశబ్దము లెన్ని గలవు ? అవి ఏవి ? వివరించునది
4. స్వసృశబ్దమునకు, తక్కిన ఋకారాంత స్త్రీలింగ శబ్దములకు గల రూప భేదములను వివరించునది
5. ఋకారాంత పుంలింగ శబ్దములకు, ఋకారాంత స్త్రీలింగ శబ్దములకును చేరు విభక్తిప్రత్యయములలోగల సామ్యభేదములను వివరించునది
6. ఋకారాంతములగు విశేషణవాచకములకు స్త్రీలింగ శబ్దరూపము లెట్లేర్పడునో సోదాహరణముగ వివరించునది

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది

వశిష్ఠుని ధేనువును విశ్వామిత్రుడు అపహరించెను
స్వభావముచే సాధువుల బుద్ధులు హితములై యుండును
మంచిరాజు నీతితో రాజ్యమును పరిపాలించును
లోభముచే కీర్తి నశించును
ప్రాజ్ఞులు కష్టములను బుద్ధితో తొలగించుకొందురు
జనని ప్రీతితో పుత్రిని కౌగలించుకొనెను
ఖలునియొక్క కృతులు సజ్జనులకు రుచింపవు
స్మృతుల యందలి ధర్మములను మానవులు అనుష్ఠింతురు
శిశువులయొక్క తనువులు మృదువులై యుండును
ధేనువులవలన క్షీరమును పొందుచున్నాము
భారతీయులు ధేనువును తల్లినివలె పూజింతురు
ప్రకృతితో సుందరమైన వనమే మునులయొక్క వసతియై యుండును

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది.

ధేనవః క్షీరం యచ్ఛన్తి
బాలానాం సుకృతయః వరాన్ ప్రీణయన్తి
ప్రకృతయో నృపతీన్ సేవన్తే
చంద్రస్య కాన్తిర్జనాన్ అహ్లాదయతి
సుస్వరా మూర్తిశ్చిత్తమ్ ఆకర్షతి
స్మృతయో ధర్మాన్ కథయన్తి
సన్తతేర్దుష్కృతయః పితరౌ తుదన్తి
యాతరో జానకీమవన్దన్త
మాతా దుహితరమ్ అశ్లిష్యత్
అన్నస్య దాత్ర్యై నార్యః ప్రజాభిః కీర్త్యన్తే
ధనస్యార్జయిత్రీ సన్తతిః పితృభ్యామ్ అభినన్ద్యతే
వర్షాసు భూమిః కృష్యతే కృషీవలైః

దశమః పాఠః - పదవ పాఠము

# తిజంతములు - విధ్యాద్యర్థకము (లోట్)

( పరస్మైపదము - ప్రథమ పురుష )

జయతు = (అతడు) జయించుగాక జయింపవలెను
జయతామ్ = (వారిద్దరు) జయించుగాక జయింపవలెను
జయన్తు = (వారు) జయించుగాక జయింపవలెను

వీనిలో జి అనునది ధాతువు అ అనునది వికరణ ప్రత్యయము తు తామ్ అన్తు - అనునవి పరస్మైపదములో ప్రథమపురుష లోట్ ప్రత్యయములు

(లోట్ ప్రత్యయములు పరమగునపుడు కూడ వికరణ ప్రత్యయములు చేరుట మున్నగు గణకార్యములు ప్రవర్తించును)

జి + అ + తు జే + అ + తు (సూ- ) = జయతు (సూ- 2)
జి + అ + తామ్ = జే + అ + తామ్ (సూ-1) = జయతామ్ (సూ- 2)
జి + అ + అన్తు = జే + అ + అన్తు(సూ-1)=జయ+ అన్తు(సూ- 2)= జయన్తు (సూ-3)

సః జయతు తౌ జయతామ్ తే జయన్తు

మధ్యమ పురుష

జయ = (నీవు) జయింతువుగాక, జయింపుము
జయతమ్ = (మీరిద్దరు) జయింతురుగాక, జయింపుడు
జయత = (మీరు) జయింతురుగాక జయింపుడు

వీనిలో హి తమ్ త - అనునవి పరస్మైపదములో మధ్యమ పురుష లోట్ ప్రత్యయములు

జి + అ + హి = జే + అ + హి (సూ-9) = జయ+హి (సూ- 2)

సూ - 09 అతో హేః (పా సూ) = అకారముకంటె పరమయిన హి ప్రత్యయమునకు లోపము వచ్చును

ఉదా - జయ + హి = జయ

జి+ అ +తమ్=జే + అ + తమ్(సూ-9)=జయతమ్ (సూ- 2)

జి + అ + త = జే + అ +త (సూ-9) జయత (సూ- 2)

త్వం జయ యువాం జయతం యూయం జయత

## ఉత్తమ పురుష

జయాని = (నేను) జయింతునుగాక జయింపవలెను జయింపనిమ్ము

జయావ=(మేమిద్దరము) జయింతుముగాక జయింపవలెను జయింపనిమ్ము

జయామ=(మేము) జయింతుముగాక జయింపవలెను జయింపనిమ్ము

వీనిలో ఆని ఆవ ఆమ - అనునవి పరస్మైపదములో ఉత్తమ పురుష లోట్ ప్రత్యయములు

జి + అ +ఆని=జే+ అ +ఆని (సూ-9)=జయ+ఆని (సూ- 2)= జయాని (సూ-2) జి+ అ + ఆవ = జే + అ + ఆవ (సూ-9) =జయ +ఆవ (సూ- 2)=జయావ (సూ-22) జి+ అ + ఆమ=జే+ అ + ఆమ (సూ-9) = జయ + ఆమ (సూ- 2) = జయామ (సూ-22)

అహం జయాని ఆవాం జయావ వయం జయామ

సూ - 0 తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్ (పా సూ) = తు హి అను వానికి ఆశీరర్థమునందు వికల్పముగా తాత్ అను ఆదేశమగును ఉదా - జయతాత్ = (అతడు) జయించుగాక (నీవు) జయింతువుగాక

(లోట్ రూపములు)

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర పు) | జయతు<br>జయతాత్ | జయతామ్ | జయన్తు |
| (మ పు) | జయ<br>జయతాత్ | జయతమ్ | జయత |
| (ఉ పు) | జయాని | జయావ | జయామ |

ఆత్మనేపదము - ప్రథమపురుష

వర్ధతామ్ = (అతడు) వర్ధిల్లుగాక వర్ధిల్లవలెను
వర్ధేతామ్ = (వారిద్దరు) వర్ధిల్లుగాక వర్ధిల్లవలెను
వర్ధన్తామ్ = (వారు) వర్ధిల్లుగాక వర్ధిల్లవలెను

వీనిలో వృధ్ అనునది ధాతువు -అ అనునది వికరణ ప్రత్యయము తామ్ ఇతామ్ అన్తామ్ - అనునవి ఆత్మనేపదములో ప్రథమ పురుష లోట్ ప్రత్యయములు

వృధ్ + అ + తామ్ = వర్ధతామ్ (సూ-8) వృధ్ + అ + ఇతామ్ = వర్ధ + ఇతామ్ (సూ-8) = వర్ధేతామ్ (సూ-27) వృధ్ + అ + అన్తామ్ = వర్ధ + అన్తామ్ (సూ-8) = వర్ధన్తామ్ (సూ-3)

సః వర్ధతామ్ తౌ వర్ధేతామ్ తే వర్ధన్తామ్

మధ్యమ పురుష

వర్ధస్వ = (నీవు) వర్ధిల్లుదువుగాక వర్ధిల్లుము
వర్ధేథామ్ = (మీరిద్దరు) వర్ధిల్లుదురుగాక, వర్ధిల్లుడు
వర్ధధ్వమ్ = (మీరు) వర్ధిల్లుదురుగాక, వర్ధిల్లుడు

వీనిలో స్వ ఇథామ్ ధ్వమ్ - అనునవి ఆత్మనేపదములో మధ్యమపురుష లోట్ ప్రత్యయములు

వృధ్ + అ + స్వ = వృద్ధస్వ (సూ-9)
వృధ్+అ+ఇథామ్=వర్ధ+ఇథామ్ (సూ-9)=వర్ధేథామ్ (సూ-2)
వృధ్ + అ + ధ్వమ్ = వర్ధధ్వమ్ (సూ-9)
త్వమ్ వర్ధస్వ యువామ్ వర్ధేథామ్ యూయం వర్ధధ్వమ్

ఉత్తమ పురుష

వర్ధై = (నేను) వర్ధిల్లుదునుగాక, వర్ధిల్లవలెను వర్ధిల్లనిమ్ము
వర్ధావహై = (మేమిద్దరము) వర్ధిల్లుదుముగాక వర్ధిల్లవలెను వర్ధిల్లనిమ్ము
వర్ధామహై = (మేము) వర్ధిల్లుదుముగాక వర్ధిల్లవలెను వర్ధల్లనిమ్ము.

వీనిలో ఐ ఆవహై ఆమహై - అనునవి ఆత్మనేపదములో ఉత్తమపురుష లోట్ ప్రత్యయములు

వృధ్ + అ + ఐ = వర్ధ + ఐ (సూ-9) = వర్ధై (సూ-2 )
వృధ్ + అ + ఆవహై = వర్ధ + ఆవహై (సూ-9)=వర్ధావహై(సూ-22)
వృధ్ + అ + ఆమహై = వర్ధ + ఆమహై (సూ-9)=వర్ధామహై (22)

అహం వర్ధై ఆవాం వర్ధావహై వయం వర్ధామహై

(లోట్ రూపములు)

| ఏక | ద్వి | బహు |
|---|---|---|
| వర్ధతామ్ | వర్ధేతామ్ | వర్ధన్తామ్ |
| వర్ధస్వ | వర్ధేథామ్ | వర్ధధ్వమ్ |
| వర్ధై | వర్ధావహై | వర్ధామహై |

పుంలింగములు -

పర్జన్యః = మేఘము | ఆర్యః = పూజ్యుడు
సమ్పర్కః = సంపర్కము సంబంధము | ఆలయః = ఆలయము
మహీశః = రాజు
ఛాత్రః = శిష్యుడు

స్త్రీలింగము -

పృథివీ = భూమి | ఆర్యా = పూజ్యురాలు
మిత్రతా = స్నేహము

నపుంసకలింగము -

భద్రమ్ = మేలు, శుభము | దుర్గమ్ = కష్టము
సస్యమ్ = చేను పంట | శీఘ్రమ్ = తొందర
దృశ్ + అన=దర్శనమ్ = చూచుట | ఆసనమ్ = ఆసనము

విశేషణములు -

సమృద్ధ = సమృద్ధమైన | సమస్త = సమస్తమైన అన్ని
గమ్ + త=గత=వెళ్ళిన, పొందిన | కులీన = మంచికులమునందు పుట్టిన
న్యాయ్య = న్యాయముతో కూడిన

అవ్యయములు -

పునః = మరల | మా = వలదు

('మా అనునది క్రియాపదమునకు ముందే వ్యవహితముగాని, అవ్యవహితముగాని ప్రయోగింపబడును క్రియాపదము తరువాత ప్రయోగింపబడదు )

ప్రతి + ని + వృత్ = మరలివచ్చుట - (లట్) ప్రతినివర్తతే, (లఙ్) ప్రత్యన్యవర్తత (లోట్) ప్రతినివర్తతామ్

పరి + త్రా-రక్షించుట - (లట్) పరిత్రాయతే (లజ్) పర్యత్రాయత
(లోట్) పరిత్రాయతామ్

(భావే - లట్) ఉపవిశ్యతే (లజ్) ఉపావిశ్యత (లోట్) ఉపవిశ్యతామ్

ప్రతి + పద్=పొందుట - (లట్) ప్రతిపద్యతే (లజ్) ప్రత్యపద్యత
(లోట్) ప్రతిపద్యతామ్

పరి + పాల్ = పరిపాలించుట - (లట్) పరిపాలయతి - పరిపాలయతే
(లజ్) పర్యపాలయత్ - పర్యపాలయత (లోట్) పరిపాలయతు -
పరిపాలయతామ్

వి + జి = విజయమును పొందుట

సూ - విపరాభ్యాం జేః (పా సూ) = వి పర - అను ఉపసర్గల
కంటె పరమగు జి ధాతువునకు ఆత్మనేపద ప్రత్యయములు
చేరును

ఉదా - విజయతే పరాజయతే

(లట్) విజయతే (లజ్) వ్యజయత (లోట్) విజయతామ్

ప్ర + స్థా = బయలుదేరుట

సూ - 2 సమవప్రవిభ్యః స్థః (పా సూ)=సమ్ అవ ప్ర వి - అను
ఉపసర్గలకంటె పరమగు స్థా ధాతువునకు ఆత్మనేపద ప్రత్య
యములు చేరును

ఉదా - సంతిష్ఠతే అవతిష్ఠతే ప్రతిష్ఠతే వితిష్ఠతే

(లట్) ప్రతిష్ఠతే (లజ్) ప్రాతిష్ఠత (లోట్) ప్రతిష్ఠతామ్

ప్ర + మాద్ = తప్పుచేయుట పొరబడుట -

(లట్) ప్రమాద్యతి (లజ్) ప్రామాద్యత్ (లోట్) ప్రమాద్యతు

నరా దుర్గాణి తరన్తు భద్రాణి పశ్యన్తు
జయతు జయతు దేవః
విజయతాం నృపః
యూయం గురూన్ వన్దధ్వమ్
గృహం గత్వా శీఘ్రం ప్రతినివర్తస్వ
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యైః సమృద్ధా భవతు
సత్యం వద ధర్మం చర
లోకాః సమన్తాః సుఖం లభన్తామ్
శరణం గతాన్ పరిత్రాయస్వ
గచ్ఛత్వార్యా పునర్దర్శనాయ
ఆర్య ఇహాగమ్యతామ్ ఉపవిశ్యతాం చాత్రాసనే
అహం తత్ పుస్తకం పఠాని
వయమధునా గృహం గచ్ఛామ
కులీనైః సహ సమ్పర్కం పణ్డితైః సహ మిత్రతాంచ ప్రతిపద్యస్వ
యువాం రామాయణం పఠతమ్
ఆవాం దేవాలయం గచ్ఛావ
ఛాత్రాః యూయమధునా ఆత్మీయాన్ గృహాన్ ప్రతిష్ఠధ్వమ్
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః పరిపాలయన్తామ్
గురో రాజ్ఞామహం పరిపాలయాని
భక్తిర్దానాయ కల్పతామ్
సత్యాన్న ప్రమాద్యేత
పీడాన్ మా సేవస్వ

(క్రియావిశేషణములుగా ఉపయోగింపబడు పదములు ఎల్లప్పుడు నపుంసకలింగ ప్రథమైకవచన రూపములో నుండును)

ఉదా - శీఘ్రమ్ = శీఘ్రముగా అధికమ్ = ఎక్కువగా,

# అ భ్యా స ము 10

(పరస్మైపద లోట్ ప్రత్యయములు)

| | ఏక. | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర పు) | తు | తామ్ | అన్తు |
| (మ పు) | హి | తమ్ | త |
| (ఉ పు) | ఆని | ఆవ | ఆమ |

(ఆత్మనేపద లోట్ ప్రత్యయములు)

| | | | |
|---|---|---|---|
| (ప్ర పు) | తామ్ | ఇతామ్ | అన్తామ్ |
| (మ పు) | స్వ | ఇథామ్ | ధ్వమ్ |
| (ఉ. పు) | ఐ | ఆవహై | ఆమహై |

క్రింది పాణినీయ సూత్రముల యర్థములను సోదాహరణముగ వివరించునది

1. అతో హేః ; 2. తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్.
3 వివరాభ్యాం జేః ; 4 సమవప్రవిభ్యఃస్థః.

క్రింది వాక్యములను సంస్కృతీకరించునది

నరులు సత్యమును పలుకుదురుగాక
ఛాత్రులు గురువులకు నమస్కరింతురుగాక
మీరు సజ్జనుల మైత్రిని పొందుడు
నన్ను (నేను) పాఠశాలకు పోనిమ్ము
ఛాత్రుల చిత్తములు విద్యయందు రమించుగాక
ఉద్యానముయొక్క సౌందర్యమును చూడుము

ఓ బాలులార తల్లిదండ్రుల ఆజ్ఞను పాలింపుడు
మీరు ఆత్మీయములైన గుణములను శ్లాఘించుకొనవలదు
మనము సుఖముకొఱకై యత్నింపవలెను
మేమిద్దరము నగరమునకు పోవలెను
జనులకు నీతియందు అభిలాష వృద్ధి పొందవలెను
లోకముయొక్క హితముకొఱకై అధిపతులు యత్నింపవలెను.

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది

త్వం ఉద్యానస్య శోభాం ప్రేక్షస్వ
కన్యాః సంగీతం శిక్షన్తామ్
యువాం విద్యాలయం గచ్ఛతమ్
హే బాలాః వినయం మా త్యజత
శ్రాన్తాః పథికా వృక్షస్య ఛాయాయామ్ ఉపవిశన్తు
నృపతిః సదా రాజ్యం ధర్మేణ పాలయతు
పితరౌ పుత్రాన్ పుష్యతామ్
అరణ్యే కథమ్ అహం సంచరాణి
ధనన్యార్జనాయ యతామహై
గురోరాజ్ఞామ్ అనుతిష్ఠాని
హేమిత్ర ఫలాని స్వాదస్వ
ఆవాం దేవం పూజ యావ

ఏకాదశః పాఠః - పదునొకండవ పాఠము

# సుబంతములు - హలంతశబ్దములు



సర్వసామాన్యముగా సంస్కృత వైయాకరణులచే పేర్కొన బడిన సుప్ ప్రత్యయములు ఈ క్రింద వ్రాయబడుచున్నవి

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | స్ | ఔ | అస్ |
| (ద్వి వి) | అమ్ | ,, | ,, |
| (తృ వి) | ఆ | భ్యామ్ | భిస్ |
| (చ వి) | ఏ | , | భ్యస్ |
| (పం వి) | అస్ | ,, | ,, |
| (ష వి) | | ఓస్ | ఆమ్ |
| (స వి) | ఇ | , | సు. |

హలంతశబ్దములన్నింటికిని ఈ విభక్తిప్రత్యయములు చేరుటచేత సుబంతరూపము లేర్పడును ఆ శబ్దములకు సుప్ ప్రత్యయములు పరమగునపుడు ప్రాతిపదికములో కలుగు మార్పులను గమనించి సుబంతరూప నిష్పత్తి పేర్కొనదగును

సామాన్యముగా హలంతములలో పుంలింం శబ్దములకు, స్త్రీలింగ శబ్దములకును ఒకే విధముగ సుబంతరూపము లేర్పడును

### చకారాంత పుంలింగము - జలముచ్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | జలముక్ | జలముచౌ | జలముచః |
| (సం ప్ర) | (హే) జలముక్ | | |
| (ద్వి వి) | జలముచమ్ | ,, | ,, |
| (తృ వి) | జలముచా | జలముగ్భ్యామ్ | జలముగ్భిః |
| (చ వి) | జలముచే | , | జలముగ్భ్యః |
| (పం. వి) | జలముచః | ,, | , |
| (ష. వి) | , | జలముచోః | జలముచామ్ |
| (స వి) | జలముచి | | జలముక్షు |

జలముచ్ + స్ = జలముచ్ (సూ-83)

సూ - 1 3 చోః కుః (పా సూ) = చవర్గాక్షరములకు ఝల్ వర్ణములు పరమగునపుడును, పదాంతమునందును కవర్గాక్షరములు ఆదేశమగును

(అనునాసికములు అంతస్థములు తప్ప తక్కిన హల్లులకు ఝల్ అనునది ప్రత్యాహార సంజ్ఞ య ర ల వ - అను హల్లులకు అంతస్థము లని పేరు)

ఉదా- జలముచ్=జలముక్ జలముచ్ + భ్యామ్ = జలముక్ + భ్యామ్

సూ - 114 అనునాసికేతరవర్గీయాక్షరములకు గాదహల్లు పరమగునపుడు ఆయావర్గల తృతీయాక్షరములు ఆదేశములగును

ఉదా - జలముక్ + భ్యామ్ = జలముగ్భ్యామ్

జలముచ్ + సు = జలముక్ + సు (సూ-1 3) = జలముక్షు (సూ-44)

చకారాంత స్త్రీలింగము - వాచ్‌శబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | వాక్ | వాచౌ | వాచః |
| (సం ప్ర) | (హే) వాక్ | ,, | ,, |
| (ద్వి. వి) | వాచమ్ | ,, | ,, |
| (తృ వి) | వాచా | వాగ్భ్యామ్ | వాగ్భిః |
| (చ వి) | వాచే | , | వాగ్భ్యః |
| (పం వి) | వాచః | ,, | , |
| (ష వి) | ,, | వాచోః | వాచామ్ |
| (స వి) | వాచి | , | వాక్షు |

వాచ్+స్=వాక్ (సూ-83, 1 3) వాచ్+భ్యామ్ = వాగ్భ్యామ్ = (సూ-1 3, 1 4) వాచ్+సు=వాక్షు (సూ-1 3 44)

'భిషజ్ శబ్దము

భిషజ్ + స్ = భిషజ్ (సూ-83) = భిషగ్ (సూ- 13)

సూ - . 5 వాఽవసానే (పా సూ) = ఏదియు పరముగా లేనపుడు అనునాసికేతర వర్గీయాక్షరములకు అయా వర్గల ప్రథమాక్షరములు వికల్పముగా ఆదేశమగును

ఉదా - భిషక్, భిషగ్

భిషజ్ + భ్యామ్ = భిషగ్భ్యామ్ (సూ- 13) భిషజ్ + సు = భిషగ్ + సు (సూ-1 3)

సూ - 6 ఖరిచ (పా సూ) = శ్వాసహల్లు (ఖర్) పరమగునపుడు అనునాసికేతర వర్గీయాక్షరములకు అయా వర్గల ప్రథమాక్షరములు ఆదేశమగును

ఉదా.- భిషగ్ + సు = భిషక్ + సు = భిషక్షు (సూ-44).

*దివిషద్ శబ్దము

దివిషద్ + స్ = దివిషత్ దివిషద్ (సూ-83 15). దివిషద్ + సు = దివిషత్సు (సూ- 6)

క్షుధ్' శబ్దము

క్షుధ్+స్=క్షుత్ క్షుద్ (సూ-83 1 5 47) క్షుధ్+భ్యామ్=క్షుద్భ్యామ్
(సూ- 14) క్షుధ్ + సు = క్షుత్సు (సూ-1 6)

*కకుభ్ శబ్దము

కకుభ్ + స్ = కకుప్ కకుబ్ (సూ-83 5 47) కకుభ్+భ్యామ్ =
కకుబ్భ్యామ్ (సూ- 4) కకుభ్+సు=కకుప్సు (సూ- 6)

తురాషాహ్ శబ్దము

తురాషాహ్ + స్ = తురాషాహ్ (సూ-83)

సూ - 7 హోఢః (పా సూ) = హకారమునకు ఝల్లు పరమగునపుడు
పదాంతమందును ఢకారాదేశమగును

తురాషాహ్=తురాషాఢ్=తురాషాట్, తురాషాఢ్ (సూ- 5 47)
తురాషాహ్+భ్యామ్=తురాషాఢ్+భ్యామ్=తురాషాడ్భ్యామ్ (సూ- 4)
తురాషాహ్+సు=తురాషాఢ్+సు=తురాషాట్సు (సూ- 16)

హలంత నపుంసకలింగ శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు -

(ప్ర వి) స్ - ఈ - ఇ
(ద్వి వి) అమ్ - ఈ - ఇ

తక్కిన విభక్తులలో పుంలింగ శబ్దములకువలెనే యుండును

*సువాచ్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | సువాక్ | సువాచి | సువాఞ్చి |

సువాచ్ + స్ = సువాచ్ (సూ-70) = సువాక్ (సూ- 3)

సువాచ్ + అమ్ = సువాచ్ (సూ-70) = సువాక్ (సూ- 3)

సూ - 8 'ఇ' అను బహువచన సుప్ ప్రత్యయము పరమగునపుడు చివరి హల్లునకు ముందు నకారము ఆగమముగా చేరును

ఉదా - సువాచ్ + ఇ = సువాన్చ్ + ఇ

సూ - 1 9 నశ్చాపదాన్తస్య ఝలి (పా సూ) = అపదాంతమందలి నకారమకారములకు అనునాసికములు అంతస్థములు తప్ప తక్కిన హల్లులు (ఝల్) పరమగునపుడు అనుస్వారాదేశము వచ్చును

ఉదా - సువాన్చ్ + ఇ = సువాంచ్ + ఇ

సూ - 120 అనుస్వారస్య యయి పరసవర్ణః (పా సూ) = అనుస్వారమునకు ఊష్మహల్లులు తప్ప తక్కిన హల్లులు పరమగునపుడు పరసవర్ణము ఆదేశమగును. అనగా అనుస్వారమునకు వర్గీయాక్షరములు పరమగునపుడు ఆయా వర్గల పంచమాక్షరములు య వ ల లు పరమగునపుడు అనునాసిక య వ ల లు ను ఆదేశములగునని భావము

(శ ష స హ - అను హల్లులకు ఊష్మములని పేరు ఊష్మములు తప్ప తక్కిన హల్లులకు 'యయ్' అనునది ప్రత్యాహార సంజ్ఞ)

సువాంచ్ + ఇ = సువాఞ్చి

'అసృజ్' శబ్దము

(ప్ర సం ద్వి) అసృక్ / అసృగ్ } - అసృజీ - అసృఞ్జి

అసృజ్ + స్ = అసృజ్ (సూ-70)
అసృక్, అసృగ్ (సూ - 113, 5)
అసృజ్ + ఇ = అసృజ్ (సూ-1 8)
అసృంజ్ + ఇ (సూ-1 9) = అసృంజ్ఞి (సూ-120)

పుంలింగములు -

సుహృద్ = స్నేహితుడు
జలముచ్ = మేఘము
తురాషాహ్ = ఇంద్రుడు
విజయః = విజయము
హుతభుజ్ = అగ్ని
భిషక్ = వైద్యుడు
దివిషద్ = దేవతలు
అన్తః (పుం)
అన్తమ్ (న) } =చివర

స్త్రీలింగము -

పరిషద్
సంసద్ } = సభ
శరద్ = శరత్కాలము
మృద్ = మన్ను
దృషద్ = రాయి
కకుభ్ = దిక్కు
ఆపద్
విపద్ } = ఆపద
సంపద్ = సంపద
సర్వసమ్పద్ = అన్నిసంపదలు
క్షుధ్ = ఆకలి
చర్మ = చర్మ

నపుంసకలింగము -

అసృజ్ = రక్తము

విశేషణములు -

శీతల = చల్లని
లభ్ + త = లబ్ధ = పొందబడిన
లోకాభిరామ=లోకములో అందమైన
భీ + త = భీత = భయపడిన

ఉప+విశ్+త } = కూర్చొనిన
=ఉపవిష్ట

సమ్+గమ్+త } = కలసిన
=సంగత

దహ్ + త =దగ్ధ=దహింపబడిన

సువాచ్ = మంచివాక్కుగల

సిచ్ + త = సిక్త = తడుపబడిన

ఆ + వృ + త } =ఆవరింపబడిన
= ఆవృత

పీడ్ + త = పీడిత = పీడింపబడిన

అప+హృ+తృ } = దొంగిలించునట్టి
= అపహర్తృ

అలఙ్ఘనీయ = దాటశక్యముగాని

అవ్యయములు -

వి + జి + య = విజిత్య = జయించి

ఆట్ + త్వా = అటిత్వా = తిరిగి

భూయః = మరల

ప్రాయః = తఱచుగా

క్రియాపదములు -

నిర్ + మా = నిర్మించుట - (కర్మణి-లట్) నిర్మీయతే (లఙ్) నిరమీయత (లోట్) నిర్మీయతామ్

ఉప + దిశ్ = ఉపదేశించుట - (లట్) ఉపదిశతి-ఉపదిశతే (లఙ్) ఉపాదిశత్-ఉపాదిశత (లోట్) ఉపదిశతు-ఉపదిశతామ్

అప + నీ = పోగొట్టుట తొలగించుట - (కర్మణి-లట్) అపనీయతే (లఙ్) అపనీయత (లోట్) అపనీయతామ్

ఇన్దోః ప్రకాశః శరది శీతల ఆహ్లాదకశ్చ భవతి

విపత్సు ధైర్యం వహన్తే ధీరాః

సుహృదాం వచనా న్యలంఘనీయాని

బుధానాం పరిషది శాస్త్రాణాం చర్చాసు విజిత్యైవ కీర్తి ర్లబ్ధా

ఆపదామ్ అపహర్తారం దాతారం సర్వసంపదామ్

లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్

ఘటో మృదా నిర్మీయతే

హుతభుజా దగ్ధం వనం దృష్ట్వా జనా భీతా అభవన్
కవీనాం వాక్షు మాధుర్యం వర్తతే
దృషది ఉపవిష్టో గురుః శిష్యాన్ ధర్మమ్ ఉపాదిశత్
వర్షాసు ప్రాయో గగనం జలముగ్భి రావృతం దృశ్యతే
నరాణాం రోగాన్ అగదై రపనయన్తి భిషజః
క్షుధా పీడితా జనాః గృహం గృహం చాటిత్వాన్నమ్ అయాచన్త
సునృపతేః కీర్తిః కకుభామ్ అన్తేష్వపి ప్రసరతి
యుద్ధే వీరస్య శరీరమ్ అసృజా సిక్త మభవత్
సువాగ్భి రపత్యైః పితా ప్రశస్యోఽభవత్
తురాషాహః సంసది సంగతా దివిషదోఽసురాణాం
విజయస్య మార్గాన్ అచిన్తయన్
పరపాలైర్లోకానాం భీతి రపనీయతామ్

### తకారాంత శబ్దములు

సంస్కృతభాషలో మూడురకములైన తకారాంత శబ్దములు కలవు 1) శతృ ప్రత్యయాంత శబ్దములు 2) మతుప్ ప్రత్యయాంత శబ్దములు క్తవతు ప్రత్యయాంతములు 3) కేవల తకారాంతశబ్దములు

ఇందు కేవల తకారాంత శబ్దములకు మూడు లింగములందును తక్కిన హలంత శబ్దములకువలెనే రూపములు ఏర్పడును

### తకారాంత పుంలింగము - మరుత్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | మరుత్ | మరుతౌ | మరుతః |
| (సం ప్ర) | (హే) మరుత్ | ,, | ,, |
| (ద్వి వి) | మరుతమ్ | ,, | ,, |
| (తృ వి) | మరుతా | మరుద్భ్యామ్ | మరుద్భిః |

### తకారాంత స్త్రీలింగము - 'విద్యుత్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | విద్యుత్ | విద్యుతౌ | విద్యుతః |
| (సం. ప్ర) | (హే) విద్యుత్ | ,, | ,, |
| (ద్వి వి) | విద్యుతమ్ | ,, | ,, |
| (తృ వి) | విద్యుతా | విద్యుద్భ్యామ్ | విద్యుద్భిః |

### తకారాంత నపుంసకలింగము - 'జగత్' శబ్దము

| | | | |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | జగత్ | జగతీ | జగన్తి |
| (తృ వి) | జగతా | జగద్భ్యామ్ | జగద్భిః |

(ఇట్లే తక్కిన విభక్తుల యందలి రూపముల నూహించునది)

### కృదంతములు – శతృ ప్రత్యయాంత శబ్దములు

పరస్మైపదిధాతువులకు అయాగణములకు సంబంధించిన వికరణ ప్రత్యయములను చేర్చి పిమ్మట 'అత్' అను 'కృత్' ప్రత్యయమును చేర్చుటచే శతృప్రత్యయాంత శబ్దము లేర్పడును.

ఉదా - జి+అ+అత్= జే + అ + అత్ (సూ-9) = జయ + అత్ (సూ-12) = జయత్ (సూ-8) ; గచ్ఛ + అ + అత్ = గచ్ఛత్ (సూ-8). చుర్ + అయ + అత్ = చోరయ + అత్ (సూ- 6) = చోరయత్ (సూ-8)

### తకారాంత పుంలింగము - 'గచ్ఛత్' శబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర. సం ద్వి ) | గచ్ఛన్ | గచ్ఛన్తౌ | గచ్ఛన్తః |
| (ద్వి వి) | గచ్ఛన్తమ్ | ,, | గచ్ఛతః |

తృతీయాది విభక్తులయందు అన్ని తకారాంత శబ్దములకును ఒకే విధముగ రూపములు నిష్పన్నములగును

సూ - 2 శతృప్రత్యయాంత పుంలింగశబ్దములకు సర్వనామ స్థానములు (అనగా ప్రథమావిభక్తి ప్రత్యయములు ద్వితీయా విభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయములును) పరమగు నెప్పుడు చివరి తకారమునకు ముందు నకారము ఆగమముగా చేరును ఉదా - గచ్ఛత్ + స్ = గచ్ఛన్త్ + స్

సూ - 22 సుడనపుంసకస్య (పా సూ) = పుంలింగ స్త్రీలింగ శబ్దములచే చేయబడ్డ ప్రథమావిభక్తి ప్రత్యయములు ద్వితీయా విభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయములును సర్వనామ స్థానములనబడును

(ప్రథమా విభక్తి ప్రత్యయములకు ద్వితీయా విభక్తి ఏకవచన ద్వివచన ప్రత్యయములకును 'సుట్' అనునది ప్రత్యాహార సంజ్ఞ)

గచ్ఛన్త్ + స్ = గచ్ఛన్త్ (సూ-83)

సూ - 123 సంయోగాన్తస్య లోపః (పా సూ)=పదాంతమందలి సంయుక్త హల్లులలో మొదటి హల్లు మిగిలి తక్కిన హల్లులకు లోపము వచ్చును

ఉదా - గచ్ఛన్త్ = గచ్ఛన్

గచ్ఛత్ + ఔ = గచ్ఛన్తౌ (సూ- 2 ) గచ్ఛత్ + అస్ = గచ్ఛన్తః (సూ- 2 , 20) గచ్ఛత్ + అమ్ = గచ్ఛన్తమ్ (సూ- 2 )

శతృప్రత్యయాంతశబ్దములకు ఈః అను స్త్రీ ప్రత్యయమును చేర్చుటచేత స్త్రీలింగరూపము లేర్పడును

సూ - 24 ఈ' యను స్త్రీప్రత్యయము పరమగుచపుడు, నపుంసక లింగమునందు ప్రథమా ద్వితీయా ద్వివచన ప్రత్యయమగు 'ఈ యనునది పరమగునపుడు మొదటి, నాల్గవ పదియవ గణముల ధాతువుల నుండి నిష్పన్నములైన శతృ ప్రత్యయాంత శబ్దముల చివరి తకారమునకు ముందు నకారము ఆగమముగా చేరును

ఉదా - వదత్ + ఈ = వదన్తీ  గచ్ఛత్ + ఈ = గచ్ఛన్తీ.

ఆరవ గణము ధాతువులనుండి నిష్పన్నములైన శతృ ప్రత్యయాంత శబ్దముల చివరితకారమునకు ముందు నకారాగమము వికల్పముగా వచ్చును

ఉదా - విశత్ + ఈ = విశన్తీ  విశతీ. స్పృశత్ + ఈ = స్పృశన్తీ. స్పృశతీ

ఈవిధముగా శతృ ప్రత్యయాంత శబ్దములన్నియు స్త్రీలింగమునందు ఈకారాంతములగుటచే వాని సుబంతరూపములు ఈకారాంత స్త్రీలింగ శబ్దములకువలె ఏర్పడును.

తకారాంత నపుంసకలింగము - 'గచ్ఛత్' శబ్దము

(ప్ర సం ద్వి) గచ్ఛత్  గచ్ఛన్తీ  గచ్ఛన్తి

గచ్ఛత్ + స్ = గచ్ఛత్ (సూ-70)  గచ్ఛత్ + ఈ = గచ్ఛన్తీ (సూ- 24)  గచ్ఛత్ + ఇ = గచ్ఛన్తి (సూ-18)

కృదంతములు - శానచ్ ప్రత్యయాంతములు

ఆత్మనేపది ధాతువులకు వికరణ ప్రత్యయముకు చేర్చి పిమ్మట 'ఆన అను కృత్ప్రత్యయమును చేర్చుటచే శానచ్ ప్రత్యయాంత రూపము లేర్పడును  శానచ్ ప్రత్యయమునకు పూర్వభాగము అకారాంతము అయినచో ఆన అనుదానికి బదులు 'మాన' అనునది చేరును.

ఉదా - లభ్ + అ + మాన = లభమాన అర్థ్ + అయ + మాన = అర్థయమాన

కర్మార్థమునందు ధాతువునకు 'య' అను దానిని చేర్చి పిమ్మట మాన అను దానిని చేర్చుటచే శానచ్ ప్రత్యయాంత రూపములు ఏర్పడును

ఉదా - లభ్ + య + మాన = లభ్యమాన పఠ్ + య + మాన = పఠ్యమాన

శానచ్ ప్రత్యయాంత శబ్దములు అకారాంతములగుటచే స్త్రీ లింగమునందు వానికి 'ఆ' అను స్త్రీ ప్రత్యయము చేరి ఆకారాంత శబ్దము లేర్పడును

ఉదా - లభమాన + ఆ = లభమానా పఠ్యమాన + ఆ = పఠ్యమానా

శతృ శానచ్ ప్రత్యయములు వర్తమానార్థమునందు చేరును అందుచే శతృ ప్రత్యయాంతములు శానచ్ ప్రత్యయాంతములును వర్తమానార్థక ధాతుజవిశేషణవాచకములు (Present participles) అని వ్యవహరింపబడుచున్నవి

## మతుప్ ప్రత్యయాంత శబ్దములు

సూ - 25 తదస్యాస్త్యస్మిన్నితి మతుప్ (పా సూ) = 'కల' అను అర్థములో మత్ అను తద్ధిత ప్రత్యయము చేరును

ఉదా - గోమత్ = గోవులుకల బుద్ధిమత్ = బుద్ధి ం

సూ - 126 మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః (పా సూ) యవ మొదలైనవి కొన్నితప్ప తక్కిన శబ్దములలో అకార, ఆకార, మకారములు అంతమందుగల శబ్దములకు చెందెను, అకార, ఆకార, మకారములు ఉపధగాగల శబ్దములకుచెందెను పరమగు మత్ ప్రత్యయ మకారమునకు వకారాదేశమగును

ఉదా - జ్ఞానవత్, విద్యావత్, కింవత్, యశస్వత్, భాస్వత్, లక్ష్మీవత్

(కాని యవమత్, భూమిమత్ మున్నగుచోట్ల వకారాదేశము రాదు)

సూ - 127 ఝయః (పా సూ) = అనునాసికేతర వర్గీయాక్షరములకంటె పరమగు మతుప్ ప్రత్యయ మకారమునకుకూడ వకారాదేశమగును ఉదా - విద్యుత్వత్

తకారాంత పుంలింగము - 'ధీమత్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | ధీమాన్ | ధీమన్తౌ | ధీమన్తః |
| (సం ప్ర) | (హే) ధీమన్ | ,, | ,, |
| | ధీమన్తమ్ | ,, | ధీమతః |

సూ - 128 మతుప్ ప్రత్యయాంతములకు ప్రథమైకవచన ప్రత్యయము పరమగునపుడు ఉపధయగు అక్షరమునకు దీర్ఘము చివరి తకారమునకు ముందు నకారమును వచ్చును సంబోధనైక వచనమునందు తక్కిన సర్వనామ స్థానములు పరమగు నపుడును నకారాగమము మాత్రము వచ్చును.

ధీమత్ + స్ = ధీమాన్త్ + స్ = ధీమాన్త్ (సూ-83) = ధీమాన్ (సూ - 23) ధీమత్+ఔ=ధీమన్తౌ ధీమత్ + అస్=ధీమన్తః. (హే)ధీమత్+స్=(హే)ధీమన్త్+స్ = (హే) ధీమన్త్ (సూ-83) = (హే) ధీమన్ (సూ- 23) ధీమత్+అమ్=ధీమన్తమ్

మతుప్ ప్రత్యయాంత శబ్దములకు స్త్రీలింగమునందు 'ఈ' అను స్త్రీ ప్రత్యయము చేరును అందుచే అవి ఈకారాంత స్త్రీలింగ శబ్దములగును

ఉదా - ధీమత్ + ఈ = ధీమతీ. ఆయుష్మత్ + ఈ = ఆయుష్మతీ

మతుప్ ప్రత్యయాంత నపుంసకలింగ శబ్దములకు కేవల తకారాంత నపుంసకలింగ శబ్దములకువలెనే సుబంతరూపములు నిష్పన్నములగును

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | శ్రీమత్ | శ్రీమతీ | శ్రీమన్తి |

## కృదంతములు - క్తవతు ప్రత్యయాంతములు

భూతకాలార్థమునందు ధాతువునకు తవత్ అను దానిని చేర్చుటచే క్తవతు ప్రత్యయాంతరూపము లేర్పడును ఈ ప్రత్యయము కర్త్రర్థమునందు చేయును

ఉదా - జి + తవత్ = జితవత్ = జయించిన స్మృ + తవత్ = స్మృతవత్ = స్మరించిన

కొన్ని ధాతువులకంటె పరమగునపుడు ఈ ప్రత్యయమునకు ముందు ఇకారము ఆగమముగా చేరుట ఈ ప్రత్యయము పరమగునపుడు కొన్ని ధాతువులలోని యకార వకార, రేఫ లకారములకు ఇ ఉ ఋ ౡ అను వర్ణము లాదేశమగుట మున్నగు వ్యాకరణకార్యములన్నియు క్తప్రత్యయాంత శబ్దములలో వలెనే జరుగును (కావున క్త ప్రత్యయాంత శబ్దమునకు వత్ అనుదానిని చేర్చుకొని క్తవతు ప్రత్యయాంత రూపములను ఊహింపవచ్చును )

ఉదా - పఠిత - పఠితవత్ ఉషిత - ఉషితవత్

మతుప్ ప్రత్యయాంత శబ్దములకువలెనే క్తవతు ప్రత్యయాంత శబ్దములకుగూడ సుబంతరూపము లేర్పడును

## తకారాంత పుంలింగము - 'జితవత్' శబ్దము

| | ఏక. | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర. వి) | జితవాన్ | జితవన్తౌ | జితవన్తః |
| (సం ప్ర) | (హే) జితవన్ | ,, | ,, |
| (ద్వి వి) | జితవన్తమ్ | ,, | జితవతః |
| (తృ వి) | జితవతా | జితవద్భ్యామ్ | జితవద్భిః |

## తకారాంత నపుంసకలింగము - 'జితవత్' శబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | జితవత్ | జితవతీ | జితవన్తి |

స్త్రీలింగమునందు క్తవతు ప్రత్యయాంత శబ్దములకు 'ఈ' అను స్త్రీ ప్రత్యయమును చేర్చుటచే స్త్రీలింగ శబ్దరూపము లేర్పడును అప్పుడవి ఈకారాంతములగుటచే వానికి ఈకారాంత స్త్రీలింగ శబ్దములకు (నదీశబ్దమునకు) వలె సుబంతరూప నిష్పత్తి కలుగును

ఉదా - పఠితవత్ + ఈ = పఠితవతీ = చదివినయామె

నీవు అను అర్థముగల 'భవత్' అను శబ్దమునకు కూడ మతుప్ ప్రత్యయాంత శబ్దములకువలెనే రూపము లేర్పడును.

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | భవాన్ | భవన్తౌ | భవన్తః |
| (సం. ప్ర) | (హే) భవన్ | ,, | ,, |
| (ద్వి వి) | భవన్తమ్ | ,, | భవతః |
| (తృ వి) | భవతా | భవద్భ్యామ్ | భవద్భిః |

స్త్రీలింగమునందు నీవు అను అర్థముగల భవత్ శబ్దమునకు ఈ అను స్త్రీ ప్రత్యయముచేరి భవతీ అను ఈకారాంత శబ్ద మేర్పడును.

తకారాంత పుంలింగము - మహత్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | మహాన్ | మహాన్తౌ | మహాన్తః |
| (సం ప్ర) | (హే) మహన్ | , | , |
| (ద్వి వి) | మహాన్తమ్ | | మహతః |
| (తృ వి) | మహతా | మహద్భ్యామ్ | మహద్భిః |

'మహత్' శబ్దమునకు సర్వనామ స్థానములు పరమగునపుడు నపుంసకలింగమునందు 'ఇ అను బహువచన సుప్ ప్రత్యయము పరమగునపుడును ఉపధయగు అకారమునకు దీర్ఘమును చివరి తకారమునకు ముందు నకారాగమమును వచ్చును కాని సంబోధనైకవచనము నందు నకారాగమము మాత్రమే వచ్చును ఉపధాదీర్ఘము రాదు

ఉదా - మహత్ + స్ = మహాన్ త్ + స్ = మహాన్ త్ (సూ-83)
మహాన్ (సూ-123)

స్త్రీలింగమునందు మహత్ శబ్దమునకు ఈ అను స్త్రీ ప్రత్యయముచేరి మహతీ' అను ఈకారాంత శబ్ద మేర్పడును

తకారాంత నపుంసకలింగము - మహత్ శబ్దము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | మహత్ | మహతీ | మహాన్తి |

మహత్ + ఇ = మహాన్తి (సూ- 8)

**పుంలింగము -**

ఉద్భవః = పుట్టుక
సంగః = స్నేహము కలయిక
సత్ = సత్పురుషుడు
భవత్ = నీవు
హేతుః = కారణము
ఆదిః = మొదలు
అసత్ = అసత్పురుషుడు
యత్నః, ప్రయత్నః = ప్రయత్నము

**స్త్రీలింగము:-**

విద్యుత్ = మెఱుపు
సంపత్తిః = సంపద
ఏకరూపతా = ఒకేరూపము కల్గియుండుట
విపత్తిః = ఆపద
సరిత్ = నది
గీతా = భగవద్గీత

**నపుంసకలింగము:-**

జగత్ = లోకము
వియత్ = ఆకాశము
శకటమ్ = బండి
అభి+వాద్+అన =అభివాదనమ్ } =నమస్కరించుట, నమస్కారము
కార్యమ్ = పని

**విశేషణములు -**

గమ్ + అత్ = గచ్ఛత్ } = పోవుచున్న
పఠ్ + అత్ = పఠత్ } = చదువుచున్న
ఆయుష్ + మత్ = ఆయుష్మత్ } = ఆయువుకల
ధీ + మత్ = ధీమత్ } = బుద్ధికల
మతి + మత్ = మతిమత్ } = బుద్ధికల ఆలోచనకల
మూర్తి + మత్ =మూర్తిమత్ } = ఆకారముకల
ని + సూద్ + తవత్ = నిషూదితవత్ } = చంపిన
వి + రచ్ + తవత్ = విరచితవత్ } = రచించిన

కృ + య = కార్య = చేయబడదగిన

ధావ్ + అత్ = ధావత్ } = పరుగెత్తుచున్న
ఇష్+అత్ = ఇచ్ఛత్ = కోరుచున్న
భగ + మత్ = భగవత్ } =ఈశ్వరత్వముకల
బుద్ధి+మత్ = బుద్ధిమత్ = బుద్ధికల

కీర్తి+మత్=కీర్తిమత్=కీర్తికల
కమ్ప్ + అన = కమ్పమాన } = కదలుచున్న
ఉప+దిశ్+తవత్ =ఉపదిష్టవత్ } = ఉపదేశించిన
వచ్+య=వాచ్య = చెప్పబడదగిన

విద్యుతా సహ మేఘో వియతి వర్తతే
ఇహ జగతి పుత్త్రస్యోద్భవ ఉత్సవస్య హేతు రితి మన్యతే
సతాం సద్భి స్సఙ్గః కథమపి హి పుణ్యేన భవతి
అసద్భిస్సహ న సఙ్గచ్ఛస్వ
విద్యాలయం గచ్ఛతాం ధావన్ బాలస్తత్రాదౌ ప్రవిశతి
పఠద్భ్యశ్ఛాత్రేభ్యః పుస్తకాని దీయతాం మహద్భిః
ఆయుష్మాన్ భవ సౌమ్యేతి వాచ్యో విప్రోఽభివాదనే
ధీమన్తో జగతి కీర్తిమన్తో భవన్తి
నమో భగవతే వాసుదేవాయ
సమ్పత్తౌ చ విపత్తౌ చ మహతామ్ ఏకరూపతా వర్తతే
రామో మూర్తిమాన్ ధర్మ ఇవ విరాజతే
సర్వదా బుద్ధిమతాం ప్రయత్నాని సఫలాని భవన్తి
మతిమద్భి ర్దుఃఖాని బుద్ధ్వా పరిహ్రియన్తే
ధేనుషు దుహ్యమానాసు ప్రస్థాయ స గ్రామం గతః
దేవస్యోత్సవం ద్రష్టుం భవన్తః కుటుమ్బేన సహాగచ్ఛన్త్వితి ప్రార్థయే
గచ్ఛతు భవాన్ పునర్దర్శనాయ
అభ్యుదయమ్ ఇచ్ఛద్భిః సర్వదా యత్నః కర్తవ్యః
వాతేన కమ్పమానా ద్వృక్షాత్ పతన్తి ఫలాని

రాక్షసాన్ నిషూదితవన్తం రామమ్ ఋషయ అభ్యనన్దన్
గీతామ్ ఉపదిష్టవన్తం భగవన్తం శ్రీకృష్ణమ్ అర్జునః ప్రాణమత్
రథ్యాయాం గచ్ఛన్తి శకటాని పశ్యన్తి బాలాః
భగవతీం దేవీం భగవన్తం దేవంచ పూజయన్తి భక్తాః
మహాన్తి కార్యాణ్యాచరన్తి మహాన్తః తైస్తే మహతీం కీర్తిం విన్దన్తే
సమస్తానాం సరితాం వారీణ్యపి సముద్రమేవ ప్రవిశన్తి
తత్రభవాన్ వాల్మీకిః రామాయణం విరచితవాన్

నీవు అను అర్థము కలదైనను 'భవత్' శబ్దము కర్తృవాచకముగా ఉన్నపుడు క్రియాపదము ప్రథమపురుషయందే యుండును. (సూ-4)

ఉదా - భవాన్ గచ్ఛతు భవన్త ఆగచ్ఛన్తు

అత్ర 'తత్ర' అను వానితో 'భవత్' శబ్దమును కలిపి పేర్కొనిన పుడు అవి పూజ్య వాచకములగును

ఉదా - తత్రభవాన్ వాల్మీకిః = పూజ్యుడగు వాల్మీకి
అత్రభవాన్ వేదవ్యాసః = పూజ్యుడగు వేదవ్యాసుడు

సూ - 29 సమో గమ్యృచ్ఛిభ్యామ్ (పా సూ) = సమ్ అను ఉపసర్గకంటె పరమయిన 'గమ్' ఋచ్ఛ్ అను ధాతువులకు ఆత్మనేపదప్రత్యయములు చేరును
ఉదా - సఙ్గచ్ఛతే సఙ్గచ్ఛస్వ సమృచ్ఛతే

సూ - 30 యతశ్చ నిర్ధారణమ్ (పా సూ) = ఒక సముదాయమునుండి ఒక భాగమును వేరుచేసి చెప్పునపుడు ఆ సముదాయ వాచకమునకు షష్ఠీ సప్తమీ విభక్తులు వచ్చును (నిర్ధారణ మనగా సముదాయమునుండి ఏకదేశమును వేరుచేయుట అని యర్థము )

ఉదా - గచ్ఛతాం బాలానాం రావణ్ ఆదౌ ప్రవిశతి (లేక)
గచ్ఛత్సు బాలేషు రావణ్ ఆదౌ ప్రవిశతి

సూ - 3 యస్య చ భావేన భావలక్షణమ్ (పా సూ) = దేని క్రియచే మరియొక క్రియ తెలియబడునో తద్వాచకమునకు సప్తమీ విభక్తి వచ్చును

ఉదా - ధేనుషు దుహ్యమానాసు గతః = గోవులు పితుకబడుచుండగా వెడలెను బాలేషు పఠత్సు ఆగతః = బాలురు చదువుచుండగా వచ్చెను

## అభ్యాసము 11

హలంత పుంలింగ స్త్రీలింగశబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములను పేర్కొనుమది

హలంత నపుంసకలింగశబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములను పేర్కొనుమది

తకారాంతశబ్దము లెన్ని రకములు గలవు? వివరించుమది

శతృప్రత్యయాంతశబ్దము లేయర్థములో యెట్లేర్పడునో వివరించుమది

శానచ్ ప్రత్యయాంతశబ్దము లేయర్థములో యెట్లేర్పడునో వివరించుమది

మతుప్ ప్రత్యయాంతశబ్దము లెట్లేర్పడునో వివరించుమది

క్తవతు ప్రత్యయాంతశబ్దము లేయర్థములో యెట్లేర్పడునో వివరించుమది

శతృ ప్రత్యయాంతశబ్దముల స్త్రీలింగరూపము లెట్లేర్పడునో సోదాహరణముగ వివరించుమది

మతుప్ ప్రత్యయాంతశబ్దములకు క్తవతు ప్రత్యయాంతశబ్దములకు స్త్రీలింగరూపము లెట్లేర్పడునో సోదాహరణముగ వివరించుమది

క్రింది పాణినీయ సూత్రముల యర్థములను సోదాహరణముగ వివరించుడి

1) చోః కుః  2) వాఽవసానే  3) ఖరి చ  4) హో ఢః  5) నశ్చాపదాన్తస్య ఝలి  6) అనుస్వారస్య యయి పరసవర్ణః.  7) సుడనపుంసకస్య  8) సంయోగాన్తస్య లోపః  9) తదస్యాస్త్యస్మిన్నితి మతుప్  10) మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః.  11) ఝయః

క్రింద పేర్కొనిన సందర్భములలో కలుగు వ్యాకరణ కార్యములను సోదాహరణముగ విషరించుడి —

1 అననాసికేతర వర్గీయాక్షరములకు నాదహల్లు పరమగునపుడు

2 హలంత నపుంసక లింగశబ్దములకు 'ఇ' అను బహువచన సుప్ ప్రత్యయము పరమగునపుడు

3 శతృప్రత్యయాంత పుంలింగశబ్దములకు సర్వనామస్థానములు పరమగునపుడు

4 శతృప్రత్యయాంత నపుంసకలింగ శబ్దములకు ఈ' అను ద్వివచన ప్రత్యయము పరమగునపుడు

5 మతుప్ ప్రత్యయాంతపుంలింగశబ్దములకు ప్రథమైకవచన ప్రత్యయము పరమగునపుడు

6 మహత్ శబ్దమునకు సర్వనామస్థానములు పరమగునపుడు

క్రింది వాక్యములను సంస్కృతీకరించుడి

ధైర్యవంతులను ప్రజలు మెచ్చుకొందురు

రాతిమీద కూర్చొనియున్న మృగమును చూచితివి

శరత్కాలముయొక్క రాత్రులందు బాలురు వెన్నెలలో ఆడుకొందురు

రోగముచే పీడింపబడుచున్నవానిని చూచుటకు వైద్యుడు (భిషజ్) వచ్చెను
పురాణములు సుహృదులతో సమానములుగ పరిగణింపబడుచున్నవి
ఘటములు మృత్తుయొక్క వికారములు
ఆపదలందు ధైర్యమును వహించువాడే ధీరుడు
తఱచుగా లోకమునందు సంపదను సంపద విపత్తును విపత్తు అనువర్తించుచుండును
వియత్తునందు ఆవరించిన జలముదమును చూచి క్రీడాంగణమునందు ఆడుచున్న బాలురు ఇండ్లకు పోయిరి
గొప్పవారు మధురమైన వాక్కులతో దీనులను ఊరడింతురు

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది

హిమవతా మహేశ్వరాయ పార్వతీ దత్తా
హనుమతా అబ్ధిర్లఙ్ఘితః లంకా దగ్ధా చ
బహుభిః మహద్భిః మహాన్తి కార్యాణి కృతాని
భూభృతా దుష్యన్తేన కణ్వస్యాశ్రమే శకున్తలా దృష్టా
బహూని కావ్యాని పఠితాని హరిణా
ఆపత్సు దేవేన రక్షితోఽభవమ్
పాణ్డవైః సహ ద్రౌపద్యాఽపి వనే బహవః క్లేశా అనుభూతాః
ధనికేన యాచకేభ్యో ధనం దత్తమ్
జనానాం పీడాః పరిహృతా ఈశ్వరేణ
కుమారీభిః పూజాయై కుసుమాన్యానీతాని

(ప్రయోగమును మార్చునపుడు క్త ప్రత్యయాంతమును క్తవతు ప్రత్యయాంతముగ మార్చవలెను
ఉదా - రామేణ కథాః కథితాః - రామః కథాః కథితవాన్)

ద్వాదశః పాఠః - పండ్రెండవ పాఠము

# నకారాంత శబ్దములు

---

నకారాంత పుంలింగము - 'ఆత్మ' శబ్దము

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | ఆత్మా | ఆత్మానౌ | ఆత్మానః |
| (సం ప్ర) | (హే) ఆత్మన్ | | ,, |
| (ద్వి వి) | ఆత్మానమ్ | ,, | ఆత్మనః |
| (తృ వి) | ఆత్మనా | ఆత్మాభ్యామ్ | ఆత్మభిః |
| (చ వి) | ఆత్మనే | ,, | ఆత్మభ్యః |
| (పం వి) | ఆత్మనః | | ,, |
| (ష వి) | ,, | ఆత్మనోః | ఆత్మనామ్ |
| (స వి) | ఆత్మని | ,, | ఆత్మసు |

సూ - 32 సర్వనామస్థానే చా సంబుద్ధౌ (పా సూ) = సంబోధనైక వచనముతప్ప తక్కిన సర్వనామ స్థానములు పరమగు నపుడు నకారాంతశబ్దముల ఉపధయగు అకారమునకు దీర్ఘము వచ్చును

ఉదా - ఆత్మన్ + స్ = ఆత్మాన్ + స్ = ఆత్మాన్ (సూ-33)

సూ - 33 ప్రథమైకవచనమునందును, హలాదివిభక్తులు పరమగు నపుడును (నకారాంత శబ్దముల) నకారమునకు లోపము వచ్చును కాని సంబోధనమునందు రాదు

ఉదా - ఆత్మాన్ = ఆత్మా

ఆత్మన్+ఔ=ఆత్మానౌ (సూ- 32) ఆత్మన్ + అస్=ఆత్మానః (సూ- 32, 20) (హే) ఆత్మన్ + స్ = (హే) ఆత్మన్ (సూ-83) ఆత్మన్ + అమ్ = ఆత్మానమ్ (సూ- 32) ఆత్మన్ + అస్ = ఆత్మనః (సూ-20)

ఆత్మన్+భ్యామ్=ఆత్మభ్యామ్ ఆత్మన్+భిస్=ఆత్మభిః (సూ-20)
ఆత్మన్+భ్యస్=ఆత్మభ్యః (సూ-20) ఆత్మన్+సు=ఆత్మసు

సూ - 34 అల్లోపోఽనః (పా సూ) = అసర్వనామస్థానాజాది ప్రత్యయములు పరమగునపుడు చివరి 'అన్' అనుదానిలో గల అకారమునకు లోపము వచ్చును

ఉదా - రాజన్ + అస్ = రాజ్ న్ + అస్ = రాజ్ఞః (సూ-97 20)
రాజన్ + ఆ = రాజ్ న్ + ఆ = రాజ్ఞా (సూ-97)

సూ - 35 విభాషా జిశ్యోః (పా సూ) = సప్తమీ ఏకవచన ప్రత్యయము పరమగునపుడు నపుంసకలింగ శబ్దముల ప్రథమా ద్వితీయా ద్వివచన ప్రత్యయమగు ఈ అనునది పరమగునపుడును అన్ దానిలో అకారలోపము వికల్పముగా వచ్చును

ఉదా - రాజన్ + ఇ = రాజ్ న్ + ఇ = రాజ్ఞి (సూ-97)
(లేక) రాజన్ + ఇ = రాజని

నకారాంత పుంలింగము - రాజన్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | రాజా | రాజానౌ | రాజానః |
| (సం ప్ర) | (హే) రాజన్ | , | , |
| (ద్వి వి) | రాజానమ్ | , | రాజ్ఞః |

| | | | |
|---|---|---|---|
| (తృ వి) | రాజ్ఞా | రాజభ్యామ్ | రాజభిః |
| (చ వి) | రాజ్ఞేః | ,, | రాజభ్యః |
| (పం వి) | రాజ్ఞః | , | ,, |
| (ష వి) | | రాజ్ఞోః | రాజ్ఞామ్ |
| (స వి) | రాజ్ఞి రాజని | ,, | రాజసు |

సూ - 136 న సంయోగాద్వమన్తాత్ (పా సూ) = వకార మకారాంత సంయోగముకంటె పరమయిన 'అన్' అనుదావిలోని అకారమునకు లోపమురాదు

ఉదా - యజ్వన్+అ=యజ్వనా ఆత్మన్+అ=ఆత్మనా.

నకారాంత నపుంసకలింగము - నామన్' శబ్దము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | నామ | నామ్నీ, నామనీ | నామాని |
| (సం ప్ర) | (హే)నామన్<br>(హే)నామ | ,, | ,, |
| (ద్వి వి) | నామ | | ,, |

నామన్ + స్ = నామ (సూ - 70 193)

నామన్ + ఈ = నామ్నీ నామనీ (సూ- 35) . నామన్ + ఇ = నామాని (సూ- 32)

సూ - 37 సమ్బుద్ధౌ నపుంసకానాం నలోపోవా వాచ్యః (వార్తికమ్) = సంబోధనైకవచనమునందు నపుంసకలింగశబ్దముల నకారమునకు వికల్పముగా లోపము వచ్చును

ఉదా - (హే) నామన్ హేనామ

నకారాంత శబ్దములలో చివరి నకారమునకు ముందు అకారము కల వానిని అన్నంత శబ్దములుగను ఇకారము కలవానిని ఇన్నంత శబ్దములుగను పేర్కొనవచ్చును ఇంతకు ముందు పేర్కొనబడినవి అన్నంత శబ్దములు ఇకమీద ఇన్నంతశబ్దములు పేర్కొనబడును

నకారాంత పుంలింగము – గుణిన్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | గుణీ | గుణినౌ | గుణినః |
| (సం. ప్ర) | (హే) గుణిన్ | | |
| (ద్వి వి) | గుణినమ్ | | |
| (తృ వి) | గుణినా | గుణిభ్యామ్ | గుణిభిః |
| (చ వి) | గుణినే | | గుణిభ్యః |
| (పం వి) | గుణినః | , | |
| (ష వి) | | గుణినోః | గుణినామ్ |
| (స వి) | గుణిని | , | గుణిషు |

సూ – 138 పుంలింగమునందు ప్రథమైకవచన ప్రత్యయము పరమగునపుడు నపుంసకలింగమునందు ప్రథమా ద్వితీయా బహువచన ప్రత్యయములు పరమగునపుడును ఇన్నంత శబ్దముల ఉపధయగు ఇకారమునకు దీర్ఘము వచ్చును

గుణిన్ + స్ = గుణీన్ + స్ = గుణీన్ (సూ–83) = గుణీ (సూ– 39)
(హే) గుణిన్ + స్ = (హే) గుణిన్ (సూ–83)
గుణిన్ + భ్యామ్ = గుణిభ్యామ్ (సూ– 3 )
గుణిన్ + సు = గుణి + సు (సూ– 33) = గుణిషు (సూ–44)

నకారాంత శబ్దములకు 'ఈ' అను స్త్రీ ప్రత్యయమును చేర్చుటచే స్త్రీలింగ శబ్దరూపము లేర్పడును అప్పుడవి ఈకారాంత శబ్దములగును

ఉదా – గుణిన్+ఈ=గుణినీ యశస్విన్+ఈ=యశస్వినీ

వకారాంత నపుంసకలింగము - గుణిన్ శబ్దము

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | గుణి | గుణినీ | గుణీని |
| (సం ప్ర) | (హే)గుణిన్ (హే)గుణి | ,, | ,, |
| (ద్వి వి) | గుణి | ,, | ,, |

గుణిన్ + స్ = గుణి (సూ-70, 133)

గుణిన్ + ఈ = గుణినీ  గుణిన్ + ఇ = గుణీని (సూ- 38)

(హే) గుణిన్ + స్ = (హే) గుణిన్, (హే) గుణి (సూ-70, 137)

మతుబర్థమునందు వచ్చిన ఇని, విని, గ్మిని, అమివచ్ అను తద్ధిత ప్రత్యయములు అంతమందుగల శబ్దములన్నియు ఇన్నంతములే యగును ఉదా - గుణిన్ యశస్విన్, వాగ్గ్మిన్ స్వామిన్)

కృదంతములలో 'ణిని ప్రత్యయాంతశబ్దములు ఇన్నంతములు

ఉదా:- విజయిన్ అర్థిన్.

పుంలింగము:-

బ్రహ్మన్ = బ్రహ్మ

అశ్మన్ = రాయి

ఆత్మన్ = తాను

యజ్వన్ = యాగముచేయువాడు

శాఖిన్ = చెట్టు

ప్రాణిన్ = ప్రాణి

చక్రవర్తిన్ = చక్రవర్తి

ఆహారః = ఆహారము

పరోపకారః = పరోపకారము

మూర్ధన్ = తల

పక్షిన్ = పక్షి

మహాత్మన్ = (గొప్ప ఆత్మకల వాడు) గొప్పవాడు

విద్యార్థిన్ = విద్యార్థి

శిఖరిన్ = పర్వతము

రాజన్ = రాజు

యోగిన్ = యోగి

అనర్థః = కీడు

స్త్రీలింగము -

సీమన్ = పరిహద్దు
దామన్ = త్రాడు
జనిః = పుట్టుక

నపుంసకలింగము -

కర్మన్ = పని
నామన్ = పేరు
ఆజ్యమ్ = నేయి
బ్రహ్మన్ = పరబ్రహ్మము

విశేషణములు -

భావిన్ = జరుగబోవునట్టి
అనుజీవిన్ = అనుసరించి జీవించునట్టి సేవకుడైన
మేధావిన్ = బుద్ధికల
ధనిన్ = ధనముకల
అపరాధిన్ = అపరాధముకల
గుణిన్ = గుణముకల
బలిన్ = బలముకల
బన్ధ్+త=బద్ధ=బంధింపబడిన
అతి + క్రమ్ + తవత్ = అతిక్రాన్తవత్ = అతిక్రమించిన
నిర్ + మా + త = నిర్మిత = నిర్మింపబడిన
అభి + అస్ + య + అత్ = అభ్యస్యత్ = అభ్యసించుచున్న
విద్యా + అర్థ్ + ఇన్ = విద్యార్థిన్ = విద్యనుకోరునట్టి
చక్ర + వృత్ + ఇన్ = చక్రవర్తిన్ = చక్రవర్తియైన

అవ్యయములు -

ఉద్ + దిశ్ + య = ఉద్దిశ్య = ఉద్దేశించి
అవ + గమ్ + తుమ్ = అవగన్తుమ్ = తెలిసికొనుటకు
జీవ్ + తుమ్ = జీవితుమ్ = జీవించుటకు

క్రియాపదములు -

ఉప + ఈక్ష్ = ఉపేక్షించు - (లట్) ఉపేక్షతే (లఙ్) ఉపైక్షత (లోట్) ఉపేక్షతామ్

వి+అవ+హృ=వ్యవహరించుట (కర్మణి-లట్)వ్యవహ్రియతే (లఙ్)
వ్యవాహ్రియత (లోట్) వ్యవహ్రియతామ్

బ్రహ్మణః ప్రజాః ప్రజాయన్తే
అశ్మనా నిర్మితమివ ఖలానాం హృదయం కఠినం వర్తతే
దుష్యన్తస్య పుత్త్రో, నామ్నా భరతః
సురభీణి కుసుమాని మూర్ధ్ని ధరన్తే నార్యః
ఆత్మనో గుణాన్ మా కత్థస్వ
సీమాన మతిక్రాన్తవత శ్శత్రూన్ మోపేక్షస్వ
దామ్నా ఉలూఖలే బద్ధః కృష్ణః
పరోపకారాయ మహాత్మనాం జనిః
యజ్వభి ర్దేవానుద్దిశ్యాజ్యం హుతభుజి ప్రాస్యతే
విద్యామభ్యస్యన్తో బాలా విద్యార్థిన ఇతి వ్యవహ్రియన్తే
ఆహారం వినా ప్రాణినో జీవితుం న ప్రభవన్తి
భావినోఽనర్థాన్ అపగన్తుం న ప్రభవన్తి నరాః
ఆయుష్మాన్ భవ రాజన్ చక్రవర్తినం పుత్త్రంచ లభస్వ
ధనినాం గృహేష్వనుజీవినః కర్మాణ్యాచరన్తి
యోగినః శిఖరిషు నివసన్తి
పక్షిణో వియత్యుడ్డయన్త
మేధావిభ్యో విద్యార్థిభ్యః పారితోషికాని దీయన్తే
శాఖిభ్యః ఫలాని పుష్పాణిచ లభామహే
అపరాధినో జనాన్ దణ్డయన్తు రాజానః
గుణిషు గుణాఏవ పూజాయాః స్థానం భవన్తి
బలిభి ర్యుద్ధేషు శత్రవో జీయన్తే

## సకారాంత శబ్దములు

సంస్కృతభాషలోని సకారాంతశబ్దములను మూడురకములుగా విభజింపవచ్చును ) క్వసుప్రత్యయాంత శబ్దములు (లేక) క్వసంత శబ్దములు 2) ఈయసున్ ప్రత్యయాంత శబ్దములు (లేక) ఈయసంత-శబ్దములు 3) కేవల సకారాంత శబ్దములు (అనగా పై రెండును కాక తక్కిన సకారాంత శబ్దములు )

### కేవల సకారాంత శబ్దములు

సూ - 39 ప్రథమైకవచన సుప్ ప్రత్యయము పరమగునపుడు సకారాంత పుంలింగ స్త్రీలింగ శబ్దముల ఉపధయగు అకారమునకు దీర్ఘము వచ్చును కాని సంబోధనమునందు రాదు

ఉదా - చన్ద్రమస్ + స్ = చన్ద్రమాస్ + స్ = చన్ద్రమాస్ (సూ-83) - చన్ద్రమాః (సూ-20)

(హే) చన్ద్రమస్+స్=(హే) చన్ద్రమః (సూ-83 20)

సూ - 40 హలాదివిభక్తి ప్రత్యయములు పరమగునపుడు సకారమునకు విసర్గాదేశమగును

ఉదా - చన్ద్రమస్ + భ్యామ్ = చన్ద్రమః + భ్యామ్ = చన్ద్రమోభ్యామ్ (సూ-3 27) చన్ద్రమస్ + సు = చన్ద్రమః + సు = చన్ద్రమస్సు (లేక) చన్ద్రమఃసు (సూ-46)

సకారాంత పుంలింగము - 'చంద్రమస్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | చన్ద్రమాః | చన్ద్రమసౌ | చన్ద్రమః |
| (సం ప్ర) | (హే) చన్ద్రమః | | , |
| (ద్వి వి) | చన్ద్రమసమ్ | ,, | |

| | | | |
|---|---|---|---|
| (తృ వి) | చన్ద్రమసా | చన్ద్రమోభ్యామ్ | చన్ద్రమోభిః |
| (చ వి) | చన్ద్రమసే | ,, | చన్ద్రమోభ్యః |
| (పం వి) | చన్ద్రమసః | ,, | , |
| (ష వి) | ,, | చన్ద్రమసోః | చన్ద్రమసామ్ |
| (స వి) | చన్ద్రమసి | ,, | చన్ద్రమఃసు<br>చన్ద్రమస్సు |

కేవల సకారాంత పుంలింగ శబ్దములకు స్త్రీలింగ శబ్దములకును ఒకేవిధముగ సుబన్తరూప నిష్పత్తి కలుగును

సకారాంత స్త్రీలింగము - ${}^{*}$సుమనస్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | సుమనః | సుమనసౌ | సుమనసః |
| (సం ప్ర) | (హే) సుమనః | , | ,, |
| (ద్వి. వి) | సుమనసమ్ | , | , |
| (తృ వి) | సుమనసా | సుమనోభ్యామ్ | సుమనోభిః |

సూ - 141 ఇకార ఉకారములు ఉపధగాగల సకారాంత శబ్దముల చివరి సకారమునకు అజాది ప్రత్యయములు పరమగునపుడు షకారాదేశమును, హలాది ప్రత్యయములు పరమగునపుడు రేఫాదేశమును వచ్చును

ఉదా - అర్చిస్ + ఔ = అర్చిషౌ అర్చిస్ + భ్యామ్ = అర్చిర్భ్యామ్.

ఇకారాంత స్త్రీలింగము - ${}^{*}$అర్చిప్ శబ్దము

| | ఏక | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | అర్చిః | అర్చిషౌ | అర్చిషః |
| (సం ప్ర) | (హే) అర్చిః | ,, | , |
| (ద్వి వి) | అర్చిషమ్ | ,, | అర్చిషః |

| | | | |
|---|---|---|---|
| (తృ వి) | అర్చిషా | అర్చిర్భ్యామ్ | అర్చిర్భిః |
| (చ వి) | అర్చిషే | ,, | అర్చిర్భ్యః |
| (పం వి) | అర్చిషః | ,, | |
| (ష వి) | ,, | అర్చిషోః | అర్చిషామ్ |
| (స వి) | అర్చిషి | , | అర్చిఃషు / అర్చిష్షు |

అర్చిస్ + స్ = అర్చిః (సూ-83, 20)

సూ - 142 నుమ్ విసర్జనీయశర్వ్యవాయేఽపి (పా సూ) = ఇణ్ణులకు కవర్గాక్షరములకు ఆదేశప్రత్యయ సకారమునకును నడుమ నుమాగమ స్థానమున వచ్చిన అనుస్వారముగాని విసర్గగాని శర్వర్ణముగాని ఉన్నప్పటికిని సకారమునకు షకారాదేశము వచ్చును

ఉదా - అర్చిస్ + సు = అర్చిర్ + సు = అర్చిఃసు (సూ-84) = అర్చిఃషు (లేక) అర్చిష్షు (సూ-46)

సకారాంత నపుంసకలింగము - 'మనస్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | మనః | మనసీ | మనాంసి |

మనస్ + స్ = మనః (సూ-70 20)

సూ - 43 సకారాంత నపుంసకలింగ శబ్దములకు 'ఇ' అను సుప్ ప్రత్యయము పరమగునపుడు ఉపధకు దీర్ఘము చివరి సకారమునకుముందు నకారాగమమును వచ్చును

ఉదా - మనస్+ఇ = మనాన్స్ + ఇ = మనాంసి (సూ- 9) తృతీయాది విభక్తులలో పుంలింగ శబ్దములకువలెనే సుబంతరూప నిష్పత్తి కలుగును

### సకారాంత నపుంసకలింగము – 'అర్చిస్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | అర్చిః | అర్చిషీ | అర్చీంషి |

తృతీయాది విభక్తులలో స్త్రీలింగమందలి 'అర్చిస్' శబ్దరూపముల వలెనే యుండును

అర్చిస్+స్ = అర్చిః (సూ-70, 20) అర్చిస్ + ఈ = అర్చిషీ (సూ- 4 ) అర్చిస్ + ఇ = అర్చీంషి (సూ- 4 , 43 19)

### సకారాంత నపుంసకలింగము – 'ధనుస్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | ధనుః | ధనుషీ | ధనూంషి |

(అర్చిస్ శబ్దరూపములవలెనే ధనుస్ శబ్దరూపముల నిష్పత్తిగూడ ఊహింపదగును )

## ఈయసున్ ప్రత్యయాంత శబ్దములు

రెండు పదార్థములను పరిపోల్చునపుడు అతిశయ విశిష్టార్థమునందు 'ఈయస్' అనునదిచేరి ఈయసున్ ప్రత్యయాంతమగు తద్ధితాంత శబ్దరూప మేర్పడును (ఈయసున్ ప్రత్యయము చేరునపుడు కలుగు వ్యాకరణ కార్యములు ముమ్ముందు వివరింపబడును )

### సకారాంత పుంలింగము – 'శ్రేయస్' శబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | శ్రేయాన్ | శ్రేయాంసౌ | శ్రేయాంసః |
| (సం ప్ర) | (హే) శ్రేయన్ | ,, | ,, |
| (ద్వి వి) | శ్రేయాంసమ్ | ,, | శ్రేయసః |

| | | | |
|---|---|---|---|
| (తృ వి) | శ్రేయసా | శ్రేయోభ్యామ్ | శ్రేయోభిః |
| (చ వి) | శ్రేయసే | ,, | శ్రేయోభ్యః |
| (పం వి) | శ్రేయసః | | ,, |
| (ష వి) | ,, | శ్రేయసోః | శ్రేయసామ్ |
| (స వి) | శ్రేయసి | ,, | శ్రేయస్సు<br>శ్రేయఃసు |

సూ - 44 'క్వసం' తశబ్దములకు 'ఈయసం' తశబ్దములకు సర్వనామస్థానములు పరమగునపుడు ఉపధయగు అకారమునకు దీర్ఘము చివరి సకారమునకుముందు నకారాగమమును వచ్చును సంబోధనైక వచనమునందు నకారాగమము మాత్రమే వచ్చును ఉపధాదీర్ఘము రాదు

ఉదా - శ్రేయస్ + స్ = శ్రేయోన్స్ + స్ = శ్రేయాన్ (సూ-83, 23)
శ్రేయస్ + ఔ = శ్రేయాన్స్ + ఔ = శ్రేయాంసౌ (సూ-119)
శ్రేయస్ + అ స్ = శ్రేయాన్స్ + అస్ = శ్రేయాంసః (సూ- 19, 20)
(హే) శ్రేయస్ + స్ = (హే) శ్రేయన్స్ + స్ = (హే) శ్రేయన్ (సూ-83, 123)

ఈయసున్ ప్రత్యయాంత శబ్దములకు ఈ అను స్త్రీప్రత్యయమును చేర్చుటచే స్త్రీలింగ శబ్దరూపము లేర్పడును కావున అప్పుడు ఈకారాంత శబ్దము లగును

ఉదా - శ్రేయస్+ఈ=శ్రేయసీ లఘీయస్+ఈ=లఘీయసీ

నపుంసకలింగమునందు కేవల సకారాంత శబ్దములకు, ఈయసున్ ప్రత్యయాంత శబ్దములకును సుబంతరూపములు ఒకేవిధముగ నిష్పన్నములగును

ఉదా - శ్రేయః - శ్రేయసీ - శ్రేయాంసి

## కృదంతములు - క్వసుప్రత్యయాంతములు

పరస్మైపది ధాతువులకు భూతార్థమునందు 'వస్' అనునది చేరి క్వసు ప్రత్యయాంతరూపము లేర్పడును ఇది కర్త్రర్థమునందు చేయును కొన్ని ధాతువులకంటె పరమగునపుడు 'వస్ అను దానికి ముందు ఇకారాగమము (ఇడాగమము) వచ్చును (ఈ క్వసు ప్రత్యయము చేరు నపుడు కలుగు వ్యాకరణకార్యములు మున్ముందు పేర్కొనబడును )

ఉదా - స్థా+వస్=తస్థివస్=నిలబడిన ఉన్న దా+వస్=దదివస్=
ఇచ్చిన

విద్ ధాతువుకంటె పరమయిన శతృప్రత్యయమునకు వికల్పముగా 'వస్ అను ఆదేశమువచ్చి 'విద్వస్' అను రూపమేర్పడును కావున ఇది క్వసు ప్రత్యయాంతముకాదు కాని దీనికిని క్వసు ప్రత్యయాంతములకును సుబంతరూపములు ఒకేవిధముగ నిష్పన్నములగును

సకారాంత పుంలింగము - 'విద్వస్' శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | విద్వాన్ | విద్వాంసౌ | విద్వాంసః |
| (సం. ప్ర) | (హే) విద్వన్ | | ,, |
| (ద్వి వి) | విద్వాంసమ్ | | విదుషః |
| (తృ వి) | విదుషా | విద్వద్భ్యామ్ | విద్వద్భిః |
| (చ వి) | విదుషే | ,, | విద్వద్భ్యః |
| (పం వి) | విదుషః | ,, | ,, |
| (ష వి) | ,, | విదుషోః | విదుషామ్ |
| (స వి) | విదుషి | ,, | విద్వత్సు |

విద్వస్ + స్ =విద్వాన్స్+స్(సూ- 44)=విద్వాన్ (సూ-83, 23)
విద్వస్+ఔ=విద్వాన్స్ + ఔ (సూ- 44)= విద్వాంసౌ (సూ-1 9)
విద్వస్ + అస్ = విద్వాన్స్ + అస్ (సూ - 144) = విద్వాంసః
(సూ-1 9, 30) (హే) విద్వస్ + స్ = (హే) విద్వన్స్ + స్
(సూ- 44) = (హే) విద్వన్ (సూ-83, 2౦)

సూ - 145 'క్వసం తశబ్దములకు అసర్వనామ స్థానములలో అజాది ప్రత్యయములు పరమగునపుడు 'నపుంసకలింగమునందు ప్రథమా ద్వితీయా విభక్తుల ద్వివచన ప్రత్యయమగు ఈకారము పరమగునపుడు ఈ' అను స్త్రీ ప్రత్యయము పరమగునపుడును వస్ అనుచోటనున్న వ అను దానికి ఉకారాదేశము వచ్చును అప్పుడు దానికి ముందున్న ఇడాగమము లోపించును

ఉదా - విద్వస్ + అస్=విదుస్ + అస్ = విదుష్ + అస్ (సూ-44)
=విదుషః (సూ-20) విద్వస్ + ఆ = విదుస్ + ఆ =
విదుషా (సూ-44)

సూ - 146 క్వసం'తశబ్దములకు అసర్వనామస్థాన హలాది ప్రత్యయములు పరమగునపుడు నపుంసకలింగమునందు ప్రథమైకవచన ప్రత్యయము పరమగునపుడును సకారమునకు దకారాదేశమగును

ఉదా - విద్వస్ + భ్యామ్ = విద్వద్భ్యామ్, విద్వస్ + సు = విద్వద్ +సు
= విద్వత్సు (సూ- 6)

'క్వసం'తశబ్దములకు 'ఈ అను స్త్రీప్రత్యయమును చేర్చుటచే స్త్రీలింగ శబ్దరూపము లేర్పడును అప్పుడవి ఈకారాంత శబ్దములగును
ఉదా - విద్వస్ + ఈ = విదుషీ (సూ- 44 44)

## సకారాంత నపుంసకలింగము - విద్వస్ శబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర సం ద్వి) | విద్వత్<br>విద్వద్ | విదుషీ | విద్వాంసి |

విద్వస్ + స = విద్వద్ + స్ (సూ- 46) = విద్వత్, విద్వద్
(సూ-70, 85),
విద్వస్+ఈ=విదుస్+ఈ (సూ- 45) = విదుషీ (సూ-44)
విద్వస్+ఇ=విద్వాన్స్+ఇ (సూ- 44) = విద్వాంసి (సూ- 9)

### పుంలింగము -

దుర్వాసస్ = దుర్వాసుడు
విక్రమః = పరాక్రమము
స్నేహః = కలయిక, స్నేహము
స్వదేశః = తనదేశము
ప్రణామః = నమస్కారము

### స్త్రీలింగము:-

సుమనస్ = పుష్పము, జాజి
అభిరుచిః = ఇష్టము
వాక్పటుతా = మాటలనేర్పు
దృష్టిః = చూపు
దణ్డకా = దండకారణ్యము
ఇచ్ఛా = కోరిక
యుధ్ = యుద్ధము
క్షమా = ఓరిమి
శ్రుతిః = వేదము వినికిడి
యమునా = యమునానది
ద్వారకా = ద్వారకానగరము
సదస్ (స్త్రీ)<br>సదస్ (న) = సభ

### నపుంసకలింగము -

యశస్ = కీర్తి
శిరస్ = తల
ఉరస్ వక్షస్ = వక్షఃస్థలము
వయస్ = వయస్సు పక్షి

వచస్ = మాట

పయస్ = నీరు, పాలు

తేజస్ = తేజస్సు

తపస్ = తపస్సు

జాను (న)
జానుః (పుం) } = మోకాలు

వ్యసనమ్ = వ్యసనము, దుఃఖము

అమ్బస్ = నీరు

సరస్ = సరస్సు

రక్షస్ = రాక్షసుడు

పూజాస్థానమ్ = పూజకు స్థానము

## విశేషణములు -

విద్వస్ = పాండిత్యముకల

పీల = పల్లని

ప్రకృతిసిద్ధ = సహజసిద్ధమైన

శ్వేత = తెల్లని

తడ్ + త = తాడిత = కొట్టబడిన

సమ్ + తప్ + త = సన్తప్త = బాగుగా తపించిన

జన్ + త = జాత = పుట్టిన

స్థా + వస్ = తస్థివస్ = ఉన్న

అధి + వస్ + వస్ = అధ్యూషివస్ = అధివసించిన, నివసించిన

గురు + ఈయస్ = గరీయస్ = పెద్ద గొప్ప, బరువైన

బల + ఈయస్ = బలీయస్ = బలవత్తరమైన

అణు + ఈయస్ = అణీయస్ = సూక్ష్మతరమైన

మహత్ + ఈయస్ = మహీయస్ = పెద్ద గొప్ప, మహత్తరమైన

అగోచర = గోచరముకాని

## అవ్యయములు -

ఉప + విశ్ + య = ఉపవిశ్య = కూర్చొని

పురా = పూర్వము

అథ = తరువాత

## క్రియాపదములు -

వి + క్రమ్ = విక్రమించుట - (లట్) విక్రామ్యతి (లఙ్) వ్యక్రామ్యత్ (లోట్) విక్రామ్యతు

'స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే

'విపది ధైర్యమథాభ్యుదయే క్షమా, సదసి వాక్పటుతా, యుధి విక్రమః
యశసిచాభిరుచి ర్వ్యసనం శ్రుతౌ, ప్రకృతి సిద్ధమిదం హి మహాత్మనామ్

పాదాభ్యాం జానుభ్యాం పాణిభ్యామ్ ఉరసా శిరసా వచసా బుద్ధ్యా దృష్ట్యాచ
    కృతః ప్రణామః సాష్టాంగప్రణామ ఇతి కథ్యతే

'గుణాః పూజాస్థానం గుణిషు నచ లిఙ్గం నచ వయః'

భీమేవ వక్షసి తాడితః కీచకోఽముహ్యత్

సుమనసాం సఙ్గాత్ కీటోఽపి సతాం శిర ఆరోహతి

యమునాయాః పయాంసి నీలాని

గజాయాః అమ్బూంసి శ్వేతాని

దుర్వాసాః కణ్వస్యాశ్రమే శకున్తలామ్ అశపత్

సూర్యస్యతేజసా సన్తప్తా జనా వృక్షాణాం ఛాయాసూపవిశ్య విశ్రామ్యన్తి

సరసి జాతాని పద్మా సరసిజానీతి వ్యవహ్రియన్తే

ఋషీణాం తప ఏవ పరమం ధనమ్ అతస్తే తపోధనా ఇతి కథ్యన్తే

సమరాఙ్గణే తస్మిన్ కౌరవాణాం సైన్యం దృష్ట్వాభీతోఽభవ దుత్తరః

పురా దణ్డకాయాం బహూని రక్షాంసి న్యవసన్

పరమాత్మాఽణోరణీయాన్ మహతో మహీయానితి వర్ణ్యతే

ద్వారకామ్ అధ్యుషితో జనస్య సమ్పదో వచసామ్ అగోచరా
    అభవన్ మతిరేవ బలాద్గరీయసీ

ఈశ్వరేచ్ఛా బలీయసీ

సూ - 47 ఉపాన్వధ్యాఙ్వసః (పా సూ) = ఉప అను అధి, ఆఙ్ - అను ఉపసర్గలతో కూడిన వస్ ధాతువు ప్రయోగింప బడి నపుడు ఆధారవాచకమునకు ద్వితీయావిభక్తి వచ్చును

ఉదా - ద్వారకాం అధ్యూషివాన్ = ద్వారకయందు నివసించినవాడు

# అభ్యాసము 12

సుబంతరూప విభక్తిలోగల భేదముబట్టి నకారాంత శబ్దముల నెన్ని రకములుగా విభజింపవచ్చునో పేర్కొనుమనది.

నకారాంతశబ్దముల నకారమునకు ఎచ్చటెచ్చట లోపముకలు కలుగునో సోదాహరణముగ వివరించునది

నకారాంత శబ్దములకు ఉపధాదీర్ఘము ఎచ్చటెచ్చట వచ్చునో సోదాహరణముగ వివరించునది.

ఏయే ప్రత్యయాంతములు ఇన్నంతశబ్దములగునో సోదాహరణముగ వివరించునది

సకారాంత శబ్దముల నెన్నిరకములుగా విభజింపవచ్చునో సోదాహరణముగ వివరించునది

నకారాంత శబ్దములకు ఉపధాదీర్ఘ మెచ్చటెచ్చట కలుగునో సోదాహరణముగ వివరించునది

ఇకార ఉకారములు ఉపధగాగల సకారాంత శబ్దముల సకారమునకు కలుగు మార్పులను సోదాహరణముగ వివరించునది

క్వసంత శబ్దముల సకారమున కెచ్చటెచ్చట దకారాదేశము వచ్చునో సోదాహరణముగ వివరించునది

నకారాంత విశేషణ శబ్దములకు, ఈయసంత విశేషణ శబ్దములకు క్వసంత విశేషణ శబ్దములకును స్త్రీలింగరూపము లెట్లేర్పడునో సోదాహరణముగ వివరించునది

క్రింది పాణినీయ సూత్రముల యర్థములను సోదాహరణముగ నిరూపించునది

1 సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ 2 అల్లోపోఽనః 3 విభాషాఙిశ్యోః 4 నసంయోగాద్వమన్తాత్ 5 సంబుద్ధౌ నపుంసకానాం నలోపో వా వాచ్యః (వా) 6 నుమ్ విసర్జనీయ శర్ వ్యవాయేఽపి

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది –

అపరాధినః పురుషాన్ దణ్డయన్తు రాజానః
ప్రాణినా ముపకారాయైవ మహాత్మానో జగతి జీవన్తి
రామో దణ్డకాయాం బహూని రక్షాంసి సమహరత్
విద్వాంసో లోకే మహద్యశో లభన్తే
అనుజీవినో స్స్వామినం సేవన్తే
మేధావీ ప్రజాభిః శ్లాఘ్యతే
పక్షిణో రాత్రౌ శాఖిషు వసన్తి
బలీయాన్ రాజా యుధి జయ మధిగచ్ఛతి
ఉద్యానే వృక్షాన్ సుమనసో భూషయన్తి వసన్తే
జనానాం హితాయ యతమానా రాజానః క్లేశాన్ న పరిగణయన్తి
బ్రహ్మ ప్రజాః సృజతి
ప్రాణిభి రమ్భాంసి పీయన్తే
యజ్వభి రగ్నౌ ఘృతం ప్రాస్యతే



త్రయోదశః పాఠః - పదమూడవ పాఠము

# సర్వనామ శబ్దములు

---

సూ - 48 సర్వాదీని సర్వనామాని (పా సూ) = సర్వ' మున్నగు శబ్దములు సర్వనామము లనబడును

సర్వ, విశ్వ ఉభ, అన్య, అన్యతర, ఇతర, త్యద్, తద్, యద్, ఏతద్ ఇదమ్, అదస్, ద్వి, ఏక, యుష్మద్, అస్మద్ - మున్నగు శబ్దములు డతర డతమ ప్రత్యయాంతములగు కతర కతమ - మున్నగు శబ్దములును సర్వాదులు

అకారాంత పుంలింగము - సర్వశబ్దము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (ప్ర వి) | సర్వః | సర్వౌ | సర్వే |
| (సం ప్ర) | (హే) సర్వ | ,, | |
| (ద్వి వి) | సర్వమ్ | ,, | సర్వాన్ |
| (తృ వి) | సర్వేణ | సర్వాభ్యామ్ | సర్వైః |
| (చ వి) | సర్వస్మై | ,, | సర్వేభ్యః |
| (పం వి) | సర్వస్మాత్ | ,, | ,, |
| (ష వి) | సర్వస్య | సర్వయోః | సర్వేషామ్ |
| (స వి) | సర్వస్మిన్ | ,, | సర్వేషు |

సూ - 4 పుంలింగ సర్వనామ శబ్దములకు చతుర్థీ, పంచమీ సప్తమీ విభక్తుల ఏకవచనములందు వరుసగా స్మై, స్మాత్, స్మిన్ - అను సుప్ ప్రత్యయములు, ప్రథమా, షష్ఠీ విభక్తుల బహు

వచనములందు వరుసగా ఈ, సామ్ - అను సుప్ ప్రత్యయములను చేరును నామ్ ప్రత్యయము పరమగునపుడు దానికి ముందున్న అకారమునకు ఏకారాదేశము వచ్చును

ఉదా - సర్వ+స్మై=సర్వస్మై . సర్వ+స్మాత్=సర్వస్మాత్
సర్వ+స్మిన్=సర్వస్మిన్ సర్వ+ఈ=సర్వే (సూ-27)
సర్వ+నామ్=సర్వే+నామ్=సర్వేషామ్ (సూ-44)

తక్కినచోట్ల అకారాంత పుంలింగశబ్దమునకు (బాలశబ్దమునకు) వలెనే సుబంతరూపములు నిష్పన్నములగును (ఇట్లే విశ్వ మున్నగు అకారాంత పుంలింగ సర్వనామములకుగూడ సుబంతరూపముల నూహించునది )

అకారాంత సర్వనామములకు అ అను స్త్రీ ప్రత్యయము చేరుటచే స్త్రీలింగ శబ్దరూపము లేర్పడును

ఉదా - సర్వ + అ = సర్వా

అకారాంత స్త్రీలింగము - 'సర్వా' శబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ప్ర వి) | సర్వా | సర్వే | సర్వాః |
| (సం ప్ర) | (హే) సర్వే | , | , |
| (ద్వి వి) | సర్వామ్ | , | , |
| (తృ వి) | సర్వయా | సర్వాభ్యామ్ | సర్వాభిః |
| (చ వి) | సర్వస్యై | | సర్వాభ్యః |
| (పం వి) | సర్వస్యాః | , | , |
| (ష వి) | | సర్వయోః | సర్వాసామ్ |
| (స వి) | సర్వస్యామ్ | ,, | సర్వాసు |

సూ - 150 స్త్రీలింగ సర్వనామ శబ్దములకు చతుర్థీ ఏకవచనమున 'స్యై' పంచమీ, షష్ఠీ విభక్తుల ఏకవచనములందు 'స్యాః' సప్తమీ ఏకవచనమునందు 'స్యామ్', షష్ఠీ బహువచనమునందు 'సామ్' - అను ప్రత్యయములు చేరును ఇందలి ఏకవచన ప్రత్యయము (స్యై, స్యాః, స్యామ్ అను నవి) పరమగునపుడు ఆకారమునకు హ్రస్వము వచ్చును.

ఉదా - సర్వా + స్యై = సర్వస్యై. సర్వా + స్యాః = సర్వస్యాః. సర్వా+స్యామ్=సర్వస్యామ్. సర్వా+సామ్=సర్వాసామ్;

తక్కినచోట్ల ఆకారాంత స్త్రీలింగ శబ్దమునకు (లతాశబ్దమునకు) వలెనే సుబంతరూపములు నిష్పన్నములగును (ఇట్లే విశ్వా మున్నగు ఆకారాంత స్త్రీలింగ సర్వనామ శబ్దములకుగూడ సుబంత రూపముల నూహించునది)

అకారాంత నపుంసకలింగ సర్వనామ శబ్దములకు ప్రథమా ద్వితీయా విభక్తులయందు అకారాంత నపుంసకలింగ (ఫల) శబ్దమునకువలెను తృతీయాది విభక్తులలో అకారాంతా పుంలింగ సర్వనామ శబ్దమునకు (సర్వశబ్దమునకు) వలెను సుబంత రూపములు నిష్పన్నములగును

అకారాంత నపుంసకలింగము - సర్వశబ్దము

| | ఏక. | ద్వి. | బహు |
|---|---|---|---|
| (ప్ర. వి) | సర్వమ్ | సర్వే | సర్వాణి |
| (సం. ప్ర) | (హే) సర్వ | ,, | ,, |
| (ద్వి వి) | సర్వమ్ | ,, | ,, |
| (తృ వి) | సర్వేణ | సర్వాభ్యామ్ | సర్వైః |
| (చ వి) | సర్వస్మై | ,, | సర్వేభ్యః |

నపుంసకలింగమునందు అన్య, అన్యతర, ఇతర - అను శబ్దము లకు డతర డతమ ప్రత్యయాంతములగు కతర, కతమ - మున్నగు శబ్దములకును తకారమునుగాని దకారమునుగాని చేర్చుటచే ప్రథమా ద్వితీయా విభక్తుల యేకవచనాంతరూపము లేర్పడును తక్కినచోట్ల అకారంత నపుంసకలింగ 'సర్వ శబ్దమునకువలెనే సుబంతరూపములు నిష్పన్నములగును

(ప్ర. సం ద్వి) అన్యత్ } - అన్యే - అన్యాని
అన్యద్ }

ఏకతరశబ్దమునకు మాత్రము ప్రథమా ద్వితీయా విభక్తుల యేకవచనమునందు 'ఏకతరమ్ అనియే యుండును

ఉభశబ్దము నిత్యద్వివచనాంతము కావున దానికి ద్వివచనాంత రూపములు మాత్రమే యుండును.

అకారాంత పుంలింగము - ఉభశబ్దము

(ప్ర) ఉభౌ, (ద్వి) ఉభౌ, (తృ) ఉభాభ్యామ్, (చ) ఉభాభ్యామ్, (పం) ఉభాభ్యామ్, (ష) ఉభయోః (స) ఉభయోః

అకారాంత స్త్రీలింగము - ఉభశబ్దము

(ప్ర) ఉభే, (ద్వి) ఉభే, (తృ) ఉభాభ్యామ్ (చ) ఉభాభ్యామ్ (పం) ఉభాభ్యామ్, (ష) ఉభయోః (స) ఉభయోః

నపుంసకలింగమునందుగూడ ఉభశబ్దమునకు స్త్రీలింగమునందు వలెనే సుబంతరూపము లేర్పడును

సూ - 151 త్యదాదీనామః (పా సూ) = విభక్తి ప్రత్యయములు పరమగు నపుడు త్యదాదుల (త్యద్ మొదలు ద్విశబ్దమువరకు గల సర్వనామముల చివరి వర్ణమునకు అకార మాదేశమగును.

అప్పుడు దానికి ముందున్న అకారము లోపించి త్య త, య, ఏత ఇద అద ద్వ - అను ప్రాతిపదికరూపము లేర్పడు

సూ - 52 కిమః కః (పా సూ) = కిమ్శబ్దమునకు విభక్తి ప్రత్యయము పరమగునపుడు క అను ఆదేశము వచ్చును

ఈవిధముగ పై ప్రకృతులన్నియు అకారాంతములగుటచే వాని సుబంతరూపములు సర్వశబ్దమునకువలెనే నిష్పన్నములగును

సూ - 53 పుంలింగ స్త్రీలింగములయందు ప్రథమైకవచనమున 'తద్' శబ్ద తకారమునకు సకారము ఏతద్ శబ్ద తకారమునకు షకారమును ఆదేశమగును

ఉదా - త + స్ = సః ఏత + స్ = ఏషః

పుంలింగము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| (తద్శబ్దము) | సః | తౌ | తే |
| (యద్శబ్దము) | యః | యౌ | యే |
| (కిమ్శబ్దము) | కః | కౌ | కే |
| (ఏతద్శబ్దము) | ఏషః | ఏతౌ | ఏతే |

త్యదాదులకు సంబోధనమునందు ప్రయోగముండదు ద్వితీయాది విభక్తులలో సర్వశబ్దమునకువలెనే రూపముల నూహించునది

సూ - 54 ద్వితీయా టౌస్స్వేనః (పా సూ) = ద్వితీయా విభక్తి ప్రత్యయములు, తృతీయైకవచన ప్రత్యయము షష్ఠీ సప్తమీ విభక్తుల ద్వివచన ప్రత్యయములును పరమగునపుడు 'ఏతద్' 'ఇదమ్' శబ్దములకు అన్వాదేశమునందు వికల్పముగా ఏన అను ఆదేశము వచ్చును

ఉదా - ఏత + ఇన = ఏన + ఇన = ఏనేన (సూ-27)

'కించిత్కార్యం విధాతు ముపాత్తస్య కార్యాంతరం విధాతుం పునరుపాదానమ్ అన్వాదేశః'

(ఒక కార్యమును తెలుపుటకై ఒక వ్యక్తిని పేర్కొని ఆ వ్యక్తినే మరల మరియొక కార్యమునకై పేర్కొనుట అన్వాదేశమనబడును)

ఉదా - ఏతేన (అనేన) వ్యాకరణ మధీతమ్, ఏనం ఛన్దోఽధ్యాపయ

(ఈతనిచే వ్యాకరణము చదువబడినది - ఈతనిని ఛన్దస్సును చదివింపుము)

ఏతయోః (అనయోః) పవిత్రంకులమ్ ఏనయోః ప్రభూతం స్వమ్ (వీరిద్దరిది పవిత్రమైనకులము వీరిద్దరిది ఎక్కువధనము)

దకారాంతపుంలింగము - 'ఏతద్' శబ్దము

| | ఏక | ద్వి | బహు. |
|---|---|---|---|
| (ద్వి వి) | ఏతమ్<br>ఏనమ్ | ఏతౌ<br>ఏనౌ | ఏతాన్<br>ఏనాన్ |
| (తృ వి) | ఏతేన<br>ఏనేన | ఏతాభ్యామ్ | ఏతైః |
| (ష వి) | ఏతస్య | ఏతయోః<br>ఏనయోః | ఏతేషామ్ |
| (స వి) | ఏతస్మిన్ | ,, | ఏతేషు |

త్యదాదులు, కిమ్ శబ్దమును విభక్తి ప్రత్యయములు పరమగునపుడు అకారాంతములుగ మారుటచే వానికి 'ఆ' అను స్త్రీ ప్రత్యయముచేరి అకారాంత ప్రకృతు లేర్పడును. కావున వానికి సర్వాశబ్దమునకు వలెనే సుబంతరూపములు నిష్పన్నములగును.

సూ - 280 వీ అద్, ఖాద్ శబ్దాయ అను ధాతువుల ప్రయోగములో స్వార్థమునందలి కర్త ప్రేరణార్థమునందు కర్మకానేరదు

ఉదా - భృత్యో భారం నయతి - భృత్యేన భారం నాయయతి
బాలః అన్నం అత్తి (ఖాదతి) - బాలేన అన్నమ్ అదయతి (ఖాదయతి)
దేవదత్తః శబ్దాయతే - దేవదత్తేన శబ్దాయయతి

పుంలింగము

వంశః = వంశము
సంసారః = ప్రపంచము
కాపురుషః = కుత్సితపురుషుడు
దోషః = దోషము
కాచః = గాజు గాజుపూస
సమాగమః = కలయిక
దేశః = దేశము
అభ్యాగతః = అతిధి
పురుషసింహః = పురుషశ్రేష్ఠుడు
యత్నః = ప్రయత్నము
పురుషార్థః = పురుషప్రయత్నము
కాఞ్చనసంసర్గః=బంగారుతో కలయిక
కీటకః = పురుగు
సుమనస్స్రజః=పుష్పములతో కలయిక
కాలః = కాలము
ప్రాణాః = ప్రాణములు

స్త్రీలింగము.

పాత్రతా = పాత్రుడగుట
ద్యుతిః = కాంతి
మారకతీ = మరకతసంబంధమైన
సమున్నతిః = మిక్కిలియౌన్నత్యము
ప్రవీణతా = ప్రావీణ్యము

నపుంసకలింగము

దుష్కృతమ్ = చెడ్డపని పాపము
అన్తరమ్ = భేదము

విశేషణములు

పరివర్తిన్=తిరుగునట్టి మారునట్టి
దా+య=దేయ = ఇయ్యబడదగిన
ఉద్యోగిన్=ఉద్యోగముకలవాడు
మారకత = మరకతసంబంధియైన

వి+ధా+తవ్య=విధాతవ్య=చేయబడదగిన    భగ్నాశ=భగ్నమైన ఆశగల
మృ+త=మృత=మరణించిన    అనుపకారిన్=ఉపకారములేని
దా+తవ్య=దాతవ్య=ఇయ్యబడదగిన

అవ్యయములు

వి + హన్ + య = విహత్య = త్రోసిపుచ్చి    కాకతాళీయవత్=కాకతాళీయము(గా)వలె
అగ్రతః = ఎదుట
ఆ + దా + య = ఆదాయ = తీసికొని    దా + త్వా = దత్వా = ఇచ్చి

క్రియాపదములు

ఉప+ఇ=పొందుట (ఉపైతి ఉపైత్ ఉపైతు ఉపేయాత్)
ఆ+రుహ్=ఎక్కుట (ఆరోహతి ఆరోహత్ ఆరోహతు ఆరోహేత్)

విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్
పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మం తతః సుఖమ్
సజాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్
పరివర్తిని సంసారే మృతః కోవా న జాయతే
ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః
దైవేన దేయ మితి కాపురుషా వదన్తి
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః
కాకతాళీయవత్ ప్రాప్తం దృష్ట్వాఽపి నిధి మగ్రతః
న స్వయం దైవమాదత్తే పురుషార్థమపేక్షతే
కాచః కాఞ్చనసంసర్గా ద్ధత్తే మారకతీ ర్ద్యుతీః
తథా సత్సన్నిధానేన మూర్ఖోయాతి ప్రవీణతామ్
హీయతే హిమతిస్తాత హీనైః సహ సమాగమాత్
సమైశ్చ సమతామేతి విశిష్టైశ్చ విశిష్టతామ్

కీటోఽపి సుమనస్సంగా దారోహతి సతాం శిరః
అశ్మాఽపి యాతి దేవత్వం మహద్భిః సుప్రతిష్ఠితః
బాలో వా యది వా వృద్ధో యువా వా గృహమాగతః
తస్య పూజా విధాతవ్యా సర్వస్యాభ్యాగతో గురుః
అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే
స తస్మై దుష్కృతం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి
యోఽత్తి యస్య తదా మాంస ముభయోః పశ్యతాన్తరమ్
ఏకస్య క్షణికా ప్రీతి రన్యః ప్రాణై ర్విముచ్యతే
శిష్యాన్ ధర్మం బ్రవీతి గురుః (బ్రూ - ద్వికర్మకధాతువు)
గోపాలో ధేనుం పయో దోగ్ధి (దుహ్ )
మాణవకం ధర్మం శాస్తి గురుః (శాస్ )
జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్ధి రత్నం ప్రచక్షతే
దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశేకాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం విదుః

విద్ - ధాతువు అనేక గణములయందున్నది క్రింది శ్లోక ములో ఆ ధాతు వేయే అర్థములలో ఏయే గణములయందున్నదో చెప్పబడినది

"సత్తాయాం విద్యతే జ్ఞానే వేత్తి విన్తే విచారణే
విన్దతే విన్దతి ప్రాప్తౌ శ్యన్ లుక్ శ్నమ్ శేష్విదం క్రమాత్॥

విద్ - సత్తాయామ్ (ఆత్మనేపది) IV గణము విద్యతే
విద్ - జ్ఞానే (పరస్మైపది) II గణము వేత్తి
విద్ - విచారణే (ఆత్మనేపది) VII గణము విన్తే
విద్ - ప్రాప్తౌ (ఉభయపది) VI గణము విన్దతే విన్దతి

## అభ్యాసము 16

క్రింది పాణినీయ సూత్రములను సోదాహరణముగ వివరించునది

1 హన్తేర్జః 2 మృజేర్వృద్ధి 3 వ్రశ్చ భ్రశ్చ సృజ మృజ యజ రాజ భ్రాజ చ్ఛశాం షః 4 క్షిత్యజాదావేష్యతే (వార్త్తికమ్) 5 షఢోః కః సి 6 రుధాదిభ్యః సార్వధాతుకే 7 రుదశ్చ పఞ్చభ్యః 8 అడ్గార్గ్య గాలవయోః 9 జుసిచ 0 ఇద్దరిద్రస్య 11 దిచ 2 శాసి వసి ఘసీనాం చ 3 స్కోః సంయోగాద్యోరన్తే చ 4 బ్రువ ఈట్ 5 ఢో ఢే లోపః 6 ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః 17 దాదేర్ధాతోర్ఘః 18 దధస్తథోశ్చ 9 ఈదాసః 20 లోపో వ్యోర్వలి 2 గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్ద కర్మాకర్మకాణా మణి కర్తా సణౌ

రెండవ, మూడవ గణముల లక్షణములను సోదాహరణముగ వివరించునది

ధాతుద్విరుక్తి సామాన్యనియమములను సోదాహరణముగ వివరించునది

అభ్యాస కార్యములను సోదాహరణముగ వివరించునది

ఝష్ వల్ - అను ప్రత్యాహారములను వివరించునది

ప్రేరణార్థక ధాతురూపము లెట్లేర్పడునో సోదాహరణముగ వివరించునది

రెండవ వర్గపు గణముల ధాతువులనుండి శతృ శానచ్ ప్రత్యయాంత రూపములెట్లేర్పడునో వివరించునది

క్రింది వాక్యముల ప్రయోగములను మార్చి వ్రాయునది -

వ్యాధః అరణ్యే మృగాన్ హన్తి

రామః ప్రజాః సుఖేన అపాత్

సీతా గోదావర్యామ్ అస్నాత్

హనుమాన్ రాక్షసాన్ హతవాన్ ఆసీత్
శిష్యా వేదాన్ అధీయతే
ధేనవః తృణా న్యదన్తి
విద్యా వినయం దదాతి
వధూః శ్వశురాత్ జిహ్రేతి
మాణవకం ధర్మం శాస్తి గురుః
దేవం సర్వాః ప్రజాః స్తువన్తి
గోపాలో ధేనుం పయో దోగ్ధి
సూతోఽశ్వాన్ రథం వాహయతి

క్రింది వాక్యములను స్వార్థక క్రియాపదములను ప్రేరణార్థములుగ మార్చి వ్రాయునది

ధేనవః తృణాని ఖాదన్తి
దేవా గన్ధర్వాణాం గానం శృణ్వన్తి
రాజా యజ్ఞమ్ ఆరభత
సేవకో భారమ్ అనయత్
ఛాత్రైః శ్లోక స్యార్థో విదితః
రామలక్ష్మణౌ గఙ్గా మతరతామ్
బాలః క్షీరం పిబతి
రాజభటాః నగరం పాన్తి
దేవాః అమృతమ్ అశ్నన్తి
త్వం దేవమ్ అపశ్యః



సప్తదశః పాఠః - పదునేడవ పాఠము

# సమాసములు

సంస్కృతభాషయందు అనేక ప్రాతిపదికములు చేరి ఏకప్రాతిపదికముగా పరిగణింపబడు నాచారముకలదు అట్టిదానికి సమాసమని పేరు దానికి చివర సుప్ ప్రత్యయముచేరి ఒకే సుబంతముగా ప్రయోగింపబడుచుండును దానిక సమాసము లేక సమస్తపదమని వ్యవహారము అనేక సుబంతములు కలసి యేకపదమగునట్లు వానికి రూప నిష్పత్తి చెప్పబడుచుండును ఆ ప్రక్రియలో సుబంతము లన్నియు ఏక పదమగునపుడు ఆ పదములలోని సుప్ ప్రత్యయములకు లోపముకలిగి మరల ఆ సమాసము చివర ఒక సుప్ ప్రత్యయము చేరి ఆ సమాసమంతయు ఏకసుబంతముగ వ్యవహరింపబడుచుండును

మొదట ఒక సుబంతము మరియొక సుబంతముతో గలసి సమాసమగును ఆ సమాసము మరల మరియొక సుబంతముతోగాని మరియొక సమాసముతోగాని కలసి మరల నొక సమాసమగును లేదా అనేకపదములు ఒకేపర్యాయముగూడ కలసి సమాసము కావచ్చును ఈ రెండువిధములుగను దీర్ఘ సమాసము లేర్పడును

ఏ యే పదములు ఎ యే పదములతోగలపి ఏ యే యర్థములయందు సమాసమేర్పడునో దానిని గురించి సంస్కృత వైయాకరణులు నియమముల ననేకముల నొసంగియున్నారు ఆ నియమములను బట్టియు మహాకవుల ప్రయోగములను బట్టియు సాధు సమాసముల నెఱుంగవలెను సమర్థములైన పదములకే సమాసము కలుగుననునది ప్రధాన నియమము

సమాసముయొక్క అర్థమునుబట్టియు సమాసమేర్పడిన రీతిని బట్టియు సమాసము అనేక విధములుగ విభజింపబడినవి అవి ద్వంద్వ సమాసము తత్పురుష సమాసము బహువ్రీహి సమాసము అవ్యయీభావ సమాసము అనునవి ఇవికాక కేవలసమాసము అనునది మరియొక విధము దానికి విశేష సంజ్ఞలేదు

## ద్వంద్వసమాసము

చార్థే ద్వన్ద్వః అను సూత్రముచే పాణిని ద్వంద్వ సమాసమును విధించెను చార్థమునందలి పదములు వికల్పముగా సమసించునవనియు ఆ సమాసమునకు ద్వంద్వసమాసమని పేరనియు ఆ సూత్రమున కర్థము. సముచ్చయము అన్వాచయము ఇతరేతరయోగము సమాహారము-అనునవి చ అను అవ్యయమునకు అర్థములు పరస్పర నిరపేక్షితములయిన అనేకములకు ఒకే క్రియయం దన్వయమున్నపుడు అచ్చట చార్థము సముచ్చయము అందొకదానికి అప్రాధాన్యము చెప్పునపుడు అచ్చట చార్థము అన్వాచయము ఉదా - ఈశ్వరంచ గురుంచ భజస్వ - అనుచోట చార్థము సముచ్చయము భిక్షామట ధేనుంచానయ అనుచోట చార్థము అన్వాచయము ఈ రెండుచోట్ల సామర్థ్యము లేకుండుటచే సమాసమురాదు

పరస్పరాపేక్షితములైన పదముల కొకే క్రియయందన్వయమున్నపుడు అచట చార్థము ఇతరేతరయోగము సమాహారమనగా సమూహమని యర్థము

రామశ్చ లక్ష్మణశ్చ గచ్ఛతః - అనుచోట చార్థము ఇతరేతరయోగము సంజ్ఞాచ పరిభాషాచ - అనుచోట చార్థము సమాహారము. ఈ రెండుచోట్ల సమాసము వచ్చును

అందుచే ద్వంద్వ సమాసము ఇతరేతరయోగద్వంద్వము సమాహారద్వంద్వము-అని రెండురకములుగా విభజింపవచ్చును రామశ్చ లక్ష్మణశ్చ=రామలక్ష్మణౌ అనునది ఇతరేతరయోగద్వంద్వమునకు, సంజ్ఞా చ పరిభాషా చ అనయోః సమాహారః = సంజ్ఞాపరిభాషమ్ - అనునది సమాహారద్వంద్వమునకును ఉదాహరణములు

ఇతరేతరయోగ ద్వంద్వమునందు అవయవ భేదము ఉద్భూతమయి యుండుటచే ఆ సమాసము అర్థమునుబట్టి ద్వివచనములోగాని బహువచనములోగాని యుండును అనగా రెండు ఏకవచనపదములకు సమాసము కలిగినపుడు ఆ సమాసము ద్వివచనమునందు అందు ఒకటిగాని రెండునుగాని ఏకవచనపదములు కానపుడు రెండుకంటె ఎక్కువ పదములకు సమాసము కలిగినదును, ఆ సమాసము బహువచనమునందును ఉండునని భావము సమస్యమాన పదములలో చివరి పదముయొక్క లింగమే ఆ సమాసముయొక్క లింగమై యుండును

ఉదా - రామశ్చ లక్ష్మణశ్చ, భరతశ్చ, శత్రుఘ్నశ్చ = రామ లక్ష్మణ భరత శత్రుఘ్నాః కుక్కుటశ్చ, మయూరీచ=కుక్కుట మయూర్యౌ (స్త్రీలింగము) మయూరీచ కుక్కుటశ్చ = మయూరీ కుక్కుటౌ (పుంలింగము)

సమాహారద్వంద్వమునందు అవయవభేదము తిరోహితమై సమాహారము మాత్రమే ప్రధానముగా భాసించుటచే ఆ సమూహము యొక్క ఏకత్వమునుబట్టి ఆ సమాస మెల్లపుడు నేకవచనమునందె యుండును సర్వసామాన్యముగా ఆసమాసము నపుంసకలింగమునందే యుండును

ఉదా - ఆహారశ్చ నిద్రాచ, భయం చ ఏషాం సమాహారః = ఆహార నిద్రా భయమ్

అనేక పదములకు ఒక్కసారిగా ద్వంద్వసమాస మేర్పడ వచ్చును రెండు పదములకే అను నియమము లేదు

ప్రాణ్యంగ వాచకములకు తూర్యాంగ వాచకములకు ప్రాణి భిన్నద్రవ్య వాచకములకు స్వాభావిక విరోధముగల జంతువాచకములకు భిన్నలింగమునందుగాని భిన్నవచనమునందుగాని కల నదీవాచకములకు అట్టి దేశవాచకములకు అట్టి నగరవాచకములకును సమాహార ద్వంద్వమే కలుగును

ఉదా - పాణీచ పాదౌచ - ఏషాం సమాహారః = పాణిపాదమ్

మార్దంగికశ్చ, పాణవికశ్చ - అనయోః సమాహారః = మార్దంగికపాణవికమ్

ధానాశ్చ శష్కుల్యశ్చ - ఆసాం సమాహారః = ధానాశష్కులి

కాకాశ్చ ఉలూకాశ్చ - ఏషాం సమాహారః = కాకోలూకమ్

గంగాచ శోణశ్చ - అనయోః సమాహారః = గంగాశోణమ్

కురవశ్చ కురుక్షేత్రంచ - ఏషాం సమాహారః = కురుక్షేత్రమ్

మధురాచ పాటలిపుత్రం చ - అనయోః సమాహారః = మధురాపాటలిపుత్రమ్

ఫలవాచకములకు సేనాంగ వాచకములకు వృక్షవాచకములకు మృగవాచకములకు పక్షివాచకములకును - క్షుద్ర జంతువాచకములకు ధాన్యవాచకములకు తృణవాచకములకును - బహువచనాంత శబ్దములకు సమాహార ద్వంద్వము కలుగును ఏకవచనాంతములకు ఇతరేతరయోగ ద్వంద్వము కలుగును

ఉదా - బదరాణీచ ఆమలకానిచ - ఏషాంసమాహారః = బదరామలకమ్

రథికాశ్చ అశ్వారోహాశ్చ - ఏషాం సమాహారః = రథికాశ్వారోహమ్

ప్లక్షాశ్చ న్యగ్రోధాశ్చ - ఏషాం సమాహారః = ప్లక్షన్యగ్రోధమ్

రురవశ్చ వృషతాశ్చ - ఏషాం సమాహారః = రురువృషతమ్
శుకాశ్చ బకాశ్చ - ఏషాం సమాహారః = శుకబకమ్
యూకాశ్చ లిక్షాశ్చ - ఏషాం సమాహారః = యూకాలిక్షమ్
వ్రీహయశ్చ యవాశ్చ - ఏషాం సమాహారః = వ్రీహియవమ్
కుశాశ్చ కాశాశ్చ - ఏషాం సమాహారః = కుశకాశమ్

బదరంచ అమలకంచ = బదరామలకే రథికశ్చ అశ్వారో హశ్చ = రథికాశ్వారోహౌ ప్లక్షశ్చ న్యగ్రోధశ్చ = ప్లక్షన్యగ్రోధౌ రురుశ్చ, వృషతశ్చ=రురువృషతౌ శుకశ్చ బకశ్చ = శుకబకౌ యూకాచ లిక్షశ్చ=యూకాలిక్షౌ వ్రీహిశ్చ యవశ్చ = వ్రీహియవౌ కుశశ్చ కాశశ్చ = కుశకాశౌ

ప్రాణిజాతివాచకములకు విరుద్ధార్థములగు (అనగా కలిసియుండ నేరని) గుణవాచకములకు, క్రియావాచకములకు విప్రతిషిద్ధార్థ ద్రవ్య వాచకములకు (అనగా కలసి యుండనేరని ధర్మములుగల పదార్థము లను బోధించువానికి) సమానలింగమునందున్నట్టియు సమాన వచనము నందున్నట్టియు నదీవాచకములకు దేశవాచకములకును గ్రామవాచకము నకు, నగరవాచకమునకు, ఇతరేతరయోగద్వంద్వమే కల్గును

ఉదా - విశశ్చ శూద్రాశ్చ = విట్ఛూద్రాః రూపంచ రసశ్చ = రూపరసౌ గమనంచ ఆకుఞ్చనంచ=గమనాకుఞ్చనే శీతంచ, ఉష్ణంచ= శీతోష్ణే (ఉదకములు) గంగాచ యమునాచ = గంగా యమునే. మద్రాశ్చ కేకయాశ్చ = మద్రకేకయాః జామ్బవం చ శాలూకినీచ = జామ్బవశాలూకిన్యౌ (జామ్బవమ్ అనునది నగరము శాలూకినీ అనునది గ్రామము )

సమస్యమానపదార్థముల సంఖ్య మరియొక పదముచే గమ్యమాన మగునపుడు ఆ పదములకు ఇతరేతరయోగద్వంద్వమే వచ్చును

ఉదా.- దళ దన్తోష్ఠాః (దన్తాశ్చ ఓష్ఠాశ్చ = దన్తోష్ఠాః)

తక్షాణశ్చ అయస్కారాశ్చ- ఏషాం సమాహారః=తక్షాయస్కారమ్. గావశ్చ అశ్వాశ్చ - ఏషాం సమాహారః=గవాశ్వమ్ దాసశ్చ దాసాశ్చ - ఏషాం సమాహారః = దాసీదాసమ్ - మున్నగువానికి కొన్నింటికి సమాహారద్వంద మే కలుగును

దధి చ పయశ్చ=దధిపయసీ వాక్చ మనశ్చ = వాఙ్మనసే . మధుచ, సర్పిశ్చ = మధుసర్పిషీ సర్పిశ్చ మధుచ = సర్పిర్మధుని బ్రహ్మాచ ప్రజాపతిశ్చ = బ్రహ్మప్రజాపతీ శివశ్చ, వైశ్రవణశ్చ = శివవైశ్రవణౌ - మున్నగువానికి కొన్నింటికి ఇతరేతర యోగ ద్వంద్వ మే కలుగును

సమస్యమాన పదార్థములసంఖ్య మరియొక పదముచే సుమారుగా గమ్యమాత్రమగునపుడు ఆపదములకు రెండువిధములగను ద్వంద్వ సమాసము లేర్పడును

ఉదా - ఉపదశం దన్తోష్ఠమ్ ఉపదశాః దన్తోష్ఠాః

(పదికి దగ్గరగల దంతోష్ఠములని యర్థము)

రెండు సమాసములను చెప్ప తక్కినచోట్ల వివక్షాధీనముగ రెండు సమాసములను చెప్ప వచ్చును

ఉదా - దధిఘృతమ్ - దధిఘృతే గోమహిషమ్ - గోమహిషాః అశ్వబడబమ్ - అశ్వబడబౌ పూర్వాపరమ్ - పూర్వాపరే అధ రోత్తరమ్ - అధరోత్తరే శీతోష్ణమ్ - శీతోష్ణే (గుణములు) సుఖ దుఃఖమ్ - సుఖదుఃఖే మున్నగునవి

ద్వంద్వ సమాసమునందు ఋకారాంత శబ్దముగాని పుత్త్ర శబ్దము గాని ఉత్తరపదముగా నున్నపుడు విద్యాసంబంధమును, రక్తసంబంధ మును దెలుపునట్టి పూర్వపదాన్త్య ఋకారమునకు ఆకారాదేశ మగును.

ఉదా - హోతా చ పోతా చ = హోతృ + పోతారౌ = హోతా పోతారౌ మాతా చ పితాచ = మాతృ + పితరౌ=మాతాపితరౌ ('మాతర పితరౌ' అను రూపముగూడ గలదు ) పితా చ పుత్రశ్చ=పితృ+పుత్రౌ= పితాపుత్రౌ

చవర్గాక్షరము దకారము, షకారము హకారము అంతమందు గల సమాహార ద్వంద్వసమాసములకు చివర అకారముచేరి, ఆ సమాసము అకారాంతమగును

ఉదా - వాక్చ త్వక్చ అనయోః సమాహారః = వాక్త్వచమ్, త్వక్చ, స్రక్చ అనయోః సమాహారః = త్వక్స్రజమ్ శమీచ దృషచ్చ [illegible]యోః సమాహారః = శమీదృషదమ్ వాక్చ త్విట్చ - అనయోః [illegible]హారః = వాక్త్విషమ్ ఛత్రం చ ఉపానహౌ చ - ఆసాం సమా[illegible]హారః = ఛత్రోపానహమ్

(సమాహార ద్వంద్వము కానపుడు ఈ అకారము చేరదు ప్రావృట్చ శరచ్చ = ప్రావృట్శరదౌ)

అహన్, రాత్రి శబ్దముల ద్వంద్వసమాసములో రాత్రిశబ్దమునకు చివర ఇకారముపోయి అకారముచేరి రాత్ర అని యగును

ఉదా - అహశ్చ రాత్రిశ్చ = అహోరాత్రః

సమాసమందలి హలంతమగు పూర్వపదమునకు హలాది విభక్తులు పరమగునపుడు కలుగు మార్పులు కలుగును

ఉదా - అహన్+రాత్రః=అహోరాత్రః నపుంసకలింగ మందలి ద్వంద్వముయొక్క, ద్విగువుయొక్కయు తుది దీర్ఘమునకు హ్రస్వము వచ్చును

ఉదా - ధానా + శష్కులీ = ధానాశష్కులి

## తత్పురుష సమాసము

తత్పురుష సమాసము రెండు పదముల కలయికచే నేర్పడును. అందు మొదటి పదార్థము రెండవ పదార్థమునకు పరిచ్ఛేదకముగా నుండును లేదా విశేషణముగా నుండును కొన్నిచోట్ల రెండవ పదము విశేషణ వాచకముగా నుండును అనగా తత్పురుష సమాసము కలుగు వానిలో మొదటిపదము ద్వితీయాది విభక్త్యంతముగా గాని రెండవ దానికి విశేషణవాచకముగా గాని యుండవచ్చునని భావము మొదటి పదము ద్వితీయాది విభక్త్యంతముగా నున్న తత్పురుష సమాసము వ్యధికరణ తత్పురుషసమాసమనియు మొదటి పదము విశేషణ వాచకముగా నున్న తత్పురుషసమాసము సమానాధికరణ తత్పురుష సమాసమనియు చెప్పబడును సమానాధికరణ తత్పురుష సమాసమునకు కర్మధారయ సమాసమని పేరు వ్యధికరణ తత్పురుషసమాసమును సామాన్యముగా తత్పురుషసమాసమనియే వ్యవహరింతురు ఉత్తరపదముయొక్క లింగమే తత్పురుషసమాసముయొక్క లింగమైయుండును

సమాసమునందలి పూర్వపదమునుబట్టి వ్యధికరణ తత్పురుష సమాసమును అనేక భాగములుగ విభజింపవచ్చును

I ద్వితీయా తత్పురుషము:-

1 ద్వితీయాంతము శ్రిత, అతీత పతిత, గత అత్యస్త ప్రాప్త ఆపన్న శబ్దములతోడను, గమీ, బుభుక్షుః - మున్నగువాని తోడను సమసించును ఉదా - కృష్ణం శ్రితః = కృష్ణశ్రితః దుఃఖమ్ అతీతః=దుఃఖాతీతః కూపం పతితః=కూపపతితః గ్రామం గతః= గ్రామగతః గ్రామమ్ అత్యస్తః = గ్రామాత్యస్తః గ్రామం

ప్రాప్తః=గ్రామప్రాప్తః  సంశయమ్ అపన్నః = సంశయాపన్నః
(ఈ సమాసములో ప్రాప్త అపన్న శబ్దములకు పూర్వప్రయోగము
గూడ నుండవచ్చును  అప్పుడాసమాసము ప్రాప్తఅవన్న శబ్దముల
లింగమునందేయుండును ఉదా - ప్రాప్త గ్రామః ప్రాప్తజీవికః,
అపన్న సంశయః అపన్న జీవికః)
గ్రామం గమీ=గ్రామగమీ  అన్నం బుభుక్షుః=అన్నబుభుక్షుః

2 ద్వితీయాది విభక్త్యంత కాలవాచక శబ్దము అత్యంత సంయోగము
వాచ్యమగునపుడు ఏదేని మరియొక సుబంతముతోను కానపుడుక్తాంత
పదములతోడను సమసించును
ఉదా - ముహూర్తం సుఖం=ముహూర్తసుఖమ్  మాసం ప్రమితః=
మాసప్రమితః

నిందార్థమునందు ద్వితీయావిభక్త్యంత ఖట్వాశబ్దము క్త ప్రత్య
యాంతముతో సమసించును ఉదా - ఖట్వామ్ ఆరూఢః =
ఖట్వారూఢః (మూర్ఖుడని యర్థము)

## II తృతీయ తత్పురుషము

1 కరణవాచక తృతీయాంతము తత్కృతమగు గుణవాచక శబ్ద
ముతో అర్థశబ్దముతోడను సమసించును ఉదా - శఙ్కులయా
ఖణ్డః = శఙ్కులాఖణ్డః ధాన్యేన అర్థః = ధాన్యార్థః

2 తృతీయాంతము పూర్వ సదృశ సమ కలహ, నిపుణ మిశ్ర
శ్లక్ష్ణ అవర శబ్దములతోడను ఊనార్థక శబ్దములతోడను సమసించును
ఉదా - మాషేన పూర్వః = మాషపూర్వః  మాత్రా సదృశః =
మాతృసదృశః  పిత్రా సమః = పితృసమః  వాగ్భిః కలహః =
వాక్కలహః  ఆచారేణ నిపుణః=ఆచారనిపుణః  గుడేన మిశ్రః=

గుడమిశ్రాః గుడేన సమ్మిశ్రాః=గుడసమ్మిశ్రాః ఆచారేణ శ్లక్ష్ణః= ఆచారశ్లక్ష్ణః , మాషేన అవరః = మాషావరః మాషేణ ఊనమ్= మాషోనమ్ , మాషేణ వికలమ్ = మాషవికలమ్

3 కర్తృక కరణార్థక తృతీయాంతములు కృదంతముతో (బహుళముగా) సమసించును ఉదా - నఖైః భిన్నః=నఖభిన్నః నఖైః నిర్భిన్నః = నఖనిర్భిన్నః వాతేన ఛేద్యమ్ = వాతచ్ఛేద్యమ్ కాకైః పేయా=కాకపేయా

4 సంస్కార ద్రవ్యవాచక తృతీయాంతము అన్నవాచకముతోడను, మిశ్రణద్రవ్యవాచక తృతీయాంతము ఖాద్య వాచకముతోడను సమసించును ఉదా - దధ్నా ఓదనః = దధ్యోదనః గుడేన ధానాః = గుడధానాః

III చతుర్థీ తత్పురుషము -

చతుర్థ్యంతము ఆ చతుర్థ్యంతవాచ్య పదార్థమునకు కారణమగు ద్రవ్యవాచకముతోడ అర్థ బలి, హిత సుఖ రక్షిత శబ్దములతోడను సమసించును ఉదా - యూపాయ దారు = యూపదారు కుణ్డలాయ హిరణ్యమ్=కుణ్డలహిరణ్యమ్ గవే హితమ్=గోహితమ్ గవే సుఖమ్=గోసుఖమ్ గోభ్యో రక్షితమ్=గోరక్షితమ్

పైవానిలో అర్థ శబ్దముతోడి సమాసము నిత్యసమాసము ఆ సమాసము విశేషణవాచకముగానుండును కావున ఆ సమాసము యొక్క లింగవచనములు విశేష్యవాచకముయొక్క లింగవచనముల ననుసరించి యుండును అర్థశబ్దముతోగాక ఇదం శబ్దరూపములతో విగ్రహ వాక్యము చెప్పబడును ఉదా - ద్విజాయ అయమ్=ద్విజార్థః (సూపః) ద్విజాయ ఇయమ్ = ద్విజార్థా (యవాగూః) ద్విజాయ ఇదమ్ = ద్విజార్థమ్ (పయః)

## IV పంచమీ తత్పురుషము

పంచమ్యంతము భయ భీత, భీతి శబ్దములతోడను కొన్ని పంచమ్యంతములు అపేత అపోఢ ముక్త పతిత, అపత్రస్త శబ్దములతోడను సమసించును ఉదా - చోరాత్ భయమ్ = చోరభయమ్ వృకాత్ భీతః = వృకభీతః వృకాత్ భీతిః = వృకభీతిః సుఖాత్ అపేతః = సుఖాపేతః కల్పనాత్ అపోఢః=కల్పనాపోఢః చక్రాత్ ముక్తః = చక్రముక్తః స్వర్గాత్ పతితః = స్వర్గపతితః తరఙ్గేభ్యః అపత్రస్తః=తరఙ్గాపత్రస్తః 'కొన్ని పఞ్చమ్యంతములు' - అని చెప్పుటచే ప్రాసాదాత్ పతితః మున్నగుచోట్ల సమాసమురాదు

## V షష్ఠీ తత్పురుషము

1 స్వస్వామి భావాది సంబంధార్థములో వచ్చిన షష్ఠీవిభక్తి అంతమందు గల పదము (శేష షష్ఠీ విభక్త్యంతము) మరియొక సుబంతముతో సమసించును

ఉదా - రాజ్ఞః పురుషః = రాజపురుషః మాణవకస్య వాధనమ్ = మాణవకవాధనమ్ ధానానాం పేషణమ్=ధానాపేషణమ్ శలాకానాం వ్యవహారః = శలాకావ్యవహారః బ్రాహ్మణస్య పఠనమ్=బ్రాహ్మణపఠనమ్ కృష్ణస్య తుల్యః=కృష్ణతుల్యః కృష్ణస్య సదృశః=కృష్ణసదృశః కృష్ణస్య సమః=కృష్ణసమః కృష్ణస్య తులా=కృష్ణతులా కృష్ణస్యఉపమా = కృష్ణోపమా తస్య ఉపరి = తదుపరి గ్రామస్య అర్థః = గ్రామార్థః

2 కాని షష్ఠ్యంతము పూరణార్థకప్రత్యయాంతములతో తృప్త్యర్థక శబ్దములతో సమానాధికరణశబ్దములతోడను సమసించదు

ఉదా - సతాం షష్ఠః ఫలానాం సుహితః తక్షకస్య సర్పస్య

షష్ఠ్యంతము గుణవాచకములలో గౌరవమ్ మాన్ద్యమ్, ప్రమాణత్వమ్ మున్నగు కొన్నింటితోడనే సమసించును

ఉదా - అర్థస్య గౌరవమ్ = అర్థగౌరవమ్ బుద్ధేః మాన్ద్యమ్ = బుద్ధి మాన్ద్యమ్ సంజ్ఞాయాః ప్రమాణత్వమ్=సంజ్ఞాప్రమాణత్వమ్

కాకస్య కార్ష్ణ్యమ్ బ్రహ్మణస్య శుక్లాః - మున్నగుచోట్ల షష్ఠ్యంతము గుణవాచకములతో సమసించదు

3 నిర్ధారణార్థకషష్ఠ్యంతము తరప్ ప్రత్యయాంతమగు గుణవాచకముతో మాత్రము సమసించును అప్పుడు తరప్ ప్రత్యయమునకు లోపము వచ్చును

ఉదా - సర్వేషాం శ్వేతతరః=సర్వశ్వేతః సర్వేషాం మహత్తరః = సర్వమహాన్

తక్కినవానితో నిర్ధారణ షష్ఠ్యంతము సమసించదు

ఉదా - నృణాం ద్విజః శ్రేష్ఠః

4 కృదంతయోగములో కర్త్రర్థమునందు కర్మార్థమునందును వచ్చిన షష్ఠీవిభక్తి అంతమందుగల పదము తృచ్, అక ప్రత్యయాంతము లతోగాక తక్కిన కృదంతములతో సమసించును

ఉదా - ఇధ్మస్య ప్రవ్రశ్చనః=ఇధ్మప్రవ్రశ్చనః ఇక్షూణాం భక్షికా= ఇక్షుభక్షికా కృష్ణస్య కృతిః=కృష్ణకృతిః

5 షష్ఠ్యంతము కర్త్రర్థక తృచ్ అకప్రత్యయాంతములలో యాజకాదులతో మాత్రమే సమసించును

ఉదా - బ్రాహ్మణస్య యాజకః = బ్రాహ్మణయాజకః దేవానాం పూజకః = దేవపూజకః భువో భర్తా = భూభర్తా (యాజక పూజక, పరిచారిక, పరివేషక స్నాతక, అధ్యాపక ఉత్సాదక హోతృ పోతృ భర్తృ రథగణక పత్తిగణక - అనునవి యాజకాదులు)

6 కాని సమాసముచే క్రీడగాని, జీవికగాని గమ్యమానమగునపుడు షష్ఠ్యంతము ఏ అకప్రత్యయాంతముతోనైనను నిత్యముగా సమసించును.

ఉదా:- ఉద్దాలక పుష్పాణి భజ్యన్తే యస్యాం సా = ఉద్దాలకపుష్పభఞ్జికా (ఇది ఒక ఆట పేరు). దన్తానాం లేఖనేన జీవతీతి = దన్తలేఖికః (దంతలేఖన వృత్తిచే జీవించువాడని యర్థము)
షష్ఠ్యంతము తక్కిన తృచ్ అకప్రత్యయాంతములలో సమసించదు.
ఉదా - అపాం స్రష్టా, జగతః కర్తా, అశ్వస్య నేతా, ఓదనస్య పాచకః, భవతః శాయికా.

7 షష్ఠ్యంతము శతృ శానచ్ ప్రత్యయాంతములతో కృదంతావ్యయములతో, తవ్యప్రత్యయాంతములతోడను సమసించదు
ఉదా - ద్విజస్య కుర్వన్ ద్విజస్య కుర్వాణః, బ్రాహ్మణస్య కృత్వా బ్రాహ్మణస్య కర్తవ్యమ్

8 కర్తృవాచకసమువదానమునందు కర్మార్థక షష్ఠ్యంతము కృదంతముతో సమసించదు.

ఉదా - (ఆశ్చర్యో) గవాందోహోఽ-గోపేన

9 షష్ఠ్యంతము వర్తమానార్థక కృదంతముతో సమసించదు
ఉదా.- రాజ్ఞాం మతః, రాజ్ఞాం బుద్ధః
షష్ఠ్యంతము అధికరణార్థక క్త ప్రత్యయాంతముతో సమసించదు
ఉదా - ఏషాం ఆసితమ్ ఏషాం గతమ్ ఏషాదభుక్తమ్

10 ఉపపదషష్ఠీ విభక్త్యంతము లేక ప్రతిపదవిధాన షష్ఠీవిభక్త్యంతము మరియొక పదముతో సమసించదు

ఉదా - అన్నస్య హేతోః గ్రామస్య దక్షిణతః చోరస్య రుజా కాని జ్వర్, సమ్+తప్-ధాతువులయోగమున కర్మార్థకమునందు వచ్చిన

షష్ఠీవిభక్తి అంతమందుగలపదము మరియొక పదముతో సమసించును.
ఉదా.- చోరస్య జ్వరః=చోరజ్వరః చౌరస్యసన్తాపః=చౌరసన్తాపః

VI ఏకదేశి సమాసము లేక ప్రథమా తత్పురుషము

ఇప్పటివరకు చెప్పబడిన షష్ఠీతత్పురుష సమాసములలో షష్ఠ్యంత పదము పూర్వప్రయుక్తమగుచున్నది దీని కపవాదముగా కొన్నిచోట్ల షష్ఠ్యంతపదము చివర ప్రయోగింపబడుచుండును ఆ షష్ఠ్యంతపదములు ఏకదేశివాచకములుగా అనగా అవయవి వాచకములుగా నుండును అందుచే దానిని ఏకదేశి సమాసమని కొందఱు వ్యవహరింతురు మొదటిపదము ప్రథమాంతమగుటచే తక్కిన తత్పురుషములవలె ప్రథమాతత్పురుషమని కొందరు వ్యవహరింతురు

1 పూర్వ అపర, అధర, ఉత్తర శబ్దములు ఏకవచనమునందుండు షష్ఠ్యన్తావయవి వాచకశబ్దముతో సమసించును
ఉదా.- పూర్వం కాయస్య = పూర్వకాయః అపరం కాయస్య = అపరకాయః, అధరం కాయస్య=అధరకాయః, ఉత్తరం కాయస్య= ఉత్తరకాయః-ఈ సమాసములకు కాయస్య పూర్వం మున్నగురీతిని గూడ విగ్రహమని చెప్పవచ్చును అయినను ప్రథమావిభక్త్యంతమగు అవయవవాచక శబ్దమే సమాసపూర్వపదముగానుండి పూర్వకాయః అనియే సమాస మేర్పడును

2 కాలముయొక్క అవయవ వాచక శబ్దములన్నియు షష్ఠ్యంతావయవి వాచకమగు కాలవాచక శబ్దముతో సమసించును
ఉదా - అహ్నాం మధ్యః = మధ్యాహ్నః, అహ్నః సాయః = సాయాహ్నః రాత్రేః మధ్యః = మధ్యరాత్రః రాత్రేః పశ్చిమః= పశ్చిమరాత్రః (రాత్రిమధ్యః దినమధ్యః - మున్నగు యావములు కూడ కవబడుచున్నవి )

3 సమభాగవాచకమగు నపుంసకలింగమునందలి అర్ధశబ్దము ఏకవచన మందలి షష్ఠ్యంతావయవి వాచకముతో సమసించును

ఉదా - అర్ధం పిప్పల్యాః = అర్ధపిప్పలీ

4 ద్వితీయ తృతీయ చతుర్థ, తుర్యశబ్దములు అవయవివాచకమగు షష్ఠీఏకవచనాంత శబ్దముతో వికల్పముగా సమసించును పక్షాంతరమున షష్ఠీ తత్పురుషసమాసము కలుగును అనగా షష్ఠ్యంతశబ్దము పూర్వప్రయుక్తమగును

ఉదా - ద్వితీయం భిక్షాయాః=ద్వితీయభిక్షా (లేక) భిక్షా ద్వితీయన్

5 కాలవిశేషవాచకము ఆ కాలముచే కొలవబడునట్టి పదార్థవాచకముతో సమసించును

ఉదా - మాసో జాతస్య = మాసజాతః ద్వే అహనీ జాతస్య = ద్వ్యహజాతః

VI సప్తమీ తత్పురుషము

1 సప్తమీ విభక్త్యంతము శౌండాది గణ పఠిత శబ్దములతోడను, సిద్ధ శుష్క, పక్వ బంధ, శబ్దములతోడను సమసించును (శౌండ ధూర్త కితవ వ్యాడ, ప్రవీణ సంవీత, అన్తర్, అధి, పటు, పండిత, కుశల చపల నిపుణ - అనునవి శౌండాదులు

ఉదా - అక్షేషు శౌండః = అక్షశౌండః ఈశ్వరే అధి=ఈశ్వరాధీనః వనే అన్తః=వనాన్తః సాంకాశ్యే సిద్ధః=సాంకాశ్యసిద్ధః ఆతపే శుష్కః=ఆతపశుష్కః స్థాల్యాం పక్వః=స్థాలీపక్వః చక్రేబన్ధః = చక్రబన్ధః.

2 నింద గమ్యమానమగునపుడు సప్తమ్యంతము కాకి అను అర్థముగల శబ్దములతో సమసించును

ఉదా - తీర్థే కాకః (ఇవ)=తీర్థకాకః } =తీర్థమునందలి కాకివలె
తీర్థే ధ్వాంక్షః (ఇవ)=తీర్థధ్వాంక్షః } అస్థిరమైనవాడు

3 అహోరాత్రముల అవయవవాచక సప్తమ్యంతములు క్త ప్రత్యయాంతముతో సమసించును

ఉదా - పూర్వాహ్ణేకృతమ్=పూర్వాహ్ణ కృతమ్ అపరరాత్రే కృతమ్=అపరరాత్రకృతమ్

## నఞ్ తత్పురుషము

ఉ న అను అవ్యయము సుబంతముతో సమసించును అప్పుడు 'న' అనునది హలాదిశబ్దములకు ముందు 'అ అని అజాదిశబ్దములకు ముందు 'అన్ అనియు మారును

ఉదాః- న బ్రాహ్మణః=అబ్రాహ్మణః న అశ్వః=అనశ్వః

## ప్రాది సమాసము

ప్రాదులు సుబంతములతో నిత్యముగ సమసించును ప్రాదులకు విడిగ ప్రయోగముండకపోవుటచే అవి సమాసములో ఏ యర్థమునందుండునో ఆ యర్థములను బోధించుపదములతో విగ్రహవాక్యములు చెప్పబడును ఉదా - శోభనః పురుషః=సుపురుషః

1. ప్రగత అను అర్థమున ప్ర అనునది ప్రథమాంతముతో సమసించును ప్రగతః ఆచార్యః = ప్రాచార్యః
2 అతిక్రాంత అను అర్థమున అతి అనునది ద్వితీయాంతముతో సమసించును అతిక్రాన్తః మాలామ్ = అతిమాలః
3 అవకృష్ట అను అర్థమున అవ అనునది తృతీయాంతముతో సమసించును అవకృష్టః కోకిలయా = అవకోకిలః

4 పరిగ్లాన అను అర్ధమున పరి అనునది చతుర్థ్యంతముతో సమసించును
పరిగ్లానః అధ్యయనాయ = పర్యధ్యయనః

5 నిష్క్రాంత అను అర్థమున నిర్ అనునది పంచమ్యంతముతో సమసించును నిష్క్రాంతః కౌశామ్బ్యాః=నిష్కౌశాంబిః

## ఉపపద సమాసము

కొన్నిపదములు ఉపపదములుగా (సమీపపదములుగా) ఉన్నపుడు ధాతువులకు కొన్ని కృత్ప్రత్యయములు విధింపబడినవి ఆ ఉపపదములకు అట్టి కృదంతములతో నిత్యముగా సమాసము కలుగును దానికి ఉపపద సమాసమని పేరు (ఆ కృదంతములకు విడిగ ప్రయోగముండక పోవుటచే ఏ యర్థములో ఆ కృత్ప్రత్యయము చేరునో అట్టి తిజంతముగాని మరియొక కృదంతముగాని విగ్రహవాక్యములో ప్రయోగింపబడును

ఉదా - కుమ్భం కరోతీతి = కుమ్భకారః జలాత్ జాయతే ఇతి = జలజమ్ సోమేన ఇష్టవాన్ = సోమయాజీ

ప్రాదులలోనిది ఉపపదమును కాకపోయినను కు అనునది కుత్సితార్థములో మరియొక సుబంతముతో సమసించును

ఉదా - కుత్సితః పురుషః=కుపురుషః

## సమాసాంత కార్యములు

సంఖ్యావాచకము అవ్యయము పూర్వ అపర - మున్నగు ఏకదేశ వాచకములు, సర్వ సంఖ్యాత శబ్దములును పూర్వమందున్నపుడు తత్పురుషాంతమునందలి 'అహన్ శబ్దమునకు అహ్న అను ఆదేశము వచ్చును కాని ద్విగుసమాసమునందు, ఏకశబ్దము పూర్వమందున్నపుడును రాదు

ఉదా - పూర్వం చ తత్ అహశ్చ=పూర్వాహ్ణః సర్వంచ తత్ అహశ్చ=సర్వాహ్ణః సంఖ్యాతంచ తత్ అహశ్చ=సంఖ్యాతాహ్నః

2 ఈ క్రింద పేర్కొనబడిన వానిలో అజంత శబ్దము చివరియచ్చునకు, హలంతశబ్దముల చివరిహల్లునకు దానికి ముందున్న అచ్చునకును లోపము కలిగి పిమ్మట 'అ' అను సమాసాంత ప్రత్యయము చేరును అందుచే ఆ సమాసము అకారాంతమగును

(క) సమాసాంతమునందలి పథిన్ శబ్దమునకు —

ఉదా - స్వర్గస్య పన్థాః=స్వర్గపథః కాని నఞ్ తత్పురుషాంతమునందలి పథిన్ శబ్దమునకు వికల్పముగా వచ్చును అపన్థాః అపథమ్,

(ఖ) తత్పురుషాంతమునందలి సఖి రాజన్ శబ్దములకు —

ఉదా— మద్రాణాం రాజా=మద్రరాజః కృష్ణస్యసఖా=కృష్ణసఖః కాని నఞ్ తత్పురుషాంతమునందు రాదు అరాజా అసఖా

(గ) సంఖ్యావాచకము అవ్యయము పూర్వ అవర - మున్నగు ఏకదేశ వాచకములు, సర్వ సంఖ్యాత, పుణ్యశబ్దములును పూర్వమందున్న తత్పురుషాంత రాత్రి శబ్దమునకు -

ఉదా - ద్వయోః రాత్ర్యోః సమాహారః = ద్విరాత్రమ్ అతిక్రాన్తో రాత్రిమ్ = అతిరాత్రః పూర్వంరాత్రేః = పూర్వరాత్రః సర్వా చ సా రాత్రిశ్చ = సర్వరాత్రః

(ఘ) తత్పురుషాంతమందు అహ్న అని మార్పు చెందని అహన్ శబ్దమునకు -

ఉదా - పుణ్యంచ తత్ అహశ్చ=పుణ్యాహమ్ ద్వయోఃఅహ్నోః సమాహారః = ద్వ్యహః, ఉత్తమంచ తత్ అహశ్చ=ఉత్తమాహః.

3 తత్పురుషాంతమునందలి గోశబ్దమునకు పరముగా అకారముచేరును

ఉదా - పరమశ్చా సౌ గౌశ్చ=పరమగవః

4 సమాసాంతమందలి ఋచ్, పుర్, అప్, ధుర్ శబ్దములకు పరముగా అకారము చేరును (అప్పుడు పుర్ శబ్దాంతసమాసము నపుంసకలింగమందుండును) ఉదా - అర్ధం ఋచః=అర్ధర్చః విష్ణోః పూః = విష్ణుపురమ్ రణస్య ధూః=రణధురా విమలాశ్చతాః అపశ్చ=విమలాపాః

రాత్రి అహ్న, అహ అనునవి అంతమందుగల సమాసములు పుంలింగమునందుండును ఉదా - పూర్వం రాత్రేః = పూర్వరాత్రః మధ్యం అహ్నః = మధ్యాహ్నః సప్తానాం అహ్నాం సమాహారః సప్తాహః

కాని రాత్రి అనుదానికి ముందు సంఖ్యావాచకమున్నపుడు అహ అనుదానికిముందు పుణ్యశబ్దమున్నపుడు ఆ సమాసములు నపుంసకలింగమందుండును ఉదా - ద్వయోః రాత్ర్యోః సమాహారః = ద్విరాత్రమ్ పుణ్యంచ తత్ అహశ్చ=పుణ్యాహమ్

కర్మధారయ బహువ్రీహి సమాసములందు పూర్వపదమగుమహత్ శబ్దము మహా అని మారును ఉదా - మహాంశ్చాసౌ సముద్రశ్చ= మహత్+సముద్ర=మహాసముద్రః

## కర్మధారయ సమాసము

రెండు సమానాధికరణ పదములకు కలుగు తత్పురుష సమాసమునకు కర్మధారయమని పేరు దీనినే సమానాధికరణ తత్పురుషమని కూడ వ్యవహరింతురు

సమానాధికరణములగు విశేషణ విశేష్య వాచకములకు, రెండు విశేషణ వాచకములకు, ఉపమానసామాన్య వాచకములకు, ఉపమానోపమేయ వాచకములకును ఈ సమాస మేర్పడును

విశేషణ విశేష్యవాచకముల సమాసములలో కొన్నింటిలో విశేషణము పూర్వపదముగను కొన్నింటిలో విశేషణ ముత్తరపదముగను

ఉండును ఉపమానోపమేయవాచక సమాసములలో కొన్నింటిలో ఉపమా నము పూర్వపదముగను, కొన్నింటిలో ఉపమాన ముత్తరపదముగను ఉండును

అందువలన కర్మధారయసమాసమును - (1) విశేషణ పూర్వపద కర్మధారయము (2) విశేషణోత్తరపద కర్మధారయము (3) విశేషణోభయ పద కర్మధారయము (4) ఉపమాన పూర్వపద కర్మధారయము, (5) ఉపమానోత్తర పద కర్మధారయము - అని ఐదురకములుగా విభజింపవచ్చును

కర్మధారయ సమాస మేర్పడునపుడు భాషితపుంస్కము ఊఙ్ ప్రత్యయాంతభిన్నమును అగు స్త్రీ ప్రత్యయాంత పూర్వపదమునకు పుంవద్భావము కలుగును అనగా పుంలింగ శబ్దరూపమును బొందునని భావము

ఉదా - మహతీచ సా నవమీచ=మహానవమీ కృష్ణాచ సా చతుర్ద శీచ=కృష్ణచతుర్దశీ పాచకాచ సా స్త్రీచ = పాచకస్త్రీ మహతీచ సా ప్రియాచ=మహాప్రియా సుకేశీ చ సా భార్యాచ=సుకేశభార్యా

## I ఉపమాన పూర్వపద కర్మధారయము

ఉపమానవాచకము సామాన్యవాచకముతో సమసించును

ఉదా - ఘన ఇవ శ్యామః=ఘనశ్యామః మృగీవ చపలా = మృగచపలా

## II ఉపమేయ పూర్వపద కర్మధారయము

1 సామాన్యవాచకప్రయోగము లేనపుడు ఉపమేయవాచకము ఉపమాన వాచకముతో సమసించును ఉదా - పురుషో వ్యాఘ్ర ఇవ=పురుష వ్యాఘ్రః నా సోమ ఇవ=నృసోమః

2 సామాన్యవచక ప్రయోగ మున్నప్పటికిని ఉపమేయవాచకము వృన్దారక, నాగ కుఞ్జర శబ్దములతో సమసించును

ఉదా - గౌః వృన్దారక ఇవ=గోవృన్దారకః (శ్రేష్ఠః) గౌః నాగ ఇవ=గోనాగః (శ్రేష్ఠః) గౌః కుఞ్జర ఇవ = గోకుఞ్జరః (శ్రేష్ఠః)

## III విశేషణోత్తరపద కర్మధారయము

1 విశేష్యవాచకము పోటా, యువతి స్తోక, కతిపయ గృష్టి ధేను వశా వేహత్ బష్కయణీ ప్రవక్తృ శ్రోత్రియ అధ్యాపక, ధూర్త శబ్దములతోడను మతల్లికా మచర్చికా, ప్రకాణ్డమ్ ఉద్ధః తల్లజః మున్నగు ప్రశస్తవాచకశబ్దములతోడను సమసించును

ఉదా - పోటా చ సా ఇభీ చ = ఇభపోటా యువతిశ్చాసౌ ఇభీ చ= ఇభయువతిః మతల్లికా చ సా గౌశ్చ = గోమతల్లిక ప్రకాణ్డమ్ చ సా గౌశ్చ=గోప్రకాణ్డమ్ ఉద్ధశ్చాసౌ గౌశ్చ=గవోద్ధః

2 చతుష్పాజ్జాతి విశేష్యవాచకము గర్భిణీ శబ్దముతో సమసించును

ఉదాః - గర్భిణీ చ సా గౌశ్చ=గోగర్భిణి

3 విశేష్యవాచకమగు శ్రేణ్యాది శబ్దములు కృతాది శబ్దములతో సమసించును (ఈ సమాసము అభూత తద్భావార్థమునందే ఏర్పడును)

ఉదా - అశ్రేణయః శ్రేణయః కృతాః = శ్రేణీకృతాః

4 మయూర వ్యంసకాది గణమునందు పఠింపబడిన కొన్ని సమాసములలో విశేష్యము పూర్వపదముగా నుండును

ఉదా - వ్యంసకశ్చాసౌ మయూరశ్చ = మయూరవ్యంసకః

## IV విశేషణ పూర్వపద కర్మధారయములు

పైన పేర్కొన్న విశేష్యములు తప్ప తక్కిన విశేష్యములతోడి సమాసములలో విశేషణము పూర్వపదముగా నుండును

ఉదా - నీలం చ తత్ ఉత్పలం చ = నీలోత్పలమ్  పూర్వశ్చాసౌ మాసశ్చ = పూర్వమాసః  పాచకశ్చాసౌ బ్రాహ్మణశ్చ = పాచక బ్రాహ్మణః

2. దిగ్వాచకములు  సంఖ్యావాచకములును సంజ్ఞ వాచ్యమగునపుడు విశేష్యవాచకముతో సమసించును
సప్త చ తే ఋషయశ్చ = సప్తర్షయః (సప్తర్షులను పేరుగలవారు)
పూర్వశ్చాసౌ సముద్రశ్చ = పూర్వసముద్రః (తూర్పుసముద్రమను పేరుగలది)

3 పాప అణక అను నిందాహేతు వాచకములు విశేష్యవాచకముతో సమసించును  ఉదా - పాపశ్చాసౌ నాపితశ్చ = పాపనాపితః
అణకశ్చాసౌ కులాలశ్చ = అణకః లాలః

4 సంజ్ఞావాచకములు విశేష్యవాచకముతో సమసించును
ఉదా.— కైలాస ఇతి అద్రిః = కైలాసాద్రిః  అయోధ్యా ఇతి నగరీ = అయోధ్యానగరీ  (దీనికే సంభావనాపూర్వపద కర్మధారయమని ప్రత్యేకవ్యవహారము కలదు)

5 విశేషణ విశేష్యముల సమాసములలో కొన్ని అనియత పూర్వ పదములుగూడ కలవు  కడారాది శబ్దములు కర్మధారయమునందు పూర్వపదముగను ఉత్తరపదముగనుకూడ ప్రయోగింపబడును
ఉదా - కడారశ్చాసౌ జైమినిశ్చ = కడారజైమినిః (లేదా) జైమిని కడారః  అట్లే గడులశాణ్డిల్యః  శాణ్డిల్యగడులః

V విశేషణోభయపద కర్మధారయములు

వీనిలో కొన్ని నియతపూర్వపదములు  అందు పూర్వపదములనే విశేషణ వాచకములుగా గ్రహించి ఉత్తరపదములకు విశేష్యార్థమును చెప్పుకొనవలెను (వీనినిగూడ విశేషణపూర్వపదములుగ కొందరు పేర్కొందురు)

1. ముందు జరిగిన పనిని దెల్పు పదము, తరువాత జరిగిన పనిని దెల్పు పదముతో సమసించునపుడు ముందు జరిగిన పనిని దెల్పునదియే పూర్వపదముగా నుండును ఉదా - (పూర్వం) స్నాతః (పశ్చాత్) అనులిప్తః = స్నాతానులిప్తః

2 సమానాధికరణశబ్దములతో సమసించునపుడు ఏక, సర్వ, జరత్ పురాణ, నవ, కేవల, పూర్వ అపర, ప్రథమ చరమ, జఘన్య సమాన, మధ్య, మధ్యమ, వీర-శబ్దములు పూర్వపదములుగా నుండును ఉదా - ఏకశ్చాసౌ నాథశ్చ=ఏకనాథః, ఏకశ్చాసౌ వీరశ్చ=ఏకవీరః సర్వే చ తే యాజ్ఞికాశ్చ=సర్వయాజ్ఞికాః కేవలాశ్చ తే వైయాకరణాశ్చ = కేవలవైయాకరణాః వీరశ్చాసౌ వైయాకరణశ్చ = వీర వైయాకరణః (వీరశబ్దము ఏకశబ్దముతో సమసించునపుడు మాత్రము ఏకవీరః అనియేయుండును వీరైకః అని యుండదు)

3 నింద్యమానార్థములకు నిందాహేతువాచకములకు సమాసము కలిగినపుడు నింద్యమార్థకశబ్దములు ముందు ప్రయోగింపబడును ఉదా - వైయాకరణశ్చాసౌ ఖసూచిశ్చ = వైయాకరణఖసూచిః, మీమాంసకశ్చాసౌ దుర్దురూటశ్చ = మీమాంసకదుర్దురూటః

4 నఞ్ రహితమైన క్త ప్రత్యయాంతము నఞ్ విశిష్టమైన అదే క్త ప్రత్యయాంతముతో సమసించునపుడు నఞ్ రహిత క్త ప్రత్యయాంతము ముందు ప్రయోగింపబడును ఉదా - కృతం చ తత్ అకృతం చ=కృతాకృతమ్ అశితం చ తత్ అనశితం చ=అశితానశితమ్

5. సత్, మహత్ పరమ, ఉత్తమ, ఉత్కృష్ట శబ్దములు పూజ్యమాన వాచకములతో సమసించునపుడు ముందుండును ఉదా - సంశ్చాసౌ వైద్యశ్చ=సద్వైద్యః ఉత్తమశ్చాసౌ వైద్యశ్చ = ఉత్తమవైద్యః

6 యువన్, యువతి శబ్దములు ఖలతి, పలిత, లివన జరతీ - శబ్దములతో సమసించునపుడు ముందుండును ఉదా - యువా చాసౌ ఖలతిశ్చ = యువఖలతిః యువతిశ్చ సా ఖలతీచ = యువఖలతీ

7 కృత్య ప్రత్యయాంతములు, తుల్యవాచకములును జాతిభిన్నవాచకములతో సమసించును
ఉదా - భోజ్యం చ తత్ ఉష్ణం చ = భోజ్యోష్ణమ్ తుల్యశ్చాసౌ శ్వేతశ్చ=తుల్యశ్వేతః సదృశశ్చాసౌ మహాంశ్చ=సదృశమహాన్.

8. కుమారీ శబ్దము శ్రమణాది శబ్దములతో సమసించును
ఉదా - కుమారీ చ సా శ్రమణా చ = కుమారశ్రమణా.

శక్కిన విశేషణోభయపద కర్మధారయములన్నియు అనియత పూర్వపదములు (కొందఱు వీనినే విశేషణోభయపద కర్మధార యములని పేర్కొందురు) ఉదా - ఖఞ్జ కుబ్జః - కుబ్జ ఖఞ్జః ఖఞ్జ పాచకః పాచక పాచక ఖఞ్జ పారకః - పారక పాచకః.

ఈ క్రిందివానికి కర్మధారయ సమాసము రాదు

1 సమాసము సంజ్ఞావాచకము కానపుడు, దిగ్వాచకము, సంఖ్యావాచకమును విశేష్యముతో సమసించదు ఉదా - పఞ్చబ్రాహ్మణాః, ఉత్తరాః కురువః

2 యత్ ప్రత్యయాంతము జాతివాచకముతో సమసించదు.
ఉదా - భోజ్యః ఓదనః

## ద్విగు స మా స ము

సంఖ్యావాచకము పూర్వపదముగా గల కర్మధారయ విశేషమునకు ద్విగువని పేరు

సమాహారము వాచ్యమగునపుడు సంఖ్యావాచక విశేషణములకు సమానాధికరణశబ్దములతో సమాసము కలుగును. దానికి ద్విగుసమాసమని పేరు ఆ సమాస మెల్లపుడును ఏకవచనమునందుండును

అకారాంతోత్తరపదము కల ద్విగుసమాసము సాధారణముగా స్త్రీలింగమునందుండును దానికి 'ఈ' యను స్త్రీ ప్రత్యయము చేరి చివరి అకారమ లోపించును. ఉదా – త్రయాణాం లోకానాం సమాహారః = త్రిలోకీ. అష్టానాం అధ్యాయానాం సమాహారః=అష్టాధ్యాయీ

కాని పాత్రాది శబ్దములు కొన్ని ఉత్తరపదముగా గల ద్విగు సమాసములు నపుంసకలింగమునం దుండును ఉదా – పఞ్చానాం పాత్రాణాం సమాహారః = పఞ్చపాత్రమ్. త్రయాణాం భువనానాం సమాహారః=త్రిభువనమ్

'ఆ' అను స్త్రీ ప్రత్యయ మంతమందుగల పదము ఉత్తరపదముగా కల ద్విగు సమాసము స్త్రీలింగమునందు నపుంసకలింగమునందును గూడ నుండును నపుంసకలింగమునందు చివరి దీర్ఘమునకు హ్రస్వము వచ్చును స్త్రీలింగమునందు 'ఈ' అను స్త్రీ ప్రత్యయము చేరి చివరి ఆకారము లోపించును ఉదా – పఞ్చానాం ఖట్వానాం సమాహారః=పఞ్చఖట్వీ, పఞ్చఖట్వమ్

బహువ్రీహి సమాసము

సామాన్యముగా అనేక (రెండుగాని అంత కెక్కువగాని) ప్రాతిపదికములకు బహువ్రీహి సమాసమేర్పడును తఱచుగా ఈ సమాసము అన్యపదార్థ ప్రధానముగనుండును అనగా సమాసగత పదార్థములకంటె భిన్నమైన యర్థమును బోధించునని భావము అన్యపదార్థము నందే ఇతరార్థములందుకూడ కొన్నిచోట్ల ఈ సమాస మేర్పడును.

I అన్యపదార్థ ప్రధాన బహువ్రీహి

సమస్యమాన పదార్థములకంటె భిన్నమైన ఒకానొక అప్రథమాంత పదార్థమునందు విశేషణవిశేష్యములగు ప్రథమాంత పదములకు సమాస మేర్పడును అందు విశేషణవాచకము మొదటను విశేష్య వాచకము తరువాతను ఉండును ఆ సమాసము అన్యపదార్థమునకు విశేషణవాచకముగా నుండును

ఉదా - ప్రాప్తం ఉదకం యం సః = ప్రాప్తోదకః (గ్రామః)
కృతం కార్యం యేన సః = కృతకార్యః (పురుషః)
దత్తం ధనం యస్మై సః = దత్తధనః (నరః)
పతితాని పర్ణాని యస్మాత్ సః=పతితపర్ణః (వృక్షః)
పీతం అమ్బరం యస్య సః=పీతామ్బరః (విష్ణుః)
వీరాః పురుషాః యస్మిన్ సః=వీరపురుషకః (దేశః)

పై సమాసములు యం, యేన - మున్నగువానిచే తెలుపబడు అన్య పదార్థమును ప్రధానముగా బోధించుచున్నవి సమస్యమానపదము లన్నియు సమానాధికరణములు ఆ సమాసములన్నియు అన్య పదార్థమునకు విశేషణవాచకములు ఇట్టిసమాసములను సమానాధికరణ బహువ్రీహిసమాసము లందురు ఈ సమాసములలో కొన్నిచోట్ల మధ్యమపదలోపము కూడ కలుగవచ్చును

2 ఉపసర్గ పూర్వకమైన ధాతుజ విశేషణములకు మరియొకపదముతో బహువ్రీహి సమాసమేర్పడును ఉపసర్గ మిగిలి ధాతుజవిశేషణము నకు వికల్పముగా లోపము కలుగును

ఉదా - ప్రపతితాని పర్ణాని యస్మాత్ సః = ప్రపర్ణః ప్రపతితపర్ణః
ఉన్నతం మస్తకం యస్యాః సా =ఉన్మస్తకా ఉన్నతమస్తకా

3 నఞ్ పూర్వకమైన విద్యమానార్థక శబ్దమునకు మరియొకపదముతో సమాసము కలుగునపుడు వికల్పముగా విద్యమానార్థక శబ్దము లోపించును.

ఉదా - అవిద్యమానః పుత్రః యస్య సః = అపుత్రః అవిద్యమాన పుత్రః

4 ఉపమాన వాచకమగు పదము సమానాధికరణపదముతో సమసించును

ఉదా - చన్ద్ర ఇవ ముఖం యస్యాః సా=చన్ద్రముఖీ

పుణ్డరీకే ఇవ అక్షిణీ యస్య సః = పుణ్డరీకాక్షః

5 సఙ్జాత వికారశబ్దములతోడి షష్ఠీతత్పురుష సమాసము, సప్తమ్యంతము పూర్వపదముగా గల సమాసము ఉపమాన వాచకమగు సమాసము (ఉపమార్థమునందు) సమానాధికరణ శబ్దముతో సమసించునపుడు పూర్వపదమగు సమాసములోని ఉత్తరపదము లోపించును

ఉదా - కేశసఙ్జాతః చూడా యస్య సః=కేశచూడః

సువర్ణ వికారః అలఙ్కారః యస్య సః = సువర్ణాలఙ్కారః

కణ్ఠేస్థః కాలః యస్య సః = కణ్ఠేకాలః

మృగనయనే ఇవ నయనే యస్యాః సా=మృగనయనా

రెండు పదములకేకాక మూడు సమానాధికరణ పదములకు కూడ బహువ్రీహి సమాసము కలుగవచ్చును

ఉదా - శ్యామం ఉజ్జ్వలం వపుః యస్య సః=శ్యామోజ్జ్వలవపుః

ప్రియాః చిత్రాః గావః యస్య సః=ప్రియచిత్రగుః

సమానాధికరణ బహువ్రీహియందు స్త్రీలింగమగు ఉత్తరపదము పరమగునపుడు పూర్వపదమునకు పుంవద్భావము కలుగును

ఉదా - సున్దరీ భార్యా యస్య సః=సున్దరభార్యః

యువతిః పత్నీ యస్య సః=యువపత్నీకః

అన్యపదార్థ ప్రధాన బహువ్రీహి కొన్నిచోట్ల విభిన్న విభక్త్యంత ములకు గూడ కలుగును అట్టి దానివి వ్యధికరణ బహువ్రీహి యందురు

6 ప్రథమాంతము సప్తమ్యంతముతో అన్యపదార్థ ప్రాధాన్యమునందు సమసించును ఉదా - చక్రం పాణౌ యస్య సః=చక్రపాణిః, కాలః కణ్ఠే యస్య సః=కాలకణ్ఠః

పైన పేర్కొనబడిన సమాసములేకాక మఱికొన్ని రకములైన బహువ్రీహి సమాసములు కూడ కలవు

II రెండు దిగ్వాచకములు అంతరాళమగు విదిక్కు (అనగా వానినడుమ నుండు మూల) అను అర్థమునందు సమసించును దీనిని అంతరాళార్థక బహువ్రీహి అందురు

ఉదా - దక్షిణస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశః అన్తరాళమ్ = దక్షిణపూర్వా (ఆగ్నేయము) ఉత్తరస్యాశ్చ పూర్వస్యాశ్చదిశః అన్తరాళమ్=ఉత్తరపూర్వా (ఈశాన్యము)

III ఒండొరులను పట్టుకొని చేయు యుద్ధము అను అర్థములో పట్టుకొనబడు అవయవములను దెల్పు రెండు సప్తమ్యంత సరూపపదములు ఒండొరులను కొట్టుచు చేయు యుద్ధము అను అర్థములో కొట్టుకొను సాధనములను దెల్పు రెండు తృతీయాంత సరూప పదములును సమసించును అందలి పూర్వపదాంత్యమునకు దీర్ఘమువచ్చును ఉత్తరపదాంత్యమునకు ఇకారము చేరును దీనిని కర్మవ్యతీహారార్థక బహువ్రీహి యందురు ఈ సమాసము అవ్యయముగ నుండును

ఉదా - కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తమ్ = కేశాకేశి

దణ్డైశ్చ దణ్డైశ్చ ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవృత్తమ్=దణ్డాదణ్డి

IV సహ అను అవ్యయము తృతీయాంతముతో సమసించును సహ అనునది పూర్వపదముగ నుండును. సమాసమునందు సహ అనుదానికి వికల్పముగా స అను వాదేశము వచ్చును దీనిని సహార్థక బహువ్రీహి యందురు

ఉదా.- పుత్రేణ సహ (లేక) సహ పుత్రేణ=సపుత్రః సహపుత్రః
శిష్యైః సహ (లేక) సహ శిష్యైః = సశిష్యః సహశిష్యః

కాని గో, వత్స, హల శబ్దములతోడి సమాసమునందుతప్ప తక్కిన శబ్దములతోడి సమాసమునందు ఆశీర్వాదవాక్యమున సహ అనుదానికి స అను వాదేశమురాదు

ఉదా.- స్వస్తి రాజ్ఞే సహ పుత్రాయ, సహామాత్యాయ చ. సగవే (లేక) సహగవే రాజ్ఞే స్వస్తి

V అవ్యయము, అసన్న అదూర అధిక శబ్దములు, సంఖ్యావాచకములును సంఖ్యేయార్థబోధక సంఖ్యాశబ్దముతో సమసించును (దీనిని సంఖ్యార్థక బహువ్రీహి యందురు) ఈ సమాసాంతమునందు 'అ' అను సమాసాంత ప్రత్యయము చేరును అది పరమగునపుడు వింశతి శబ్దములో 'అతి అనునది తక్కిన అజంతశబ్దములలో చివరి యచ్చు హలంతశబ్దములలో చివరి హల్లు దానికి ముందున్న అచ్చును లోపించును

ఉదా - దశానాం సమీపే యే సన్తితే=ఉపదశాః (తొమ్మిది) లే పదునొకండు. వింశతేః ఆసన్నాః = ఆసన్న వింశాః (ఇరువది దగ్గఱగా నున్నవి) త్రింశతః అదూరాః=అదూరత్రింశాః (ముప్పది దూరమున లేనివి) చత్వారింశతః అధికాః = అధిక చత్వారింశా (నలుబదికంటె ఎక్కువయైనవి) ద్విః ఆవృత్తాః దశ = ద్విదశా (రెండుపదులు)

VI రెండుసంఖ్యలలో నేదియో యొకటి అను అర్థములో ఆ రెండు సంఖ్యావాచకములను సమసించును (దీనికి వికల్పార్థక బహువ్రీహి యందురు) ఈ సమాసములలోగూడ పై సమాసములందువలెనే సమాసాంతకార్యములు జరుగును

ఉదా - ద్వౌ వా త్రయో వా=ద్విత్రాః (రెండుగాని మూడుగాని) పఞ్చ వా షడ్వా=పఞ్చషాః (ఐదుగాని ఆరుగాని) త్రయో వా చత్వారో వా = త్రిచతురాః (మూడుగాని నాలుగుగాని) (చతుర్ శబ్దములో అంత్యమునకు లోపమురాదు )

## సమాసాంత కార్యములు

1 బహువ్రీహి సమాసమునందు ఉత్తరపదము ఋకారాంతమగునపుడు కొన్ని ఈకారాంత, ఊకారాంత స్త్రీలింగశబ్దము లగునపుడును ఆ సమాసమునకు పరముగా 'క' అను సమాసాంత ప్రత్యయము చేరును

ఉదా - ఈశ్వరః కర్తా యస్య తత్=ఈశ్వరకర్తృకమ్.
బహ్వ్యః నద్యః యస్మిన్ సః=బహునదీకః
రూపవతీ వధూః యస్య సః=రూపవద్వధూకః

2. బహువ్రీహి సమాసాంతమందలి అక్షి ధనుష్ శబ్దములు అక్ష ధన్వన్ శబ్దములుగా మారును

ఉదా - కమలే ఇవ అక్షిణీ యస్య సః = కమలాక్షః
అధిజ్యం ధనుః యస్య సః = అధిజ్యధన్వా

3 ఉద్ పూతి సు సురభి శబ్దములు పూర్వమందున్నపుడు, ఉపమానము గమ్యమగునపుడును బహువ్రీహి సమాసాంతమునందలి గంధశబ్దము గంధిశబ్దముగా మారును

ఉదా - ఉద్గతః గన్ధః యస్యతత్=ఉద్గంధి పూతిః గన్ధః యస్యతత్ = పూతిగన్ధి శోభనః గన్ధః యస్యతత్ = సుగన్ధి సురభిః గన్ధః యస్య తత్=సురభిగన్ధి పద్మగన్ధస్యేవ గన్ధః యస్య తత్=పద్మగన్ధి

4 ఒకేశబ్దము పూర్వపదముగా నున్నపుడును బహువ్రీహి సమాసాంతము నందలి ధర్మశబ్దము ధర్మన్ శబ్దముగా మారును

ఉదా.- కల్యాణో ధర్మో యస్య సః=కల్యాణధర్మా

5 బహువ్రీహి సమాసాంతమునందలి జాయాశబ్దము జానిశబ్దముగా మారును

ఉదా - సీతా జాయా యస్య సః=సీతాజానిః
యువతిః జాయా యస్య సః=యువజానిః

6 సమాసాంతమునందు మార్పుగాని ఆగమముగాని రానపుడు అన్యపదార్థ ప్రధాన బహువ్రీహికి చివర వికల్పముగా 'క' అను సమాసాంత ప్రత్యయము చేరును

ఉదా - మహాన్ యశః యస్య సః=మహాయశస్కః మహాయశాః

7 కప్రత్యయము చేరనపుడు బహువ్రీహి సమాసాంతమంద గోశబ్దమునకు ఆకారాంత స్త్రీలింగశబ్దమునకు చివరి యచ్చునకు హ్రస్వము వచ్చును

ఉదా.- చిత్రాః గావః యస్య సః=చిత్రగుః లక్ష్మీః భార్యా యస్య సః=లక్ష్మీభార్యః

8. సమాసాంతమున కప్రత్యయము పరమగునపుడు ఆకారమునకు హ్రస్వము వికల్పముగా వచ్చును.

ఉదా - లక్ష్మీభార్యాకః లక్ష్మీభార్యకః

## అవ్యయీభావ సమాసము

అవ్యయీభావ సమాసము సామాన్యముగా ఒక అవ్యయము ఒక సుబంతమును కలయుటచే నేర్పడును తఱుచుగా ఆ సమాసమునందు అవ్యయము పూర్వపదముగా నుండును కాని కొన్నింటిలో అవ్యయము త్తరపదముగా నుండును కేవలము రెండు సుబంతములకు కలుగు అవ్యయీభావ సమాసములుగూడ కొన్ని కలవు కావున అవ్యయీభావ సమాసములను – అవ్యయపూర్వపదములు అవ్యయోత్తరపదములు, అవ్యయరహితములు – అని మూడురకములుగా గ్రహింపవచ్చును

ఉదా – అపదిశమ్ శాకప్రతి సప్తగఙ్గమ్

అవ్యయీభావసమాస మేర్పడినపుడు రెండవపదము చివరనున్న దీర్ఘమునకు హ్రస్వమువచ్చును ఉదా – అపదిశా=అపదిశ=అపదిశమ్. సప్తగఙ్గా=సప్తగఙ్గ=సప్తగఙ్గమ్

అవ్యయీభావసమాసములన్నియు అవ్యయములు అందుచే కేవలావ్యయములకు వలెనే వీని చివరగూడ విభక్తిప్రత్యయము లుండవు అవగా అవి లోపించునని భావము కాని అకారాంతవ్యయీభావముకంటె పరమయిన పంచమీవిభక్తికి లోపమురాదు తృతీయాసప్తమీ విభక్తులకు వికల్పముగా లోపము కలుగును విభక్తి ప్రత్యయములకు లోపము కలిగినపుడు సమాసము చివరి అకారమునకు బదులు అమ్ అనునది చేరును

ఉదా – దిశయోః మధ్యమ్ = అపదిశమ్ దిశయోః మధ్యేన = అపదిశమ్–అపదిశేన దిశయోః మధ్యాత్=అపదిశాత్ దిశయోః మధ్యే = అపదిశమ్ – అపదిశే

అకారాంతేతరములగు అవ్యయీభావములకంతటను విభక్తి ప్రత్యయములు లోపించును ఉదా – అధిహరి

పై వానినిబట్టి అవ్యయీభావసమాసములన్నియు ఆ శబ్దము యొక్క నపుంసకలింగ ప్రథమైకవచనరూపములో నుండుననియు, అకారాంతవ్యయీభావములు మాత్రము తృతీయా పంచమీ సప్తమ్యంత రూపములలోగూడ నుండుననియు గ్రహింపదగును

ఇందు సమసింపబోవు అవ్యయములకు సామాన్యముగా ఆ యా అర్థములలో విడిగ ప్రయోగముండకపోవుటచే సమాసములలో ఆ యవ్యయములచే బోధింపబడునట్టి అర్థములుగల సుబంతములతో విగ్రహ వాక్యములు చెప్పబడును

## అవ్యయపూర్వపదావ్యయీభావము

1 విభక్తియొక్క అర్థమునందు సమీప సమృద్ధి మున్నగు అర్థములయందునుండు అవ్యయము సుబంతముతో సమసించును

ఉదా - హరౌ ఇతి=అధిహరి = హరియందు (ఇందు అధి అను అవ్యయము సప్తమీవిభక్త్యర్థకము)

అస్త్రే—లతాయాన్ ఇతి=అధిలతమ్
కృష్ణస్య సమీపం=ఉపకృష్ణమ్
యవనానాం వృద్ధిః=దుర్యవనమ్
హిమస్య అత్యయః=అతిహిమమ్
హరిశబ్దస్య ప్రకాశః=ఇతిహరి
రూపస్యయోగ్యమ్=అనురూపమ్
శక్తి మనతిక్రమ్య=యథాశక్తి
జ్యేష్ఠస్య అనుపూర్వ్యేణ=అనుజ్యేష్ఠమ్
పూర్వాహ్ణస్య సాకల్యే=సహపూర్వాహ్ణమ్
క్షత్రాణాం సంపత్తిః=సక్షత్రమ్

విష్ణోః సమీపమ్=ఉపవిష్ణు
మద్రాణాం సమృద్ధిః=సమ్మద్రమ్
మక్షికాణా మభావః=నిర్మక్షికమ్
నిద్రాసంప్రతినయుజ్యతే=అతినిద్రమ్
విష్ణోః పశ్చాత్=అనువిష్ణు
అర్థమ్ అర్థమ్ ప్రతి=ప్రత్యర్థమ్
హరేః సాదృశ్యమ్=సహరి
చక్రేణ యుగపత్=సచక్రమ్
సదృశః సఖ్యా=ససఖి
బుద్ధే రాధిక్యమ్=సమృద్ధి

తృణమప్యపరిత్యజ్య=సతృణమ్
యావన్తః శ్లోకాః=యావచ్ఛ్లోకమ్
విష్ణోః అప=అపవిష్ణు
వనాత్ బహిః=బహిర్వనమ్ బహిర్వనాత్
ముక్తేః పర్యన్తమ్=ఆముక్తి ఆముక్తేః
అగ్నిమ్ అభి=అభ్యగ్ని
వనస్య సమీపమ్=అనువనమ్

అగ్ని గన్థ పర్యన్తమ్=సాగ్ని
దిశయోర్మధ్యమ్=అపదిశమ్
విష్ణోః పరి=పరివిష్ణు
వనాత్ ప్రాక్=ప్రాగ్వనమ్ ప్రాగ్వనాత్
బాలాన్ అభివ్యాప్య=ఆబాలమ్ ఆబాలేభ్యః
అగ్నిమ్ ప్రతి=ప్రత్యగ్ని
గఙ్గాయాః దైర్ఘ్యమివ దైర్ఘ్యం యస్య=అనుగఙ్గమ్.

## అవ్యయోత్తరపదవ్యయీభావము

2 సుబంతము లేశము అను నర్థముకల ప్రతి అను అవ్యయముతో సమసించును ఉదా - శాకస్య లేశః=శాకప్రతి

3 అక్ష శలాకా శబ్దములు సంఖ్యావాచకములును పరి అను నవ్యయముతో ద్యూతవ్యవహారార్థమున పరాజయ ద్యోతనమునందు సమసించును ఉదా - అక్షేణ విపరీతం వృత్తమ్=అక్షపరి శలాకయా విపరీతం వృత్తమ్=శలాకాపరి ఏకేన విపరీతం వృత్తమ్=ఏకపరి ద్వాభ్యామ్ విపరీతమ్ వృత్తమ్=ద్విపరి

## అవ్యయరహితావ్యయీభావములు

4 అఞ్చ్ ధాతునిష్పన్నములయిన శబ్దములు పఞ్చమ్యంతముతో సమసించును ఉదా - ప్రాక వనాత్=ప్రాగ్వనం, ప్రాగ్వనాత్

5 పార, మధ్య అను శబ్దములు షష్ఠ్యంతముతో సమసించును అప్పుడు అవి పారే మధ్యే అని మారును

గఙ్గాయాః పారమ్=పారేగఙ్గమ్ గఙ్గాయాః మధ్యమ్=మధ్యేగఙ్గమ్

వీనికి షష్ఠీతత్పురుష సమాసముకూడ వికల్పముగా నగును

ఉదా - గఙ్గాయాఃపారమ్=గఙ్గాపారమ్ గఙ్గాయాః మధ్యమ్=గఙ్గామధ్యమ్

6 సంఖ్యావాచకము విద్యాసంతతి వాచకముతోడను, జన్మసంతతి వాచకముతోడను సమసించును ఉదా - ద్వౌమునీ వంశ్యౌ = ద్విముని త్రయః మునయః వంశ్యాః=త్రిముని

ఏకవింశతిః భారద్వాజస్య వంశ్యాః=ఏకవింశతి భారద్వాజమ్

7 సమాహారార్థమునందు సంఖ్యావాచకము నదీవాచకముతో సమసించును

ఉదా - సప్తానాం గఙ్గానాం సమాహారః=సప్తగఙ్గమ్
ద్వయోః యమునయోః సమాహారః=ద్వియమునమ్
పఞ్చానామ్ నదానాం సమాహారః=పఞ్చనదమ్
సప్తానాం గోదావరీణాం సమాహారః=సప్తగోదావరమ్

8 విశేషణవాచకము నదీవాచకముతో సమసించును ఆ సమాసము అన్యపదార్థమునకు సంజ్ఞావాచకమగును ఉదా - ఉన్మత్తా గఙ్గా యస్మిన్ సః=ఉన్మత్తగఙ్గమ్ లోహితా గఙ్గా యస్మిన్ సః=లోహితగఙ్గమ్ (ఈ రెండును దేశముల పేర్లు)

## సమాసాంత కార్యములు

1 అవ్యయీభావాంతమునందలి శరదాదులకంటె పరముగా అ అను సమాసాంత ప్రత్యయముచేరి ఆ సమాసము అకారాంత మగును (శరద్ విపాశ్-మొన్నగునవి శరదాదులు) ఉదా - శరదః సమీపమ్= ఉపశరద్+అ=ఉపశరదమ్ విపాశః ప్రతి=ప్రతివిపాశ్+అ = ప్రతివిపాశమ్ (విపాశ్ శబ్దము ఒకనదికి పేరు) జరాయాః సమీపమ్=ఉపజరస్+అ=ఉపజరసమ్

2 అవ్యయీ భావసమాసమునందు ప్రతి పర సమ అను వాని కంటె పరమయిన అక్షి శబ్దము చివరి ఇకారము పోయి అకారము చేరును ఉదా - అక్షిణీప్రతి = ప్రత్యక్షమ్ అక్ష్ణః పరమ్ = పరోక్షమ్ అక్ష్ణోః యోగ్యమ్=సమక్షమ్ అక్ష్ణోః పశ్చాత్=అన్వక్షమ్

3 అవ్యయీభావాంతమందలి అన్నంతశబ్దములలో అన్ అనునది లోపించి అకారము చేరను నపుంసకలింగమగు అన్నంత శబ్దమునకు వికల్పముగా జేరును ఉదా -రాజ్ఞః సమీపమ్=ఉప+రాజన్=ఉపరాజమ్ ఆత్మని ఇతి=అధి+ఆత్మన్ =అధ్యాత్మమ్ చర్మణః సమీపమ్ = ఉప+ చర్మన్=ఉపచర్మమ్ (లేక) ఉపచర్మ

4 అవ్యయీభావ సమాసాంతమునందు వికల్పముగా నదీ పౌర్ణమాసీ అగ్రహాయణీశబ్దముల ఈకారము లోపించి అకారముచేరును ఉదా - నద్యాః సమీపమ్=ఉపనదమ్ ఉపనది పౌర్ణమాస్యాః సమీపమ్= ఉపపౌర్ణమాసమ్ ఉపపౌర్ణమాసి అగ్రహాయణ్యాః సమీపమ్ = ఉపా గ్రహాయణమ్ ఉపాగ్రహాయణి (అగ్రహాయణి యనగా మార్గశిర పౌర్ణమి యని యర్థము )

5 ఝయంతములగు అవ్యయీభావములకంటె పరముగా వికల్ప ముగా జేరును సమిధః సమీపమ్=ఉపసమిధమ్ ఉపసమిత్ గిరేః సమీ పమ్=ఉపగిరమ్ ఉపగిరి

## కేవల సమాసము

పైన పేరొ్కనబడిన ద్వంద్వ తత్పురుషాది సమాసలక్షణములకు సరిపడని సమాసములు కొన్ని కలవు అట్టి వానిని సామాన్య సమాస ములు లేక కేవల సమాసములు అని యందురు

ఉదా - పూర్వం భూతః=భూతపూర్వం విస్పష్టం పటుః=విస్పష్ట పటుః న అన్తరీయకమ్ = నాన్తరీయకమ్ ఆత్మనే పదమ్ = ఆత్మనే పదమ్ - మున్నగునవి

## ఏకశేషము

ఇది ద్వంద్వసమాసమునకు అపవాదమయినది రెండు పదములకు ద్వంద్వసమాసము కలిగినపుడు ఆ రెండును కలిసి యేకపదమై దాని చివర విభక్తి ప్రత్యయము చేరును కాని యేకశేషములో ఆ రెంటిలో ఒకటిమాత్రమే మిగిలియుండి దానికి అర్థమును బట్టి ద్వివచన ప్రత్యయము గాని బహువచన ప్రత్యయముగాని చేరుచుండును

1 సమాస ప్రకృతికములయిన ఒక పుంలింగ శబ్దమునకు ఒక స్త్రీలింగ శబ్దమునకును సమాసము కలుగునపుడు అందు పుంలింగ శబ్దము మిగులును

ఉదా - హంసీచ హంసశ్చ=హంసౌ

2 భ్రాతృ స్వసృ శబ్దములకు సమాసము కలుగునపుడు భ్రాతృ శబ్దము, పుత్ర దుహితృ శబ్దములకు సమాసము కలుగునపుడు పుత్ర శబ్దమును మిగులును

ఉదా - భ్రాతాచ స్వసాచ=భ్రాతరౌ పుత్రశ్చ దుహితాచ=పుత్రౌ

3 మాతృ పితృశబ్దములకు సమాసము కలుగునపుడు పితృ శబ్దము వికల్పముగా మిగులును

ఉదా - మాతాచ పితాచ = పితరౌ మాతాపితరౌ

4 శ్వశ్రూ శ్వశుర శబ్దములకు సమాసము కలుగునపుడు శ్వశుర శబ్దము వికల్పముగా మిగులును

ఉదా - శ్వశ్రూశ్చ శ్వశురశ్చ = శ్వశురౌ శ్వశ్రూశ్వశురౌ

అష్టాదశః పాఠః - పదునెనిమిదవ పాఠము

# అర్ధధాతుక లకారములు

---

ధాతువునకు జేరు ప్రత్యయములు రెండురకములు — 1) సార్వ ధాతుకములు, 2) అర్ధధాతుకములు

ఇంతకుముందు చెప్పబడిన లట్, లఙ్, లోట్, విధిలిఙ్ అను నాల్గు లకారముల తిఙ్ ప్రత్యయములును సార్వధాతుకప్రత్యయములు. అందుచే ఆ లకారములు గూడ సార్వధాతుక లకారము లనబడును లిట్ లుట్ లృట్, ఆశీర్లిఙ్, లుఙ్ లృఙ్-అను ఆరు లకారముల తిఙ్ ప్రత్యయములును అర్ధధాతుకప్రత్యయములు. అందుచే ఈ ఆరు లకారములుగూడ అర్ధధాతుక లకారములనబడును ఇట్లే ధాతువులకు జేరు ప్రత్యయములన్నింటిలో - వికరణములలో కృత్తులలోగూడ ఈ భేదము కలదు

### లిట్

ఏకాచ్కములయిన కొన్ని మూలధాతువులకంటె పరమయిన వలాద్యార్ధ ధాతుకమునకు (యకారేతర హలాదియగు అర్ధధాతుక ప్రత్యయమునకు) ముందు ఇకారమాగమముగా చేరును ఏ ధాతువుల కంటె పరమయిన వలాద్యార్ధ ధాతుకములకుముందు ఇకారాగమము వచ్చునో ఆ ధాతువులను సేట్ ధాతువులనియు తక్కినవానిని అనిట్ ధాతువు లనియు వ్యవహరింతురు

అజంత ధాతువులలో ఊకారాంత ౠకారాంత ధాతువులు, యు, రు క్ష్ణు శ్వి స్ను ను, క్షు, శ్వి డీ శ్రీ, వృ (ఆత్మనేపది) వృ (ఉభయ

పది) - అను 12 ధాతువులును సేట్ ధాతువులు తక్కినవి అనిట్ ధాతువులు

హలంతధాతువులలో శక్ పచ్ ముచ్-మున్నగు 102 ధాతువులు అనిట్ ధాతువులు. తక్కినవి సేట్ ధాతువులు

అనేకాచ్కములయిన మూలధాతువులు పదవగణము ధాతువులు, ప్రేరణార్థక ధాతువులు, సన్నంత ధాతువులు - మున్నగు సనాద్యంత ధాతువులు అన్నియును సేడ్ధాతువులే

| పరస్మైపద లిట్ ప్రత్యయములు | ఆత్మనేపద లిట్ ప్రత్యయములు |
|---|---|
| అ - అతుః - ఉః | ఏ - ఆతే - ఇరే |
| థ - అథుః - అ | సే - ఆథే - ధ్వే |
| అ - వ - మ | ఏ - వహే - మహే |

పైవానిలో థ వ మ అను పరస్మైపద ప్రత్యయములు, సే ధ్వే వహే మహే - అను ఆత్మనేపద ప్రత్యయములును వలాద్యార్ధ ధాతుకములు పరస్మైపద లిట్ ప్రత్యయములలో ఏకవచనము లన్నియు దృఢప్రత్యయములు ద్వి బహువచనములన్నియును దుర్బల ప్రత్యయములు ఆత్మనేపద లిట్ ప్రత్యయములన్నియును దుర్బల ప్రత్యయములే

సామాన్యముగా దృఢప్రత్యయములు పరమగునపుడు దానికి ముందున్న ఇక్కునకు, ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణము వచ్చును కాని లిట్టుయొక్క దృఢప్రత్యయములలో ప్రథమపురుషైక వచన ప్రత్యయము పరమగునపుడు దానికి ముందున్న ఇక్కునకు ఉపధ యగు అకారమునకును వృద్ధియు ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణమును వచ్చును ఉత్తమపురుషైకవచన ప్రత్యయము పరమగునపుడు

దానికి ముందున్న ఇక్కునకు ఉపధయగు అకారమునకును వృద్ధి వికల్పముగా వచ్చును వృద్ధి రానివక్షమున గుణము వచ్చును ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణము వచ్చును మధ్యమపురుషైకవచన ప్రత్యయము పరమగునపుడు దానికి ముందున్న ఇక్కునకు ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణమే వచ్చును

లిట్ ప్రత్యయములు పరమగునపుడు సామాన్యముగా అన్ని ధాతువులకును మూడవ గణమునందలి ధాతువులకువలె ద్విరుక్తియు అభ్యాసకార్యములును కలుగును

సార్వధాతుక లకారములలో ధాతువునకు వచ్చిన ఆదేశములు అర్ధధాతుక లకారములయందు రావు మూలధాతువులనుండియే అర్ధధాతుక లకారాంత రూపము లేర్పడును

లిట్ రూపములు

| (పరస్మైపదము) | (ఆత్మనేపదము) |
|---|---|
| బుబోధ-బుబుధతుః-బుబుధుః | బుబుధే-బుబుధాతే-బుబుధిరే |
| బుబోధిథ-బుబుధథుః-బుబుధ | బుబుధిషే-బుబుధాథే-బుబుధిధ్వే |
| బుబోధ-బుబుధివ-బుబుధిమ | బుబుధే-బుబుధివహే-బుబుధిమహే |

పైవానిలో బుధ్ అనునది ధాతువు దానికి లిట్ ప్రత్యయములు పరమగునపుడు ధాతుద్విరుక్తియు అభ్యాస కార్యములును కలుగగా 'బుబుధ్' అను ప్రకృతి యేర్పడును దృఢప్రత్యయములు పరమగునపుడు ఆ ప్రకృతి యందలి ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణము వచ్చి 'బుబోధ్' అని యగును బుధ్ అనునది సేడ్ధాతువగుటచే వలాద్యార్ధధాతుకములకు ఇడాగమము వచ్చును ఈవిధముగా పైరూపములు నిష్పన్నములగును

| (పరస్మైపదము) | (ఆత్మనేపదము) |
| --- | --- |
| చకార - చక్రతుః - చక్రుః | చక్రే - చక్రాతే - చక్రిరే |
| చకర్థ - చక్రథుః - చక్ర | చకృషే - చక్రాథే - చకృఢ్వే |
| చకార / చకర } - చకృవ - చకృమ | చక్రే - చకృవహే - చకృమహే |

పై వానిలో 'కృ' అనునది ధాతువు దానికి లిట్ ప్రత్యయములు పరమగునపుడు ధాతుద్విత్వము, అభ్యాసకార్యములును కలిగి 'చకృ' అను ప్రకృతి యేర్పడును దానికి పరస్మైపద ప్రత్యయములలో ప్రథమపురుష ఏకవచన ప్రత్యయము పరమగునపుడు ఋకారమునకు వృద్ధివచ్చి 'చకార' అను రూపమేర్పడును ఉత్తమ పురుషైకవచన ప్రత్యయము పరమగునపుడు ఋకారమునకు వికల్పముగా వృద్ధియు అది రాని పక్షమున గుణమును వచ్చి చకార, చకర అను రెండు రూపము లేర్పడును ఇది అనిడ్ధాతువగుటచే ఇడాగమము రాదు

అ ఆ ఋ తప్ప తక్కిన యచ్చులకంటె పరమయిన ఇడాగమ రహితధ్వేప్రత్యయ ధకారమునకు ఢకారాదేశమగును

ఉదా - చకృ + ధ్వే = చకృఢ్వే

అర్థమునుబట్టి లిడంతపదములకు సామాన్యముగా ప్రథమపురుష యందు మాత్రమే ప్రయోగములుండును మధ్యమోత్తమ పురుషల యందు ప్రయోగావకాశములు తక్కువ అందుచే ప్రథమపురుష క్రియా పదములను గురించి మాత్రమే యిచ్చట వివరింపబడును

(వీ)- (పరస్మై) నినాయ - నిన్యతుః - నిన్యుః
(ఆత్మనే) నిన్యే - నిన్యాతే - నిన్యిరే

నినీ + అ = నినాయ
నినీ+అతుః = నిన్యతుః
(సూ-238)

(మూ) - (పరస్మై) మమావ - మమవతుః - మమవుః (మమూ+అతు) =
మమవతుః (సూ-224)

(ధూ) - ,, దుధావ - దుధువతుః - దుధువుః

సంయుక్తపూర్వక ఋకారాంత ధాతువులయొక్కయు, ౠకారాంత ధాతువులయొక్కయు జాగృధాతువుయొక్కయు, ఋధాతువుయొక్కయు, చివరి ఋ ౠలకు లిట్టుయొక్క దుర్బలప్రత్యయములు పరమగునపుడు కూడ గుణము వచ్చును

(స్మృ) - (పరస్మై) సస్మార - సస్మరతుః - సస్మరుః

(కౄ) - ,, చకార - చకరతుః - చకరుః

(జాగృ) - ,, జజాగార - జజాగరతుః - జజాగరుః

ఈ జాగృ ధాతువునకు, ముందు చెప్పబోవునట్టి జాగరాఞ్చకార - మన్నగు 'ఆమ ప్రయోగ' రూపముగూడ నుండును)

(ఋ)-(పరస్మై) ఆర-ఆరతుః-ఆరుః (ఋ + ఋ+అ= అ +ఋ+అ= అ +అర్+అ=ఆర అ + ఋ + అతుః=అ + అర్ + అతుః=ఆరతుః)

శౄ, దౄ పౄ అను ధాతువుల ఋకారమునకు లిట్టుయొక్క దుర్బల ప్రత్యయము పరమగునపుడు వికల్పముగా గుణము వచ్చును. గుణము రాని పక్షమున హ్రస్వము వచ్చును

(శౄ) - (పరస్మై) శశార-శశరతుః / శశ్రతుః - శశరుః / శశ్రుః

(దౄ) - ,, దదార-దదరతుః / దద్రతుః - దదరుః / దద్రుః

(పౄ) - ,, పపార-పపరతుః / పప్రతుః - పపరుః / పప్రుః

శౄ + అతుః = శశౄ +అతుః=శశరతుః (లేక) శశ్ర+అతుః= శశ్రతుః (సూ-67)

ఆకారాంత ధాతువులకంటె పరమయిన 'అ' అను లిట్ ప్రథమ పురుషైకవచన ప్రత్యయమునకు ఔకారాదేశమగును

అజాది దుర్బలార్ధధాతుక ప్రత్యయము పరమగునపుడు ధాతువు చివరి ఆకారమునకు లోపము వచ్చును

(జ్ఞా) - (పరస్మై) జజ్ఞౌ-జజ్ఞతుః-జజ్ఞుః (జజ్ఞా+ అ =జజ్ఞా + ఔ = జజ్ఞౌ
(సూ-21) జజ్ఞా + అతుః = జజ్ఞ్ + అతుః = జజ్ఞతుః

సూ - 26 సార్వధాతుక లకారములందు శతృ శానచ్ ప్రత్యయములు పరమగునపుడును తప్ప తక్కిన ప్రత్యయములు పరమగునపుడు ధాతువు చివరి ఏ ఓ ఐ - అనువానికి ఆకారాదేశము వచ్చును (అప్పుడు వానికి ఆకారాంత ధాతువులవలె రూపము లేర్పడును )

(ధే) - (పరస్మై) దధౌ - దధతుః - దధుః

(గ్లై) - (పరస్మై) జగ్లౌ - జగ్లతుః - జగ్లుః

సూ-262 భూధాతువుయొక్క అభ్యాసమునందలి ఉకారమునకు అకారమాదేశమగును అజాదులగు లిట్ లుఙ్ ప్రత్యయములు పరమగునపుడు భూధాతువు చివర వకార మాగమముగా చేరును అస్ ధాతువునకు లిట్టునందు 'భూ' అనునది ఆదేశమగును

భూ<br>అస్ } - (పరస్మై) బభూవ - బభూవతుః - బభూవుః

సూ-263 అభ్యాసముకంటె పరమగు జిధాతువు జకారమునకు గకారమును, హి ధాతువు హకారమునకు ఘకారమును ఆదేశమగును చి ధాతువు చకారమునకు వికల్పముగా కకారాదేశమగును

(జి) - (పరస్మై) జిగాయ - జిగ్యతుః - జిగ్యతుః
(హి) ,, జిఘాయ - జిఘ్యతుః - జిఘ్యుః
(చి) , చికాయ } చిక్యతుః } చిక్యుః }
చిచాయ } చిచ్యతుః } చిచ్యుః }
(ఆత్మనే) చిక్యే } చిక్యాతే } చిక్యిరే }
చిచ్యే } చిచ్యాతే } చిచ్యిరే }

లిట్టుయొక్క అజాది దుర్బలప్రత్యయము పరమగునపుడు గమ్ హన్, జన్, ఖన్, ఘస్ ధాతువుల ఉపధయగు అకారమునకు లోపము వచ్చును హన్ ధాతువు హకారమునకంతటను ఘకారాదేశమగును టన్ ధాతువులో అకారము లోపించగా మిగిలినది 'ఘ్న' అని మారును. (సూ-97)
ఘస్ ధాతువులో అకారము లోపించగా మిగిలినది 'క్ష' అని మారును

(సూ-116 22 )

(గమ్) - (పరస్మై) జగామ - జగ్మతుః - జగ్ముః
(హన్) - ,, జఘాన - జఘ్నతుః - జఘ్నుః
(ఘస్) - , జఘాస - జక్షతుః - జక్షుః
(ఖన్) - ,, చఖాన - చఖ్నతుః - చఖ్నుః
(ఆత్మనే) చఖ్నే - చఖ్నాతే - చఖ్నిరే
(జన్) - , జజ్ఞే - జజ్ఞాతే - జజ్ఞిరే

అద్ ధాతువునకు లిట్టునందు వికల్పముగా 'ఘస్' అనునది ఆదేశమగును

(అద్)-(పరస్మై) - జఘాస } జక్షతుః } జక్షుః }
ఆద } ఆదతుః } ఆదుః }

ఇ-అధ్యయనే అను ధాతువునకు లిట్టునందు 'గా' అనునది ఆదేశమగును

(అధి+ఇ) - (ఆత్మనే) అధిజగే - అధిజగాతే - అధిజగిరే

మ్నా ధాతువు ఆత్మనేపదియైనను, లిట్, లుట్, ల్రుట్, ల్రుఙ్ అను లకారములందు పరస్మైపదప్రత్యయములే చేరును.

మమార - మమ్రతుః - మమ్రుః

ధాతువులో అసంయుక్త హల్లుల నడుమ అకారముండి ధాతువు మొదటి వర్ణమునకు అభ్యాసములో మార్పురానిచో దుర్బల ప్రత్యయము పరమగునపుడు ఆ అభ్యాసమునకు లోపము ధాతువు నందలి అకారమునకు ఏకారాదేశమును వచ్చును

(తన్) - (పరస్మై) తతాన - తేనతుః - తేనుః

(ఆత్మనే) తేనే - తేనాతే - తేనిరే

దుర్బల ప్రత్యయము పరమగునపుడు తౄ, ఫల్, భజ్, త్రప్ అను ధాతువుల యచ్చునకుకూడ ఏకారాదేశము, అభ్యాసమునకు లోపమును వచ్చును.

(తౄ)-(పరస్మై) తతార - తేరతుః - తేరుః

(ఫల్) ,, పఫాల - ఫేలతుః - ఫేలుః

(భజ్) ,, బభాజ - భేజతుః - భేజుః

(ఆత్మనే) భేజే - భేజాతే - భేజిరే

(త్రప్) ,, త్రేపే - త్రేపాతే - త్రేపిరే

హింసార్థకమగునపుడు రాధ్ ధాతువు నచ్చునకుగూడ ఏకారాదేశము, అభ్యాసమునకు లోపమును వచ్చును (అప అను ఉపసర్గతో గూడినపుడు రాధ్ ధాతువు హింసార్థకమగును)

(అప+రాధ్) (పరస్మై) అపరరాధ - అపరేధతుః - అపరేధుః

(హింసార్థముకానిచో రరాధ - రరాధతుః - రరాధు అనియే యుండును)

జ్యా, భ్రమ్, త్రస్, ఫణ్, రాజ్, భ్రాజ్ భ్రాశ్, భ్లాశ్ స్యమ్, స్వన్ ధాతువులకు దుర్బల ప్రత్యయము పరమగునపుడు ధాతువునందలి అచ్చునకు ఏకారాదేశము అభ్యాసలోపమును వికల్పముగా వచ్చును

(జ్యా) - (పరస్మై) జజార - జేరతుః / జజరతుః | జేరుః / జజరుః

ఏత్వాభ్యాసలోపములు రానపుడు కౄ ధాతువునకువలె ఋకారమునకు గుణమువచ్చును

(భ్రమ్)-(పరస్మై) బభ్రామ-భ్రేమతుః / బభ్రమతుః | - భ్రేముః / బభ్రముః

ఇట్లే — త్రస్, ఫణ్, స్యమ్ స్వన్ ధాతువులరూపముల నూహించునది,

(రాజ్)-(పరస్మై) రరాజ - రేజతుః / రరాజతుః | - రేజుః / రరాజుః

(ఆత్మనే) రేజే / రరాజే | - రేజాతే / రరాజాతే | - రేజిరే / రరాజిరే

రాజ్ ధాతువుయొక్క ఆత్మనేపదరూపముల వలెనే భ్రాజ్ భ్రాశ్, భ్లాస్, ధాతువుల రూపముల నూహించునది

వకారాది ధాతువులకును, శస్ దద్ ధాతువులకును ఏత్వాభ్యాస లోపములు రావు

(వమ్)-(పరస్మై) వవామ-వవమతుః - వవముః
(శస్)- " శశాస - శశసతుః - శశసుః
(దద్) - (ఆత్మనే) దదదే - దదదాతే - దదదిరే

## సంప్రసారణము

1 సామాన్యముగా దుర్బలప్రత్యయము పరమగునపుడు కొన్ని ధాతువులలోని యకార, వకార, రేఫలకు వరుసగా ఇ ఉ ఋ అనునవి ఆదేశములగును. ఈ యాదేశములను సంప్రసారణము అందురు.

ఆ ధాతువు లేవనగా - వచ్, స్వప్ యజ్, వప్, వహ్, వస్ (1 గణము) వే వ్యే, హ్వే శ్వి, వద్ గ్రహ్, జ్యా, వ్యధ్, వశ్ వ్యచ్ వ్రశ్చ్, భ్రస్జ్ - అనునవి

2 వీవిలో మొదటి 11 ధాతువులకు సార్వధాతుకలకారముల దుర్బల ప్రత్యయములు పరముగునపుడు సంప్రసారణము రాదు లిట్టుయొక్క దుర్బల ప్రత్యయము పరమగునపుడు వ్రశ్చ్, వ్రశ్చ్, భ్రస్జ్ - ధాతువులకు సంప్రసారణము రాదు

3 లిట్టులో సంప్రసారణము రాదగినవానికి దృఢప్రత్యయము పరమగునపుడు కూడ సంప్రసారణము వచ్చును కాని దుర్బల ప్రత్యయము పరమగునపుడు ధాతుద్విరుక్తికంటె ముందుగనే సంప్రసారణము వచ్చును దృఢప్రత్యయము పరమగునపుడు అభ్యాసమునందు మాత్రమే సంప్రసారణము వచ్చును

4 వే ధాతువునకు లిట్టులో వికల్పముగా వయ్ అను ఆదేశము వచ్చును అందు వకారమునకే సంప్రసారణము వచ్చును వయాదేశమురానపుడు లిట్టులో సంప్రసారణము రాదు

5 హ్వే ధాతువునకు లిట్టు దృఢప్రత్యయము పరమగునపుడుకూడ ధాతువునందే ద్విరుక్తికంటె ముందుగనే సంప్రసారణము వచ్చును

6 శ్వి ధాతువునకు లిట్టునందు సంప్రసారణము వికల్పముగా వచ్చును ఆ సంప్రసారణము దృఢప్రత్యయము పరమగునపుడు గూడ ద్విరుక్తికంటె ముందుగనే ధాతువునందే వచ్చును

7 సంప్రసారణముకంటె పరమగు అచ్చు లోపించును

8. సంయుక్తవర్ణములలో రెండును సంప్రసారణయోగ్యము లగునపుడు రెండవ హల్లునకు మాత్రమే సంప్రసారణమువచ్చును

9 పైధాతువులకేకాక వ్యధ్ ధాతువునకు లిట్ పరమగునపుడు అంతట అభ్యాసమునకు మాత్రము సంప్రసారణము వచ్చును

(పరస్మైపదము) (ఆత్మనేపదము)

(బ్రూ) ఉవాచ-ఊచతుః-ఊచుః ఊచే - ఊచాతే - ఊచిరే

(అర్థధాతుక లకారములలో బ్రూధాతువునకు వచ్ అనునది ఆదేశమగును)

(స్వప్) సుష్వాప - సుషుపతుః - సుషుపుః

సూ - 264 ఇణ్ కవర్గాక్షరములకంటె పరమగునపుడు స్వప్ధాతువు సకారమునకు షకారాదేశమగును

(యజ్) ఇయాజ - ఈజతుః - ఈజుః ఈజే - ఈజాతే - ఈజిరే

(వప్) ఉవాప - ఊపతుః - ఊపుః ఊపే - ఊపాతే - ఊపిరే

(వహ్) ఉవాహ-ఊహతుః-ఊహుః ఊహే - ఊహాతే - ఊహిరే

(వస్) ఉవాస - ఊషతుః - ఊషుః

(సూ - 221)

(లిట్టుయొక్క దుర్బలప్రత్యయములు పరమగునపుడు వేధాతువు యొక్క వయాదేశములో యకారమునకు వికల్పముగా వకారాదేశమగును). వయాదేశము రానపుడు ధేధాతువునకువలె రూపనిష్పత్తి నూహించునది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| (వే) ఉవాయ | ఊయతుః | ఊయుః | ఊయే | ఊయాతే | ఊయిరే |
| | ఊవతుః | ఊవుః | ఊవే | ఊవాతే | ఊవిరే |

వవౌ - వవతుః - వవుః — వవే - వవాతే - వవిరే

(వ్యే) వివ్యాయ - వివ్యతుః - వివ్యుః — వివ్యే - వివ్యాతే - వివ్యిరే

(హ్వే) జుహావ - జుహువతుః - జుహువుః — జుహువే - జుహువాతే - జుహువిరే

(శ్వి) శుశావ - శుశువతుః - శుశువుః

శిశ్వాయ - శిశ్వియతుః - శిశ్వియుః

| (పరస్మైపదము) | (ఆత్మనేపదము) |
|---|---|
| (వద్) ఉవాద - ఊదతుః - ఊదుః | |
| (గ్రహ్) జగ్రాహ - జగృహతుః - జగృహుః | జగృహే - జగృహాతే - జగృహిరే |
| (జ్యా) జిజ్యౌ - జిజ్యతుః - జిజ్యుః | |
| (వ్యధ్) వివ్యాధ - వివిధతుః - వివిధుః | |
| (వశ్) ఉవాశ - ఊశతుః - ఊశుః | |
| (వ్యచ్) వివ్యాచ - వివిచతుః - వివిచుః | |
| (వ్యథ్) వివ్యాథ - వివ్యథతుః - వివ్యథుః | |
| (వ్రశ్చ్) వవ్రశ్చ - వవ్రశ్చతుః - వవ్రశ్చుః | |
| (ప్రచ్ఛ్) పప్రచ్ఛ - పప్రచ్ఛతుః - పప్రచ్ఛుః | |
| (భర్జ్) బభర్జ - బభర్జతుః - బభర్జుః | |

సూ - 265 భ్రస్జ్ ధాతువునకు అర్ధధాతుక లకారములయందు భర్జ్ అను నాదేశమువచ్చును భర్జ్ + అ = బభర్జ

సూ - 266 అకారాదియు, సంయుక్తాంతమును అగు ధాతువుయొక్కయు ఋకారాది ధాతువులయొక్కయు, అశ్, వ్యాప్తౌ అను ధాతువు యొక్కయు అభ్యాసవర్ణమగు అకారమునకు దీర్ఘమును అభ్యాసమునకు, ధాతువునకును నడుమ నకారాగమమును వచ్చును

ఉదా - అర్ద్ + అ = అ + అర్ద్ + అ = ఆనర్ద

| | |
|---|---|
| (అర్ద్) ఆనర్ద - ఆనర్దతుః - ఆనర్దుః | |
| (అన్త్) ఆనన్త - ఆనన్తతుః - ఆనన్తుః | |
| (ఋజ్) — | ఆనృజే - ఆనృజాతే - ఆనృజిరే |
| (ఋచ్ఛ్) ఆనర్చ్ఛ - ఆనర్చ్ఛతుః - ఆనర్చ్ఛుః | |

అ అలు తప్ప తక్కిన యచ్చులలో దీర్ఘములుగాని, సంయుక్త పరకములయిన హ్రస్వములుగాని అదియందుగల ధాతువులకు, అనేకాచ్క ధాతువులకు. పదవగణము ధాతువులకు, ప్రేరణార్థక ధాతువులకు, సన్ ప్రత్యయాంతధాతువులు మున్నగువానికి లిడంత రూపములు - ఆ ధాతువులకు ఆమ్ అను ప్రత్యయమును చేర్చి పిమ్మట కృ, భూ, అస్ ధాతువులలో నొకదాని లిడంతరూపములను అనుప్రయుక్తము కావించుటచే (అనగా దానితో చేర్చి ప్రయోగింపబడుటచే) ఏర్పడును కాని ఋచ్ఛ్ ధాతువునకు ఆట్లేర్పడదు

మూలధాతువు ఆత్మనేపదియైనచో దానికి కృధాతువుయొక్క ఆత్మనేపదరూపములను, పరస్మైపదియైనచో దానికి-కృధాతువుయొక్క పరస్మైపదరూపములను చేర్చవలెను భూ ధాతువు అస్ ధాతువును పరస్మైపదులగుటచే అన్నింటికి పరస్మైపదరూపములే చేరును. అస్ ధాతువునకు అర్ధధాతుక లకారములలో ప్రయోగములేదు దానికిబదులు భూధాతురూపములే ప్రయోగింపబడుచుండును - కాని ఈ అను ప్రయోగములలో మాత్రము అస్ ధాతురూపములనే (ఆస-ఆసతుః-ఆసుః అనువానిని) చేర్చవలెను

సామాన్యముగా అర్ధధాతుక లకారములందు పదవగణము ధాతువులకు, ప్రేరణార్థకధాతువులకును జేరు అయ అనుదానిలో చివరి అకారము లోపించును.

(ఈశ్) ఈశాంచక్రే - ఈశాంచక్రాతే - ఈశాంచక్రిరే

ఈశాంబభూవ - ఈశాంబభూవతుః - ఈశాంబభూవుః

ఈశామాస - ఈశామాసతుః - ఈశామాసుః

(కథ్) కథయాంచకార - కథయాంచక్రతుః - కథయాంచక్రుః

కథయాంచక్రే - కథయాంచక్రాతే -కథయాంచక్రిరే

కథయాంబభూవ - కథయాంబభూవతుః - కథియాంబభూవుః

కథయామాస - కథయామాసతుః - కథయామాసుః

ఇజాది కాకపోయినను దయ్ అయ్ ఆస్ కాస్, అను ధాతువులకుగూడ పై రీతిగనే లిడంతరూపము లేర్పడును

ఉష్, విద్ (2-వ గణము) జాగృ ధాతువులకు వికల్పముగా పై రీతిని లిండంతరూపము లేర్పడును

భీ హ్రీ భృ హు అను మూడవగణము ధాతువులకుగూడ పై రీతిని వికల్పముగా అను ప్రయుక్త లిట్ రూపము లేర్పడును కాని మూలధాతువునకు ద్విరుక్తి కలిగిన తరువాత ఆమ్ ప్రత్యయము చేరును

ఆమ్ అనునది దృఢప్రత్యయము కావున అది పరమగునపుడు ధాతువు తుది ఇక్కునకు ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణము వచ్చును కాని విద్ ధాతువునకు రాదు

(దయ్) దయాఞ్చక్రే దయామ్బభూవ దయామాస

(అయ్) అయాఞ్చక్రె, అయామ్బభూవ అయామాస

(ఆస్) ఆసాఞ్చక్రే అసామ్బభూవ ఆసామాస.

(ఉష్) ఓషాఞ్చకార [లేక] ఉవోష-ఊషతుః-ఊషుః

(విద్) (2-వ గణము) విదాఞ్చకార [లేక] వివేద-వివిదతుః-వివిదుః

(జాగృ) జాగరాఞ్చకార [లేక] జజాగార-జజాగరతుః-జజాగరుః

(భీ) బిభయాఞ్చకార [లేక] బిభాయ-బిభ్యతుః-బిభ్యుః

(హ్రీ) జిహ్రయాఞ్చకార [లేక] జిహ్రాయ-జిహ్రియతుః-జిహ్రియుః

(భృ) బిభరాఞ్చకార [లేక] బభార-బభ్రతుః-బభ్రుః

బిభరాఞ్చక్రే [లేక] బభ్రే-బభ్రాతే-బభ్రిరే

(హు) జుహవాఞ్చకార [లేక] జుహావ-జుహువతుః-జుహువుః.

ఆర్ధధాతుకములలో భావకర్మార్థములందు ధాతువులకు య అను ప్రత్యయము చేరదు కావున మూలధాతువులే యుపయోగింపబడును కావి, మూలధాతువు పరస్మైపదియైనను ఆత్మనేపదియైనను భావకర్మార్థములందు ఆత్మనేపద ప్రత్యయములే చేరును ఉదా - (భూ) బభూవే (కృ) చక్రే (త్యజ్) తత్యజే (లభ్) లేభే

లుట్

(అనద్యతన భవిష్యదర్థకము)

| పరస్మైపద ప్రత్యయములు | ఆత్మనేపద ప్రత్యయములు |
|---|---|
| తా - తారౌ - తారః | తా - తారౌ - తారః |
| తాసి - తాస్థః - తాస్థ | తాసే - తాసాథే - తాధ్వే |
| తాస్మి - తాస్వః - తాస్మః | తాహే - తాస్వహే - తాస్మహే |

పై లుట్ ప్రత్యయము లన్నియు వలాద్యార్ధధాతుకములు ద్వర ప్రత్యయములు కావున సేడ్ధాతువులకంటె పరమగునప్పుడు వానికి ముందు ఇడాగమము వచ్చును ఈ ప్రత్యయములు పరమగునపుడు ధాతువు చివరి యిక్కులకు ఉపధయగు హ్రస్వ ఇక్కులకును గుణము వచ్చును

లుట్ రూపములు

| (పరస్మైపదము) | (ఆత్మనేపదము) |
|---|---|
| భవితా - భవితారౌ - భవితారః | మోదితా - మోదితారౌ మోదితారః |
| భవితాసి - భవితాస్థః - భవితాస్థ | మోదితాసే - మోదితాసాథే - మోదితాధ్వే |
| భవితాస్మి-భవితాస్వః-భవితాస్మః | మోదితాహే - మోదితాస్వహే - మోదితాస్మహే. |

పైవానిలో భూ అనునది పరస్మైపదిసేద్ధాతువు ముద్ - అనునది ఆత్మనేపదిసేద్ధాతువు భూ+తా = భూ+ఇతా=భో+ఇతా = భవితా మొ ముద్+తా=ముద్+ఇతా=మోదితా మొ॥

| (పరస్మైపదము) | (ఆత్మనేపదము) |
|---|---|
| యాతా - యాతారౌ - యాతారః | మన్తా - మన్తారౌ - మన్తారః |
| యాతాసి - యాతాస్థః - యాతాస్థ | మన్తాసే - మన్తాసాథే - మన్తాధ్వే |
| యాతాస్మి-యాతస్వః-యాతాస్మః | మన్తాహే - మన్తాస్వహే - మన్తాస్మహే |

వీనిలో యా అనునది పరస్మైపది అనిద్ధాతువు, మన్ - అనునది ఆత్మనేపది అనిద్ధాతువు

యా+తా=యాతా, మొ మన్+తా=మన్తా మొ

(లుట్ రూపములలో ప్రథమపురుషరూపములను జూచి ఆ ధాతువు పరస్మైపదియో, ఆత్మనేపదియో గుర్తింపజాలము అందువలన ఈ క్రింది యుదాహరణములలో మధ్యమపురుషైకవచన రూపములు గూడ నొసంగబడును దానినిబట్టి తక్కినరూపముల నూహించునది )

సూ-267 ఈష సహ లుభ రుష రిషః (పా పూ ) = ఇష్, సహ్, లుభ్, రుష్ రిష్ ధాతువులకంటె పరమయిన తకారాద్యార్ధ ధాతుక మునకు వికల్పముగా ఇడాగమము వచ్చును

ఏషితా - ఏష్టా . ఏషితాసి - ఏష్టాసి సహితా - సోఢా సహితాసే - సోఢాసే, లోభితా-లోబ్ధా లోభితాసి-లోబ్ధాసి రోషితా-రోష్టా రోషితాసి - రోష్టాసి రేషితా-రేష్టా రేషితాసి-రేష్టాసి

ఇష్+తా = ఏష్+తా-ఏష్టా (సూ 194) ఇట్లే రోష్టా రేష్టా మొ సహ్ + తా = సఢ్+తా (సూ-117) సఢ్ + ధా (సూ-187) = సడ్+ఢా (సూ-194) = స+ఢా (సూ-231)

సూ–268 సహివహోరో దవర్ణస్య (పా సూ) = వహ్, వహ్ ధాతువుల ధకారమునకు లోపము వచ్చినపుడు లోపించిన ధకారమునకు ముందున్న అవర్ణమునకు ఓకారాదేశమగును

వ+ధా = సోఢా ఇట్లే ధాతువునకు వహ్ వోఢా, వోఢాసి - వోఢాసె.

లభ్+తా=లోభ్+తా=లోభ్+ధా (సూ- 87)=లోబ్ధా

(సూ-188) లోభితాసి-లోబ్ధాసి, ఇట్లే లభ్ ధాతువునకు లబ్ధా లబ్ధాసే

సూ–269 గ్రహోఽలిటి దీర్ఘః (పా సూ)=గ్రహ్ ధాతువులకంటె పర మగు లిట్భిన్నమగు అర్ధధాతుక ప్రత్యయముల ఇడాగమము నకు దీర్ఘముపచ్చును గ్రహ్+ఇతా=గ్రహీతా, గ్రహీతాసి

సూ–270 వృధాతువుకంటె ఋూకారాంత ధాతువులకంటెను పరమగు లిట్ ఆత్మనేపదాశీర్లిఙ్, పరస్మైపద లఙ్ ప్రత్యయముల తప్ప తక్కిన అర్ధధాతుక ప్రత్యయముల ఇడాగమమునకు వికల్పముగా దీర్ఘముపచ్చును వరితా - వరీతా వరితాసి - వరీతాసి వరితాసే - వరీతాసే ఇట్లే వౄ ధాతువునకు గూడ ఏర్పడును

(నహ్) నద్ధా నద్ధాసి-నద్ధాసే

సూ–271 నహో ధః (పా సూ) = నహ్‌ధాతువు హకారమునకు ఝల్లు పరమగునపుడు పదాంతమందున్నపుడును ధకారాదేశమగును.

నహ్+తా = నధ్+తా = నధ్+ధా (సూ - 87) = నద్ధా (సూ- 88)

(సృజ్) స్రష్టా, స్రష్టాసి (దృశ్) ద్రష్టా ద్రష్టాసి

సూ–272 ఝలాది దృఢ ప్రత్యయములు పరమగునపుడు సృజ్, దృశ్ ధాతువుల ఋకారమునకు నిత్యముగను తక్కిన ధాతూపధా ఋకారములకు వికల్పముగను ర అనునది ఆదేశమగును

సృజ్+తా=స్రజ్+తా=స్రష్+తా (సూ-208)=స్రష్టా (సూ- 94)
ఇట్లే, దృశ్+తా=ద్రష్టా.
(సృప్) స్రప్తా-సర్ప్తా స్రప్తాసి-సర్ప్తాసి
(తృప్) తర్పితా-త్రప్తా-తర్ప్తా · తర్పితాసి-త్రప్తాసి-తర్ప్తాసి

సూ-273 రధాదిభ్యశ్చ (పా సూ) = రధ్, నశ్, తృప్, దృప్ ద్రుహ్, ముహ్, ష్ణుహ్ ష్ణిహ్ ధాతువులకంటె పరమయిన వలాద్యార్ధధాతుకమునకు వికల్పముగా ఇడాగమము వచ్చును

తృప్+తా=తర్పితా (లేక) త్రప్తా (సూ-272) (లేక) తర్ప్తా
ఇట్లే(దృప్) దర్పితా-ద్రప్తా· దర్పితాసి-ద్రప్తాసి-దర్ప్తాసి
(రధ్) రధితా- రద్ధా రధితాసి-రద్ధాసి
రధ్+తా=రధ్+ధా (సూ- 87) = రద్ధా (సూ- 88)
(నశ్) నశితా-నంష్టా, నశితాసి-నంష్టాసి

సూ-274 ఝల్పరమగునపుడు మజ్జ్ నశ్ ధాతువుల అకారము తరువాత అనుస్వారము ఆగమముగా చేరును.

నశ్ + తా = నంశ్+తా=నంష్ + టా (సూ-208) = నంష్టా (సూ- 94)
(ద్రుహ్) ద్రోహితా-ద్రోగ్ధా-ద్రోఢా ద్రోహితాసి-ద్రోగ్ధాసి-ద్రోఢాసి

సూ - 275 వా ద్రుహ ముహ ష్ణుహ ష్ణిహామ్ (పా సూ) = ఝల్పరమగునపుడు పదాంతమునందును ద్రుహ్ ముహ్, ష్ణుహ్ ష్ణిహ్ ధాతువుల హకారమునకు ఘకారముగాని ఢకారముగాని ఆదేశమగును

ద్రుహ్+తా=ద్రోహ్+తా=ద్రోఘ్+తా=ద్రోఘ్+ధా (సూ- 87)=ద్రోగ్ధా (సూ- 88) (లేక) ద్రుహ్+తా=ద్రోహ్+తా=ద్రోఢ్+తా=ద్రోఢ్+ధా (సూ- 8 )=ద్రోఢ్+ఢా(సూ- 94)=ద్రోఢా (సూ-2 ) ఇట్లే ముహ్, ష్ణుహ్ ష్ణిహ్ ధాతువుల రూప నిష్పత్తి నూహించునది

(ముహ్) మోహితా-మోగ్ధా-మోఢా: మోహితాసి-మోగ్ధాసి-మోఢాసి
(స్నుహ్) స్నోహితా-స్నోగ్ధా-స్నోఢా. స్నోహితాసి-స్నోగ్ధాసి-స్నోఢాసి
(స్నిహ్) స్నేహితా-స్నేగ్ధా-స్నేఢా: స్నేహితాసి-స్నేగ్ధాసి-స్నేఢాసి
(దహ్) దగ్ధా - దగ్ధాసి
(కౢప్) కల్ప్తా - కల్పితా కల్ప్తాసి-కల్ప్తాసే-కల్పితాసే

సూ - 276 లుట్, లృట్, లృఙ్ - అను లకారములయందు కౢప్ ధాతువునకు వికల్పముగా పరస్మైపద ప్రత్యయములు వచ్చును. ఆ పరస్మైపద ప్రత్యయములకు ఇడాగమము రాదు. తక్కిన వలాద్యార్ధధాతుక ప్రత్యయములకు వికల్పముగా ఇడాగమము వచ్చును

## లృట్ - భవిష్యదర్థకము

లట్ ప్రత్యయములకు ముందు 'స్య' అను దానిని చేర్చుటచే లృట్ ప్రత్యయము లేర్పడును

| పరస్మైపద లృట్ ప్రత్యయములు. | ఆత్మనేపద లృట్ ప్రత్యయములు: |
|---|---|
| స్యతి - స్యతః - స్యన్తి | స్యతే - స్యేతే - స్యన్తే |
| స్యసి - స్యథః - స్యథ | స్యసే - స్యేథే - స్యధ్వే |
| స్యామి - స్యావః - స్యామః | స్యే - స్యావహే - స్యామహే |

ఈ ప్రత్యయములన్నియు వలాద్యార్ధధాతుకములు; దృఢప్రత్యయములు. కావున సేడ్ధాతువులకంటె పరమగునపుడు వీనికి ముందు ఇడాగమము వచ్చును. ఈ ప్రత్యయములు పరమగునపుడు ధాతువు చివరి ఇక్కునకు ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణము వచ్చును. ఇడాగమముకంటె పరమయిన ఈ ప్రత్యయముల సకారమునకు షకార మాదేశమగును (సూ-44)

| | |
|---|---|
| భవిష్యతి - భవిష్యతః - భవిష్యన్తి | మోదిష్యతే - మోదిష్యేతే - మోదిష్యన్తే |
| భవిష్యసి-భవిష్యథః-భవిష్యథ | మోదిష్యసే - మోదిష్యేథే - మోదిష్యధ్వే |
| భవిష్యామి - భవిష్యావః - భవిష్యామః | మోదిష్యే - మోదిష్యావహే - మోదిష్యామహే |

సూ - 277 సః స్యార్ధధాతుకే (పా సూ)=సకారాద్యార్ధధాతుకము పరమగు నపుడు సకారమునకు తకారాదేశమగును

ఉదా - వస్+స్యతి=వత్స్యతి ఘస్+స్యతి=ఘత్స్యతి

సూ - 278 (అనిడ్ధాతువులైనను) గమ్‌ధాతువుకంటె పరమగు పరస్మై పద లృట్ ప్రత్యయములకు, హన్ ధాతువుకంటెను ఋకారాంత ధాతువులకంటెను పరమగు లృట్ ప్రత్యయముల కును ఇడాగమము వచ్చును

ఉదా - గమ్ + స్యతి = గమిష్యతి

హన్+స్యతి=హనిష్యతి భృ+స్యతి = భృ + ఇష్యతి = భరిష్యతి కాని సమ్ + గమ్ + స్యతే = సంగంస్యతే

సూ - 279 (సేడ్ధాతువులైనను) కృత్, నృత్ ధాతువులకంటె పరమగు లృట్ ప్రత్యయములకు వికల్పముగా ఇడాగమము వచ్చును

ఉదా - నృత్+స్యతి=నృత్+ఇష్యతి=నర్తిష్యతి (లేక) నర్త్స్యతి

అట్లే కర్తిష్యతి, కర్త్స్యతి

సూ - 280 క్లృప్ వృతు వృధ్, శృధ్, స్యన్ద్ ధాతువులకు లృట్టునందు వికల్పముగా పరస్మైపద ప్రత్యయములు చేరును ఆ పరస్మైపద ప్రత్యయములకు ఇడాగమమురాదు వీనిలో క్లృప్

స్యన్ద్ ధాతువులకంటె వరమగు ఆత్మనేపద ప్రత్యయములకు వికల్పముగా ఇడాగమము వచ్చును

ఉదా- కృప్+స్యతి =కల్ప్స్యతి కృప్ + స్యతే = కల్పిష్యతే, కల్ప్స్యతే వృత్+స్యతి=వర్త్స్యతి వృత్ + స్యతే = వర్తిష్యతే వృధ్ + స్యతి= వర్ధ్+స్యతి=వర్త్స్యతి (సూ- 6) వృధ్+స్యతే=వర్ధిష్యతే ఇట్లే శృధ్ ధాతువునకు-శర్త్స్యతి శర్ధిష్యతే స్యన్ద్+స్యతి=స్యన్త్స్యతి (సూ-1 6) స్యన్ద్+స్యతే = స్యన్దిష్యతే (లేక) స్యన్త్స్యతే (సూ-1 6) లభ్+స్యతే = లప్స్యతే (సూ- 6)

దిశ్ + స్యతి = దిష్ + స్యతి (సూ-208) = దిక్ + స్యతి (సూ-2 0) = దిక్ + ష్యతి (సూ-44)=దేక్ష్యతి

దుహ్+స్యతి=దుఘ్+స్యతి (సూ-233)=దుఘ్+స్యతి (సూ-234) =దుక్+స్యతి(సూ-1 6)=దుక్+ష్యతి (సూ-44)=ధోక్ష్యతి

దృశ్+స్యతి=ద్రశ్+ స్యతి (సూ-272) = ద్రష్ + స్యతి (సూ-209) = సృప్+స్యతి=స్రప్స్యతి సర్ప్స్యతి (సూ-272)

భావకర్మార్థములలో అర్ధధాతుక లకారములయం దంతటను కర్త్రర్థకమునందువలెనే రూపములు నిష్పన్నములగును కాని అన్ని ధాతువులకు ఆత్మనేపద ప్రత్యయములనే చేర్పవలెను కావున అర్థ ధాతుక లకారములయందు కర్త్రర్థకము భావకర్మార్థకములను ఆత్మనేపది ధాతువులకు ఒకేవిధముగనుండును వరస్మైపదిధాతువులకు పరస్మైపద ప్రత్యయములకు బదులు ఆత్మనేపదప్రత్యయములను చేర్పవలెను

లృఙ్ - హేతు హేతుమద్భావార్థకము

లఙ్ ప్రత్యయములకు ముందు 'స్య' అను దానిని చేర్చుటచే లృఙ్ ప్రత్యయము లేర్పడును

| పరస్మైపదలృట్ ప్రత్యయములు . | ఆత్మనేపద లృట్ ప్రత్యయములు |
|---|---|
| స్యత్ - స్యతామ్ - స్యన్ | స్యత - స్యేతామ్ - స్యన్త |
| స్యః - స్యతమ్ - స్యత | స్యథాః - స్యేథామ్ - స్యధ్వమ్ |
| స్యమ్ - స్యావ - స్యామ | స్యే - స్యావహి - స్యామహి |

లృట్ ప్రత్యయములు పరమగునపుడు హలాది ధాతువులకు ముందు అకారమును, అజాది ధాతువులకుముందు ఆకారమును ఆగమముగా చేరును. (సూ-94, 95) ఆకారాగమమునకు, ధాత్వాదియగు అచ్చునకు వృద్ధి యేకాదేశముగావచ్చును (సూ-96)

ఈ ప్రత్యయములన్నియు వలాద్యార్ధ ధాతుకములు ద్రుత ప్రత్యయములు. అందుచే సేడ్ధాతువులకంటె పరమగునపుడు ఈ ప్రత్యయములకు ముందు ఇడాగమమువచ్చును ఈ ప్రత్యయములు పరమగునపుడు ధాతువు తుదిఇక్కునకు, ఉపధయగు హ్రస్వ ఇక్కునకును గుణము వచ్చును ఇడాగమము వచ్చినపుడు దానికంటె పరమయిన ప్రత్యయ సకారమునకు షకార మాదేశమగును (సూ-44)

| | |
|---|---|
| అభవిష్యత్ - అభవిష్యతామ్ - అభవిష్యన్ | అమోదిష్యత-అమోష్యేతామ్ - అమోదిష్యన్త |
| అభవిష్యః - అభవిష్యతమ్ - అభవిష్యత | అమోదిష్యథాః-అమోదిష్యేథామ్- అమోదిష్యధ్వమ్ |
| అభవిష్యమ్ - అభవిష్యావ - అభవిష్యామ | అమోదిష్యే-అమోదిష్యావహి - అమోదిష్యామహి |

సూ - 28 విభాషా లుఙ్ లృఙోః (పా సూ) = అధి పూర్వకమగు 'ఇ' అను ఆత్మనేపది ధాతువులకు లుఙ్, లృఙ్-అనునవి పరమగునపుడు వికల్పముగా 'గా అనునది ఆదేశమగును

ఉదా - అధి+ఇ+లృఙ్=అధి+అ+గా+స్యత మొ

సూ-282 హల్లు పరమగునపుడు 'గా' అనుదానిలో ఆకారమునకు ఈకారదేశమువచ్చి 'గీ' అని మారును. ఉదా -అధి+అ+గా+స్యత=అధి+అ+గీ+స్యత=అధి+అగీష్యత (సూ-44)=అధ్యగీష్యత (సూ-67) [లేదా] అధి+ఇ+స్యత = అధి+అ+ఇ+స్యత=అధి+ఐ+స్యత=అధి+ఐష్యత (సూ-44)=అధ్యైష్యత (సూ-67) మొ॥

తక్కినచోట్ల లృట్టునందువలెనే రూపనిష్పత్తి నూహించునది.

లృఙ్ కార్యకారణసంబంధమును తెలియజేయును అది భూతమునకుగాని భవిష్యత్తునకుగాని సంబంధించినది కావచ్చును. మొత్తముమీద క్రియయొక్క అనిష్పత్తిగూడ గమ్యమగును. ఉదా - సువృష్టి రభవిష్యచ్చేత్ సుభిక్ష మభవిష్యత్ = సువృష్టియున్నచో సుభిక్షముండును.

## ఆశీర్లిఙ్ - ఆశీరర్థకము

| పరస్మైపదాశీర్లిఙ్ ప్రత్యయములు : | ఆత్మనేపదాశీర్లిఙ్ ప్రత్యయములు : |
|---|---|
| యాత్ - యాస్తామ్ - యాసుః | సీష్ట - సీయాస్తామ్ - సీరన్ |
| యాః - యాస్తమ్ - యాస్త | సీష్ఠాః - సీయాస్థామ్ - సీధ్వమ్ |
| యాసమ్ - యాస్వ - యాస్మ | సీయ - సీవహి - సీమహి |

వీనిలో పరస్మైపదప్రత్యయములు వలాదులు కాకపోవుటచే ఇడాగమ ప్రసక్తిలేదు దుర్బం ప్రత్యయములగుటచే ధాతువునకు గుణప్రసక్తిలేదు కాని ఆత్మనేపద ప్రత్యయములన్నియు వలాద్యార్ధధాతుకములు, దృఢప్రత్యయములు నగుటచే సేడ్ధాతువులకంటె పరమగునపుడు ప్రత్యయములకు ముందు ఇడాగమమును, ఆ ప్రత్యయములు పరమగునప్పుడు ధాతువుల చివరి ఇక్కునకు, ఉపధయగు హ్రస్వ

ఇక్కునకు గుణమును వచ్చును ఇడాగమము వచ్చినపుడు, దానికంటె పరమయిన ప్రత్యయ సకారమునకు షకారాదేశమగును (సూ-44) ఇ+ సిష్ఠ=ఇషిష్ఠ మొ॥

## ఆశీర్లిఙ్ రూపములు

| | |
|---|---|
| భూయాత్ - భూయాస్తామ్ - భూయాసుః | మోదిషీష్ట - మోదిషీయాస్తామ్ - మోదిషీరన్ |
| భూయాః - భూయాస్తమ్ - భూయాస్త | మోదిషీష్ఠాః - మోదిషీయాస్థామ్ - మోదిషీధ్వమ్ |
| భూయాసమ్ - భూయాస్వ - భూయాస్మ | మోదిషీయ - మోదిషీవహి - మోదిషీమహి |

కొన్నిచోట్ల 'సీధ్వమ్' అను ప్రత్యయములోని ధకారమునకు ఢకారాదేశమువచ్చి 'సీఢ్వమ్' అని మారును. అనగా ...
కృ+సీధ్వమ్=కృ+షీధ్వమ్=కృషీఢ్వమ్ (సూ-44)
శీ+ఇషీధ్వమ్=శే+ఇషీధ్వమ్= శయ్+ఇషీధ్వమ్ (సూ- 2) = శయిషీ ధ్వమ్ (లేక) శయిషీఢ్వమ్

భావకర్మార్థములందు చేరిన 'య' ప్రత్యయము పరమగునపుడు ధాతువులో కలుగుమార్పులన్నియు పరస్మైపదాశీర్లిఙ్ ప్రత్యయములు పరమగునపుడు కూడ కలుగును కృ+యాత్=క్రియాత్ జాగృ+యాత్ =జాగర్యాత్ ఋ+యాత్=అర్యాత్ స్మృ+యాత్ = స్మర్యాత్ వద్+ యాత్=ఉద్యాత్ జి+యా+త్ = జీయాత్ శ్రు+యాత్ = శ్రూయాత్ తౄ+యాత్ = తీర్యాత్ పౄ+యాత్ = పూర్యాత్ మన్థ్+యాత్ = మథ్యాత్

కాని పరస్మైపదాశీర్లిఙ్ ప్రత్యయములు పరమగునపుడు దా ధా ధాతువులకు, దా, ధా రూపములనుబొందు ధాతువులకు (సూ-261) మా,

స్థా, గై, పా (పానే), హా (త్యాగే), సో - అను ధాతువులకును చివరి యచ్చునకు ఏకారాదేశమగును. (కాని దా - లవనే, దై-శోధనే అను ధాతువుల యచ్చునకు రాదు ఉదా,- దా+యాత్=దేయాత్, దా+యాత్= దేయాత్. మా+యాత్=మేయాత్ స్థా+యాత్=స్థేయాత్ గై+యాత్= గేయాత్. పా+యాత్=పేయాత్ హా+యాత్=హేయాత్ సో+యాత్= సేయాత్ కాని (దా-లవనే) దా + యాత్ = దాయాత్ (దై-శోధనే) దై+యాత్=దా+యాత్ (సూ-26 )=దాయాత్.

స్థా ధాతువు తప్ప తక్కిన ధాతువుల సంయుక్త పూర్వకమైన అకారమునకు పరస్మైపదాశీర్లిఙ్ ప్రత్యయములు పరమగునపుడు వికల్పముగా ఏకారాదేశమగును. ఉదా - గ్లై+ యాత్ = గ్లా+యాత్ (సూ-26 )=గ్లేయాత్, గ్లాయాత్.

సంయుక్తపూర్వకమయిన ఋఋూలు అంతమందుగల ధాతువుల కంటెను, వృధాతువుకంటెను పరమగు ఆత్మనేపదాశీర్లిఙ్ ప్రత్యయము లకు వికల్పముగా ఇడాగమము వచ్చును ఇడాగమ రహితమగు ఆత్మనే పదాశీర్లిఙ్ ప్రత్యయములు పరమగునపుడు ధాతువు చివరి ఋఋూలకును ఉపధకును గుణమురాదు ఉదా - స్తృ + సీష్ట = స్తరిషీష్ట, స్తృషీష్ట. స్తౄ + సీష్ట=స్తరిషీష్ట, స్తీర్షీష్ట (సూ-176) ముచ్ + సీష్ట=ముక్షీష్ట (సూ-118, 44) వృ+ సీష్ట

సూ 783 భావకర్మార్థములందు లుఙ్, లృట్, లృఙ్, ఆశీర్లిఙ్ ప్రత్యయములు పరమగునపుడు ఆకారాంత ధాతువుల చివర యకారాగమము, తక్కిన అజన్తధాతువుల చివరి యచ్చునకు, హన్, గ్రహ్ ధాతువుల యచ్చునకును వృద్ధియు, దృశ్ ధాతువు నచ్చునకు గుణమును వికల్పముగా వచ్చును. అప్పుడవి అనిడ్ధాతువులైనను వానికంటె పరమయిన వలాద్యార్ధ ధాతుకములకు ఇడాగమము వచ్చును

(లుట్) పా+తా=పాయితా పాతా
(ౢట్) పా+స్యతే=పాయిష్యతే పాస్యతే
(ౢఙ్) అ+పా+స్యత=అపాయిష్యత, అపాస్యత
(ఆశీర్లిఙ్) పా+సీష్ట=పాయిషీష్ట పాసీష్ట
(లుట్) వీ + తా = వాయితా, వేతా (ౢట్) వీ+స్యతే = వాయిష్యతే వేష్యతే (ౢఙ్) అ + వీ + స్యత = అవాయిష్యత అవేష్యత (ఆశీర్లిఙ్) వీ + సీష్ట = వాయిషీష్ట వేశీష్ట

సూ - 284 వృద్ధి నిమిత్తప్రత్యయము పరమగునపుడు హన్ ధాతు హకారమునకు ఘకార మాదేశమగును

(లుట్) హన్ + తా = ఘానితా, హన్తా (ౢట్) హన్ + స్యతే = ఘానిష్యతే, హనిష్యతే (సూ-281) అ + హన్ + స్యత=అఘానిష్యత, అహనిష్యత (సూ-283)

సూ - 285 భావకర్మార్థములలో హన్ ధాతువునకు వృద్ధి రానపుడు ఆశీర్లిఙ్ ప్రత్యయములు పరమగునపుడు వధాదేశమువచ్చును

(ఆశీర్లిఙ్) హన్ + సీష్ట = ఘానిషీష్ట వధిశీష్ట.
(లుట్) దృశ్+తా=దర్శితా, ద్రష్టా (ౢట్) దృశ్+స్యతే=దర్శిష్యతే, ద్రక్ష్యతే (ౢఙ్) అ + దృశ్+స్యత = అదర్శిష్యత అద్రక్ష్యత. (ఆశీర్లిఙ్) దృశ్+సీష్ట=దర్శిషీష్ట ద్రక్షీష్ట

## భూతార్థకము - లుఙ్

లుఙంతము ఒక పనియొక్క సమాప్తిని మాత్రము తెలియజేయును కాని భూతకాలమునందు అవని జరిగిన సమయమును ప్రత్యేకముగా సూచింపదు లేదా ఈరోజున జరిగినపనిని తెలియజేయును కావున లుఙ్ భూతసామాన్యార్థకమనిగాని, అనద్యతన భూతార్థకమనిగాని చెప్పవచ్చును.

'మా' అను విశేషార్థకావ్యయముతో లుఙంతము ప్రయోగింప బడును అప్పుడది విధ్యర్థమును బోధించును.

లుఙ్ ప్రత్యయములు పరమగునపుడు, లఙ్ లృఙ్ రూపములందు వలెనే హలాది ధాతువులకు ముందు అకారము, అజాది ధాతువులకు ముందు ఆకారమును ఆగమముగా జేరును. (సూ-94-95) కాని 'మా' అను అవ్యయముతో ప్రయోగించునపు డీయాగమములు చేరవు. ఆకారాగమమునకు, ధాతువు తొలియచ్చునకును గలిపి వృద్ధి యేకాదేశ మగును (సూ-96)

లుఙంతరూపము లేడు విధములుగ నేర్పడును.

మొదటి విధము

ఇందు చేరు పరస్మైపద లుఙ్ ప్రత్యయములు పరస్మైపద లఙ్ ప్రత్యయములతో సమానమే

అవి యేమనగా:- త్-తామ్-అన్-స్-తమ్-త-అమ్-వ-మ అనునవి.

భూ, స్థా, దా, దాణే, దో, ధా అను ధాతువులకు, ఇ-గతౌ అను ధాతువునకు ఆదేశమగును 'గా' ధాతువునకును ఈ ప్రత్యయములు చేరి లుఙంత రూపము లేర్పడును.

ఇందలి అజాది ప్రత్యయములు పరమగునపుడు భూధాతువు చివర వకార మాగమముగా చేరును (సూ-262). ఎచ్చటను గుణమురాదు.

'దో' ధాతువు చివర యచ్చునకు ఆకారాదేశమువచ్చి 'దా' అవి యగును. ఆకారాంత ధాతువులకంటె పరమయిన ప్రథమపురుష బహువచన ప్రత్యయమగు అన్ అనుదానికి 'ఉః' అనునది ఆదేశమగును

అభూత్-అభూతామ్-అభూవన్     అదాత్ - అదాతామ్ - అదుః
అభూః-అభూతమ్ - అభూత     అదాః - అదాతమ్ - అదాత
అభూవమ్ - అభూవ - అభూమ     అదామ్ - అదావ - అదామ

ఘ్రా, ధే పానే శో చో సో - అను ధాతువులకు ఈవిధముగా వికల్ప రూపము లేర్పడును.

ఈవిధమైన రూపములు పరస్మైపదములో మాత్రమే యుండును కావున పై వానిలో అవసరమగు వానికి ఆత్మనేపదరూపములు ఆరవ విధమునగాని, ఏడవవిధమునగాని యేర్పడును

## రెండవ విధము

మొదటివర్గపు ధాతువులకుజేరు లఙ్ ప్రత్యయములకు ముందు అకారమునుజేర్చుటచే రెండవవిధమగు లుఙ్ ప్రత్యయము లేర్పడును.

| పరస్మైపద ప్రత్యయములు | ఆత్మనేపద ప్రత్యయములు. |
|---|---|
| అత్ - అతామ్ - అన్ | అత - ఏతామ్ - అన్త |
| అః - అతమ్ - అత | అథాః - ఎథామ్ - అధ్వమ్ |
| అమ్ - అవ - అమ | ఏ - అవహి - అమహి. |

ఈ ప్రత్యయములు చేరుటచే రెండవవిధమగు లుఙంతరూపము లేర్పడును ఈ విధమైన రూపములు పుషాదులకు, ద్యుతాదులకు, ఆప్ గమ్-మున్నగు ఌదిత్తులగు ధాతువులకు పరస్మైపదమునందు సృ, ఋ-అను మూడవగణము ధాతువులకు శాస్ అస్ వచ్ ఖ్యా లిప్, సిచ్ హ్వే-అను ధాతువులకును నిత్యముగా నేర్పడును అందు లిప్, సిచ్ హ్వేధాతువులకు ఆత్మనేపదమునందు ఈ విధమున రూపములు వికల్పముగా నేర్పడును పరస్మైపదమునందు ఋద్, ఘుష్ మున్నగు ఇరిత్తులగు ధాతువులకు, జౄ స్తమ్భు మ్రుచ్ మ్లుచ్, గ్రుచ్, గ్లుచ్, గ్లుఞ్చు

శ్వి ధాతువులకును ఈ విధమున రూపములు వికల్పముగా నేర్పడును.
పక్షాంతరమున శ్వి ధాతువునకు మూడవవిధమునను తక్కినవానిలో
అనిట్ ధాతువులకు ఆరవవిధమునను, సేట్ ధాతువులకు ఏడవవిధము
నను లుఙంతరూపము లేర్పడును ఉదా -

అవోచత్-అవోచతామ్-అవోచన్     అవోచత - అవోచేతామ్ - అవోచన్త

అవోచః-అవోచతమ్-అవోచత     అవోచథాః - అవోచేథామ్ - అవోచధ్వమ్

అవోచమ్-అవోచావ-అవోచామ     అవోచే - అవోచావహి - అవోచామహి

(బ్రూ ధాతువునకు ఆదేశమగు వచ్ ధాతువు ఉభయపది యగును)
లుఙ్ ప్రత్యయములు పరమగునపుడు వచ్ ధాతువు అకారమునకు
ఓకారము ఆదేశమగును అ+వచ్+అత్ = అవోచత్. అ+వచ్+అత =
అవోచత

## మూడవ విధము

రెండవవిధమున జేరు లఙ్ ప్రత్యయములే ఈ విధమునందు
కూడ జేరును పదవ గణము ధాతువులకు ప్రేరణార్థక ధాతువులకు
శ్రి, ద్రు స్రు ధాతువులకు నిత్యముగాను, ధ్వే శ్వి ధాతువులకు వికల్పము
గాను ఈవిధమున రూపములేర్పడును పదవగణము ధాతువులయందు
ప్రేరణార్థకమునందును ఉన్న అయ అనునది లోపించును కాని
తత్కృతములగు మార్పులన్నీ యుండును ఇందు ధాతు ద్విరుక్తి అభ్యాస
కార్యములును కలుగును కాని అజాదిధాతువులకు మొదటి అచ్చుకంటె
పరమయిన హల్లునకు ద్విరుక్తి, అభ్యాసముకంటె పరముగా ఇకా
రాగమమును వచ్చును అభ్యాసమునందలి అకారమునకు ఇకారాదేశ
మగును అభ్యాసమునందలి లఘ్వక్షరమునకు దీర్ఘము వచ్చును.

ఈవిధముగా నేర్పడిన ప్రకృతికి లుఙ్ ప్రత్యయములు చేరునపుడు సామాన్యముగా హ్రస్వము వచ్చును

అబీభవత్ - అబీభవతామ్ - అబీభవన్
అబీభవః - అబీభవతమ్ - అబీభవత
అబీభవమ్ - అబీభవావ - అబీభవామ

అబీభవత - అబీభవేతామ్ - అబీభవన్త
అబీభవథాః - అబీభవేథామ్ - అబీభవధ్వమ్
అబేభవే - అబీభవావహి - అబీభవామహి

[భూధాత్వభ్యాసమునందలి ఉకారమునకు అకారాదేశమగును (సూ-262)]

ఈ ప్రత్యయములన్నియు అజాది దుర్బల ప్రత్యయములగుటచే వానికి ముందున్న ఇకార ఉకారములకు ఇయ్, ఉవ్ - అను ఆదేశములు, అకారమునకు లోపమును వచ్చును ఉదా - అశిశ్రియత్, అదుద్రువత్ అశుశ్రువత్, అశిశ్వియత్ అదధత్ శ్వి ధాతువునకు పక్షాంతరమున రెండవవిధముగను ఏడవవిధముగనుగూడ లుఙంత రూపము లేర్పడును రెండవవిధమైన రూపములలో లుఙ్ ప్రత్యయములు పరమగునపుడు వానికి ముందున్న ఇకారము లోపించును అశ్వత్, అశ్వయీత్ ధే ధాతువునకు పక్షాంతరమున మొదటివిధముగ రూపము లేర్పడును అధాత్.

## నాలుగవ విధము

ఈవిధమైన రూపములు పరస్మైపదమునందు మాత్రమే నిష్పన్నము లగును

| ప్రత్యయములు - | |
|---|---|
| సీత్-సిష్టామ్-సిషుః<br>సీః-సిష్టమ్-సిష్ట<br>పిషమ్-సిష్వ-సిష్మ | యమ్ రమ్, నమ్ ధాతువులకు మొదటి రెండవ విధములలో పేర్కొనబడని ఆ ఏ ఓ ఐకారాంత ధాతువులకు ఈవిధముగ లుఙంతరూపము లేర్పడును |

అయంసీత్-అయంసిష్టామ్-అయంసిషుః
అయంసీః-అయంసిష్టమ్-అయంసిష్ట
అయంసిషమ్-అయంసిష్వ-అయంసిష్మ

రమ్ ధాతువు ఆత్మనేపదియై నను ఉపసర్గవశమున పర స్మైపది [illegible] రూపము లేర్పడును.

ఉదా.- వ్యరంసీత్, ఆరంసీత్, పర్యరంసీత్, ఉపారంసీత్. ఇట్లే అగ్లాసీత్. అమ్లాసీత్ మున్నగునవి

## ఐదవ విధము

| పరస్మైపద ప్రత్యయములు | ఆత్మనేపద ప్రత్యయములు |
|---|---|
| సత్ - సతామ్ - సన్ | సత - సతామ్ - సన్త |
| సః - సతమ్ - సత | సథాః - సాథామ్ - సధ్వమ్ |
| సమ్ - సావ - సామ | సి - సావహి - సామహి |

ఇక్కడ ఉపదగాను శ, ష స, హకారములు అంతమందును గల అనిట్ ధాతువులకు ఈ ప్రత్యయములు చేయటచే లుజంతరూపము లేర్పడును కాని దృశ్ ధాతువునకు ఇట్లేర్పడదు శ్లిష్ ధాతువునకు ఆలింగనార్థమునందు మాత్రమే ఇట్లేర్పడును. ఇతరార్థమునందు రెండవ విధముగ నేర్పడును. స్పృశ్, మృశ్. కృష్, తృప్, దృప్ ధాతువుల కీ విధమున వికల్పరూపము లేర్పడును

| | |
|---|---|
| అద్విక్షత్-అద్విక్షతామ్-అద్విక్షన్ | అద్విక్షత - అద్విక్షాతామ్ - అద్విక్షన్త |
| అద్విక్షః-అద్విక్షతమ్-అద్విక్షత | అద్విక్షథాః - అద్విక్షాథామ్ - అద్విక్షధ్వమ్ |
| అద్విక్షమ్-అద్విక్షావ-అద్విక్షామ | అద్విక్షి - అద్విక్షావహి - అద్విక్షామహి |

దుహ్, దిహ్, లిహ్ గుహ్ ధాతువులకంటె పరమయిన ఆత్మనే పద లుఙ్ ప్రత్యయములలో ప్రథమపురుషైకవచన, బహువచన, ఉత్తమ పురుష ద్వివచన ప్రత్యయములయందలి స సాలకు వికల్పముగా లోపము వచ్చును ఉదా - అదుగ్ధ-అధుక్షత, అదుగ్ధాః-అధుక్షథాః అధుగ్ధమ్-అధుక్షధ్వమ్ అదుహ్వహి-అధుక్షావహి

ఆరవ విధము

ఇంతకుముందు చెప్పబడిన విధములుగా లుఙంతరూపములు నిష్పన్నములుకాని ధాతువులలో అనిడ్ధాతువులకు ఆత్మనేపదమునందు ప్రయోగింపబడునపుడు పృ, క్రమ్ ధాతువులకును ఈ విధమున రూపములేర్పడును వృ ధాతువునకు, సంయుక్తపూర్వక ఋకారాంత ధాతువులకు ౠకారాంతధాతువులకును ఆరవ, ఏడవ విధముల రూపములు రెండును ఏర్పడును

| పరస్మైపద ప్రత్యయములు | ఆత్మనేపద ప్రత్యయములు |
|---|---|
| సీత్ - స్తామ్ - సుః | స్త - సాతామ్ - సత |
| సీః - స్తమ్ - స్త | స్థాః - సాథామ్ - ధ్వమ్ |
| సమ్ - స్వ - స్మ | సి - స్వహి - స్మహి |

ఇందలి పరస్మైపదప్రత్యయములు పరమగునపుడు ధాతువునందలి యచ్చునకు వృద్ధివచ్చును ఉదా - భృ-అభార్షీత్

ఆత్మనేపదప్రత్యయములు పరమగునపుడు, ధాతువు తుది ఇ ఈ ఉ ఊ లకు గుణమువచ్చును ఉదా - నీ-అనేష్ట సు-అసోష్ట

ౠకారమునకు ఈర్ అవిగాని ఊర్ అవిగాని ఆదేశమగును (సూ- 76) ఉదా - స్తౄ-అస్తీర్ష్ట వౄ-అపూర్ష్ట.

హ్రస్వముకంటె పరమగునపుడు స్త, స్థాః ప్రత్యయములలోని సకారము లోపించును

ఉదా.- భృ - అభృత :

ఆత్మనేపద ప్రత్యయములు పరమగునపుడు ధా ధాతువుల ఆకారము ఇకారముగా మారును.

ఉదా:- అదిత, అదిషాతామ్

అభార్షీత్-అభార్ష్టామ్-అభార్షుః

అభార్షీః-అభార్ష్టమ్-అభార్ష్ట

అభార్షమ్-అభార్ష్వ-అభార్ష్మ

అభృత-అభృషాతామ్-అభృషత

అభృథాః-అభృషాథామ్-అభృఢ్వమ్

అభృషి-అభృష్వహి-అభృష్మహి

## పదవ విధము

ఇంతకుముందు పేర్కొనబడిన విధములకు చెందని పేద్ధాతువుల కీ విధమున లుజంతరూపము లేర్పడును స్తు, సు ధాతువులు అనిద్ధాతువు లయినను వాని పరస్మైపద రూపము లీవిధముగనే యేర్పడును. అట్లే ధూ ధాతువుయొక్క పరస్మైపదరూపములు, అఞ్జ్ ధాతు రూపములును ఈ విధముగనే యేర్పడును

| పరస్మైపద ప్రత్యయములు | ఆత్మనేపద ప్రత్యయములు |
|---|---|
| ఈత్ - ఇష్టామ్ - ఇషుః | ఇష్ట - ఇషాతామ్ - ఇషత |
| ఈః - ఇష్టమ్ - ఇష్ట | ఇష్ఠాః - ఇషాథామ్ - ఇఢ్వమ్ |
| ఇషమ్ - ఇష్వ - ఇష్మ | ఇషి - ఇష్వహి - ఇష్మహి |

ఇందలి పరస్మైపద ప్రత్యయములు పరమగునపుడు

1) ధాతువు తుదిఇక్కులకు వృద్ధివచ్చును. లూ - అలావీత్ వృ అవారీత్

2) వద్, వ్రజ్ ధాతువులయొక్కయు రేఫ లకారాంత ధాతువుల యొక్కయు ఉపధకు వృద్ధివచ్చును అవాదీత్ అవ్రాజీత్

3) రేఫ లకారాంత భిన్నములగు హలాది ధాతువుల ఉపధయగు లఘు అకారమునకు వికల్పముగా వృద్ధి వచ్చును ఖద్-అఖాదీత్ అఖదీత్ కాని హ, మ యకారాంత ధాతువులకు క్షణ్, శ్వస్ జాగృకట్, లగ్ హస్, లస్, శ్వి మున్నగు ధాతువులకు వృద్ధిరాదు అక్షణీత్

4) ఉపధయగు హ్రస్వ ఇక్కులకు, జాగృ శ్వి ధాతువుల యచ్చుల కును గుణమువచ్చును శుచ్-అశోచీత్ జాగృ - అజాగరీత్

ఆత్మనేపద ప్రత్యయములు పరమగునపుడు—

1) ధాతువు తుదిఇక్కునకు ఉపధయగు హ్రస్వఇక్కునకును గుణము వచ్చును లూ-అలవిష్ట ముద్ - అమోదిష్ట

2) పద్ ధాతువునకు ప్రథమపురుషైకవచనమున 'ఇ అను ప్రత్యయము చేరి అపాది అను రూపమేర్పడును

| (పరస్మైపదము) | (ఆత్మనేపదము) |
|---|---|
| అవాదీత్-అవాదిష్టామ్-అవాదిషుః | అరోచిష్ట - అరోచిషాతామ్ - అరోచిషత |
| అవాదీః-అవాదిష్టమ్-అవాదిష్ట | అరోచిష్ఠాః - అరోచిషాథామ్ - అరోచిధ్వమ్ |
| అవాదిషమ్-అవాదిష్వ-అవాదిష్మ | అరోచిషి - అరోచిష్వహి - అరోచిష్మహి |

పైన పేర్కొనబడినవాటిలో మొదటి నాల్గువిధములుగను కర్త్ర్యర్థకధాతువులకు మాత్రమే ణిజంతరూపము లేర్పడును కావున ఆ ధాతువులకుకూడ భావకర్మార్థములందు తరువాతి మూడువిధములలో నేదో యొక విధముగ ణిజంతరూపము లేర్పడునవి గ్రహించునది భావకర్మార్థములందంతటను ప్రథమపురుషైకవచనమున 'ఇ' అను ప్రత్యయము మాత్రమే చేరును. ఆ ప్రత్యయము పరమగునపుడు దానికి ముందున్న అచ్చునకు, ఉపధయగు అకారమునకును వృద్ధివచ్చును కాని జన్ ధాతువునకు, కొన్ని మకారాంతధాతువులకును రాదు ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణమువచ్చును ఆకారాంత ధాతువుల చివర యకారమాగమముగా చేరును హన్ ధాతువు 'ఘాత్' అని మారును

ఉదా - అభావి అదాయి · అవాచి అనామి అశమి అద్వేషి అఖారి . అవాది . అరోచి అఘాతి అజని అవధి అగామి , అకామి · అదామి అవామి



ఏకోనవింశః పాఠః - పందొమ్మిదవ పాఠము

# విశేషణములు - తరతమ భావార్థకములు

---

1) రెండు పదార్థములను ఒండొంటితో పోల్చి అందు ఒకదానికంటె రెండవది అతిశయముకలది అను నర్థములో ఈయస్', తర అను తద్ధిత ప్రత్యయములు అనేక పదార్థములను సరిపోల్చుచు వానిలో ఒకటి తక్కినవానికంటె అతిశయముకలది అను నర్థములో ఇష్ఠ 'తమ' అను తద్ధిత ప్రత్యయములును చేరును

## ఈయన్ ఇష్ఠ ప్రత్యయాంతములు

2) ఈ ప్రత్యయములు గుణవాచకములకే చేరును ఈ ప్రత్యయములు పరమగునపుడు సామాన్యముగ అజంత ప్రాతిపదికముల చివరి యచ్చులకు హలంత ప్రాతిపదికముల చివరి హల్లులకు వానికి ముందున్న అచ్చులకును లోపమువచ్చును

ఉదా - లఘు+ఈయస్=లఘీయస్ లఘు+ఇష్ఠ=లఘిష్ఠ

మహత్+ఈయస్ = మహీయస్ మహత్+ఇష్ఠ = మహిష్ఠ

బలిన్ + ఈయన్ = బలీయన్ బలిన్ + ఇష్ఠ = బలిష్ఠ

3) ఈ ప్రత్యయములు పరమగునపుడు హలాది పదములయందలి హ్రస్వ ఋకారమునకు రాదేశమగును

ఉదా - పృథు-ప్రథీయస్ ప్రథిష్ఠ మృదు-మ్రదీయస్ మ్రదిష్ఠ

ఇట్లే భృశ కృశ దృఢ పరివృఢ మున్నగు శబ్దములకును ఈయస్ ఇష్ఠ ప్రత్యయాంతముల నూహించునది

4) ఈ ప్రత్యయములు పరమగునపుడు స్థూల దూర, హ్రస్వ క్షిప్ర క్షుద్ర అను పదములయందలి చివరి అచ్చును, దానికి ముందున్న హల్లును లోపించును యువన్ శబ్దములో వన్ అనునది లోపించును వానికి ముందున్న అచ్చునకు గుణమువచ్చును
ఉదా - స్థూల+ఈయస్=స్థూ+ఈయస్ = స్థో + ఈయస్ = స్థవీయస్ (సూ- 2) ఇట్లే స్థూల + ఇష్ఠ = స్థవిష్ఠ దూర-దవీయస్ దవిష్ఠ హ్రస్వ-హ్రసీయస్, హ్రసిష్ఠ క్షిప్ర-క్షేపీయస్ క్షేపిష్ఠ క్షుద్ర - క్షోదీయస్ క్షోదిష్ఠ యువన్-యవీయస్ యవిష్ఠ

5) ఈ ప్రత్యయములు పరమగునపుడు విన్, మతుప్ ప్రత్యయములకు లోపము వచ్చును
ఉదా - స్రగ్విన్-స్రజీయస్ స్రజిష్ఠ బలవత్-బలీయస్, బలిష్ఠ

పై నియమములకు సరిపడని విశేషరూపములు కొన్ని క్రింద పేర్కొనబడుచున్నవి

అన్తిక - నేదియస్ - నేదిష్ఠ

అల్ప- { అల్పీయస్ / కనీయస్ } { అల్పిష్ఠ / కనిష్ఠ }

ఉరు - వరీయస్ - వరిష్ఠ

గురు - గరీయస్ - గరిష్ఠ

దీర్ఘ - ద్రాఘీయస్ - ద్రాఘిష్ఠ

ప్రశస్య - శ్రేయస్ - శ్రేష్ఠ

ప్రియ - ప్రేయస్ - ప్రేష్ఠ

బహు - భూయస్ - భూయిష్ఠ

బహుల - బంహీయస్ - బంహిష్ఠ

బాఢ - సాధీయస్ - సాధిష్ఠ

యువన్- { యవీయస్ / కనీయస్ } { యవిష్ఠ / కనిష్ఠ }

వృద్ధ - { వర్షీయస్ / జ్యాయస్ } { వర్షిష్ఠ / జ్యేష్ఠ }

స్థిర - స్థేయస్ - స్థేష్ఠ

స్ఫిర - స్ఫేయస్ - స్ఫేష్ఠ

వృన్దారక - వృన్దీయస్ - వృన్దిష్ఠ

తృప - త్రపీయస్ - త్రపిష్ఠ

ఈయస్ ప్రత్యయాంతములకు 'ఈ' అను స్త్రీ ప్రత్యయముచేరుట చేతను ఇష్ఠ ప్రత్యయాంతములకు -ఆ అను స్త్రీ ప్రత్యయము చేరుట చేతను స్త్రీలింగరూపము లేర్పడును

## తర తమ ప్రత్యయాంతములు

ఈ ప్రత్యయములు గుణవాచకవిశేషణములకేకాక క్రియావాచక విశేషణములకు, అవ్యయములకు క్రియలకునుగూడ చేరును క్రియలకు చేరినపుడు ఇవి తరామ్ తమామ్ అను రూపములను బొందును అప్పు డవి క్రియాతిశయమునే బోధించును కొన్నిచోట్ల అవ్యయములకు చేరినపుడుగూడ ఇ. తరామ్ తమామ్ అను రూపములను బొందును అప్పుడవి క్రియావిశేషణములగును

లఘు - లఘుతర - లఘుతమ పాచక - పాచకతర - పాచకతమ పచతి_పచతితరామ్_పచతితమామ్ ఉచ్చైః_ఉచ్చైస్తర_ఉచ్చైస్తమ ఉచ్చైః - ఉచ్చైస్తరామ్ - ఉచ్చైస్తమామ్

తర తమ ప్రత్యయాంతములకు ఆ అను స్త్రీప్రత్యయము చేరి స్త్రీలింగరూపము లేర్పడును

## సంఖ్యావాచకములు

ఏక-ద్వి-త్రి-చతుర్-పంచన్-షష్-సప్తన్-అష్టన్-నవన్-దశన్-ఏకాదశన్-ద్వాదశన్-త్రయోదశన్-చతుర్దశన్-పఞ్చదశన్ - షోడశన్ - సప్తదశన్-అష్టాదశన్-నవదశన్ (లేక) ఏకోనవింశతి-వింశతి- అనునవి ఒకటి మొదలు 20 వరకు సంస్కృత సంఖ్యావాచక శబ్దములు వానిలో నవదశన్ వరకు గల శబ్దములు కేవలము విశేషణవాచకములుగనే యుండును అనగా ఆ శబ్దములన్నియు సంఖ్యేయపదములని భావము అందు మొదటి నాలుగుశబ్దములకును మూడులింగములయందు యాప

భేదముకలదు పంచన్ మొదలు నవదశన్‌వరకుగల శబ్దములు మూడు లింగములయందును సమానరూపములుగనే యుండును

ఉదా - ఏకో నరః ఏకా నారీ ఏకం ఫలం

దశ నరాః దశ నార్యః దశఫలాని

వింశతి (20) - త్రింశత్ (30) - చత్వారింశత్ (40) పఞ్చాశత్ (50)- షష్టి (60) - సప్తతి (70) - అశీతి (80) - నవతి (90) - శత( 00)- సహస్ర ( 000)

వింశతి మొదలు నవతివరకుగల శబ్దములు అవి అంతమందుగల సంఖ్యాశబ్దములును నిత్య స్త్రీలింగములు ఇరువదికి ముప్పదికి నడుమగల సంఖ్యావాచకశబ్దములు ఏక, ద్వి త్రి - మున్నగువానిని నవన్‌వంతు వరుసగా వింశతికి ముందు చేర్చుటచే నేర్పడును అట్లు చేర్చునపుడు మొదటిపదము చివరనున్న నకారము లోపించును ద్వి, త్రి అష్టన్ - అనునవి వరుసగా ద్వా త్రయః అష్టా అని మారును ఉదా - ఏకవింశతిః- ద్వావింశతిః-త్రయోవింశతిః-చతుర్వింశతిః-పఞ్చవింశతి -షడ్వింశతిః - సప్తవింశతిః - అష్టావింశతిః - నవవింశతిః

నవన్ అనునది చేరుటకు బదులు తరువాతి సంఖ్యాశబ్దమునకు ఒకటి తక్కువ అను అర్థముగల ఏకోన అనుదానిని ముందుచేర్చిగూడ వ్యవహరింతురు ఉదా - నవవింశతి=ఏకోనత్రింశత్

ఇట్లే తరువాతి సంఖ్యాశబ్దము లన్నియు నేర్పడును ద్వి త్రి అష్టన్ అనునవి చత్వారింశత్ పంచాశత్ షష్టి సప్తతి నవతి అనువానికి ముందు చేరినపుడు వికల్పముగా ద్వా త్రయః అష్టా అను రూపములను బొందును

అశీతి శబ్దమునకు ముందు చేరునపుడు మారదు

ఉదా - ద్వాత్రింశత్ త్రయస్త్రింశత్ అష్టాత్రింశత్

ద్విచత్వారింశత్ (లేక) ద్వాచత్వారింశత్ త్రిచత్వారింశత్ (లేక) త్రయశ్చత్వారింశత్ అష్టచత్వారింశత్ (లేక) అష్టాచత్వారింశత్ మున్నగునవి

ద్వ్యశీతిః త్ర్యశీతిః అష్టాశీతిః

శతశబ్దము ఆది అంతమందుగల సంఖ్యాశబ్దములును నిత్య నపుంసకలింగములు ఉదా - శతమ్, ఏకోన శతమ్

ఏకోనవింశతిశబ్దము మొదలుగాగల శబ్దములన్నియు సంఖ్య యందును సంఖ్యేయములయందును వర్తించును సంఖ్యాపరములయినచో విశేష్యవాచకములగును సంఖ్యేయపరములయినచో విశేషణవాచకము లగును సంఖ్యేయపరములయినప్పు డవి నిత్యైక వచనాంతములు సంఖ్యాపరము లయినపుడు మూడువచనములందును ఉండును ఉదా - వింశతిఃగావః=ఇరువదిగోవులు గవాం వింశతిః=గోవులయొక్క ఇరువది గవాం వింశతీ=గోవులయొక్క రెండు ఇరువదులు గవాం వింశతయః= గోవులయొక్క ఇరువదులు

ఏకశబ్దము నిత్యైకవచనాంతము దీనికి మూడులింగముల యందుమ సర్వశబ్దమునకువలె సుబంతరూపము లేర్పడును

ద్విశబ్దము నిత్యద్వివచనాంతము దీనికిగూడ మూడులింగముల యందును సర్వశబ్దమునకువలెనే సుబంతరూపము లేర్పడును త్రి మొదలు నవదశన్ వరకుగల శబ్దములు నిత్య బహువచనాంతములు

(త్రిశబ్దము)

పుంలింగము - త్రయః - త్రీన్ - త్రిభిః - త్రిభ్యః - త్రిభ్యః - త్రయాణామ్ - త్రిషు

స్త్రీలింగము - తిస్రః - తిస్రః - తిసృభిః - తిసృభ్యః - తిసృభ్యః - తిసృణామ్ - తిసృషు

నపుంసకలింగము - త్రీణి - త్రీణి (తక్కినవి పుంలింగమువందువలె
నుండును)

(చతుర్ శబ్దము)

పుంలింగము - చత్వారః చతురః - చతుర్భిః - చతుర్భ్యః - చతుర్భ్యః-
చతుర్ణామ్-చతుర్షు

స్త్రీలింగము - చతస్రః- చతస్రః- చతసృభిః- చతసృభ్యః - చతసృభ్యః-
చతసృణామ్-చతసృషు

నపుంసకలింగము - చత్వారి-చత్వారి (తక్కినవి పుంలింగము వందువలె
నుండును)

పంచన్ మొదలు నవదశన్ వరకుగల శబ్దములకంటె పరమైన
ప్రథమా ద్వితీయా విభక్తుల బహువచన ప్రత్యయములు లోపించును
హలాది విభక్తులు పరమగునపు
పంచన్ శబ్దమునకు పదాంతమందును షష్ఠీ బహువచనమునందు వకారాంత
దును నకారము లోపించును
శబ్దముల ఉపధకు దీర్ఘము వచ్చును

పంచ-పంచ-పంచభిః - పంచభ్యః - పంచభ్యః- పంచానామ్- పంచసు

ఇట్లే తక్కిన నకారాంత సంఖ్యాశబ్దములకును సుబంతరూపముల
నూహించునది కాని అష్టన్ శబ్దమునకు మరియొక విధమైన సుబంత
రూపములు గూడ గలవు ఉదా - అష్టౌ అష్టౌ అష్టాభిః అష్టాభ్యః
అష్టాభ్యః అష్టానామ్ అష్టాసు (షష్ఠీ విభక్తియందు భేదము లేదు)

షష్శబ్దము - షట్ (డ్) షట్ (డ్) షడ్భిః షడ్భ్యః
షడ్భ్యః షణ్ణామ్ షట్సు

ఎన్ని ? ఎందరు ? అను అర్థములుగల కతిశబ్దముగూడ నిత్య
బహువచనాంతము మూడులింగములందును ఏకరూపముగా నుండును

కతి కతి, కతిభిః కతిభ్యః కతిభ్యః కతీనామ్ కతిషు

(సంఖ్యాపూరణార్థములు)

మొదటి రెండవ, మూడవ - మున్నగు అర్థములుగల శబ్దములు సంఖ్యాపూరణార్థకములనబడును

ఏక, ద్వి, త్రి, చతుర్, షష్ శబ్దములకు వరుసగా ప్రథమ ద్వితీయ, తృతీయ చతుర్థ షష్ఠ అనునవి పూరణార్థకశబ్దములు నాల్గవ అను అర్థములో తుర్య, తురీయ శబ్దములుగూడ వాడుకలో గలవు దశన్ శబ్దమువరకుగల తక్కిన సంఖ్యావాచకములకు చివరి నకారము లోపించి మకారము చేరుటచే ఏకాదశన్ మొదలు నవదశన్ వరకు గల వానికి చివరి అన్ లోపించి అకారము చేరుటచేతను పూరణార్థక శబ్దము లేర్పడును ఉదా - పఞ్చమ సప్తమ అష్టమ నవమ, దశమ ఏకాదశ, ద్వాదశ మున్నగునవి

ఏకోనవింశతి మొదలు నవవింశతివరకు గలవానికి తమ అనునది చేరుటచేగాని చివరి తి' వర్ణము లోపించుటచేగాని పూరణార్థకశబ్దము లేర్పడును ఉదా - ఏకోనవింశతితమః ఏకోన వింశః వింశతితమః వింశః మున్నగునవి

ఏకోనత్రింశత్ మొదలుగాగల సంఖ్యావాచకములలో హలంతములకు (అనగా నవపఞ్చాశత్ వరకు) చివర తమ అనునది చేరుటచేగాని చివరి హల్లు లోపించుటచేగాని పూరణార్థకము లేర్పడును ఉదా - ఏకోన త్రింశత్తమః ఏకోనత్రింశః త్రింశత్తమః త్రింశః- మున్నగునవి

షష్టి సప్తతి అశీతి నవతి శబ్దములకు శతాది శబ్దములకును నిత్యముగా తమ అనునది చేరుటచే పూరణార్థకశబ్దము లేర్పడును ఉదా -షష్టితమ, సప్తతితమ అశీతితమ, నవతితమ, శతతమ ఏకశతతమ మున్నగునవి

షష్టి సప్తతి అశీతి నవతిశబ్దములతో కూడిన తక్కిన సంఖ్యా వాచకములకు (ఏకోన షష్టి మున్నగువానికి) తమ చేరుటచేగాని చివరి ఇకారము లోపించి అకారము చేరుటచేగాని పూరణార్థకశబ్దము లేర్పడును ఉదా. ఏకోన షష్టితమ, ఏకోనషష్ట ఏకషష్టితమ, ఏకషష్ట మున్నగునవి కతిశబ్దమునకు 'థ' ప్రత్యయము చేరి పూరణార్థకశబ్దమేర్పడును కతిథ

పై వానిలో ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థ తుర్య తురీయ అనువానికి 'ఆ' అను స్త్రీప్రత్యయము చేరుటచే తక్కినవానికి చివరి అకారము లోపించి 'ఈ' అను స్త్రీప్రత్యయము చేరుటచేతను స్త్రీలింగ శబ్దరూపము లేర్పడును

పుంలింగ ప్రథమశబ్దమునకు ప్రథమావిభక్తి బహువచనమునందు ప్రథమే - ప్రథమాః అను రెండు రూపము లేర్పడును. ద్వితీయ తృతీయ శబ్దములకు, ద్వితీయా, తృతీయా శబ్దములకు చతుర్థీ పంచమీ, షష్ఠీ సప్తమి ఏకవచనములయందు వికల్పముగా సర్వనామ శబ్దములకువలె సుబంతరూపము లేర్పడును ఉదా - ద్వితీయస్మై - ద్వితీయాయ ద్వితీయస్మాత్-ద్వితీయాత్ ద్వితీయస్య- ద్వితీయస్మిన్-ద్వితీయే ద్వితీయస్యై-ద్వితీయాయై. ద్వితీయస్యాః-ద్వితీయాయాః ద్వితీయస్యామ్-ద్వితీయాయామ్ (తృతీయ తృతీయాశబ్దములకుకూడ ఇట్లే సుబంత రూపము లేర్పడును )

క్రియయొక్క అభ్యావృత్తి గణమునందు అనగా ఒకపని జరిగిన పర్యాయములను లెక్కించునపుడు ఒక్కసారి అను నర్థములో ఏకశబ్దమునకు సకృత్ అను రూపమేర్పడును

ద్వి, త్రి, చతుర్ శబ్దములకు 'స్' అను తద్ధితప్రత్యయము చేరి ద్విః, త్రిః, చతుః అను రూపములేర్పడును తక్కిన సంఖ్యావాచకములకు కృత్వస్ అను తద్ధిత ప్రత్యయముచేరి పఞ్చకృత్వః మున్నగు రూపము లేర్పడును. ఈ శబ్దములన్నియు తద్ధితాంతావ్యయములు

వింశః పాఠః - ఇరువదవ పాఠము

# సనాద్యంత ధాతువులు

---

సంస్కృతభాషలో రెండురకముల ధాతువులుకలవు ) భూ మున్నగు మూలధాతువులు 2) సనాద్యంతధాతువులు

సన్ క్యచ్ కామ్యచ్, క్యజ్, క్యష్ క్విప్, ణిచ్ యజ్, యక్ ఆయ ఈయజ్ ణిజ్-అను పండ్రెండును సనాదులు ఇవి అంతమందు గల శబ్దస్వరూపములుకూడ ధాతువులుగ పేర్కొనబడుచున్నవి ఇవియే సనాద్యంత ధాతువు లనబడును పై ప్రత్యయములలో కొన్ని స్వార్థమునందు కొన్ని విశేషార్థములందును చేరును అందు సన్ యజ్ యక్ ఆయ ఈయజ్ ణిజ్ అను ప్రత్యయములు ధాతువులకు చేరును ణిచ్ ప్రత్యయము ధాతువులకు ప్రాతిపదికములకునుగూడ చేరును తక్కినవి ప్రాతిపదికములకు (నామములకు) చేరును అందుచే అవి ప్రత్యేకముగ నామధాతువులనికూడ వ్యవహరింపబడుచున్నవి వీనిని గురించి సంగ్రహముగ మాత్రమే ఇచ్చట వివరింపబడును

### • సన్ ప్రత్యయాంత ధాకువులు

ఇష్ ధాతువునకు కర్మయు ఇష్ధాతువుతో సమానకర్తృకమును అగు ధాతువునకు ఇచ్ఛార్థమునందు స అనునది (సన్ ప్రత్యయము) జేరును ఉదా - పరితుమ్ ఇచ్ఛతి (=చదువుటకు కోరుచున్నాడు) అనునర్థములో పర్ ధాతువునకు 'స అనునది చేరును (పర్+స) ఆ ప్రత్యయము వలాద్యార్ధధాతుకమగుటచే సామాన్యముగా సేడ్ధాతువులకంటె పరమగునపుడు దానికిముందు ఇడాగమము వచ్చును (పర్+స=పర్+

ఇష (సూ-44) సన్ ప్రత్యయము పరమగునపుడు మూడవవిధమగు అజంతరూపములందువలె ధాతుద్విరుక్తియు, అభ్యాసకార్యములను కలుగును (పపర్+ఇష). సన్ ప్రత్యయము పరమగునపుడు ధాతువు యొక్క అభ్యాసమునందలి అకారమునకు ఇకార మాదేశమగును. (పిపర్+ఇష). ఇది సన్నంతధాతువు ఈ ప్రకృతికి తిప్ ప్రత్యయములు చేరి పిపరిషతి మున్నగు క్రియాపదము లేర్పడును

ఆర్ధధాతుక లకారములు పరమగునపుడు 'స' ప్రత్యయములోని అకారము లోపించును ఉదా - పిపరిష్+ఇష్యతి=పిపరిష్యతి సామాన్యముగా మూల ధాతువు పరస్మైపదియైనచో సన్నంతధాతువునకుకూడ పరస్మైపదములు ఆత్మనేపదియైనచో సన్నంతధాతువునకుగూడ ఆత్మనేపదములు చేరును. ఉదా:- ఏధితుమిచ్ఛతి=ఏదిధిషతే. కాని జ్ఞా, శ్రు, స్మృ, దృశ్ ధాతువుల సన్నంతములకు ఆత్మనేపదములే చేరును ఉదా - జ్ఞాతుమిచ్ఛతి = జిజ్ఞాసతే సన్ ప్రత్యయము దృఢప్రత్యయమగుటచే ధాతువు తుది ఇక్కునకు, ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణమువచ్చును ఉదా - స్మర్తుమిచ్ఛతి=సిస్మరిషతే కాని ఇడాగమ రహిత సన్ ప్రత్యయము పరమగునపుడు గుణమురాదు ఉదా - ద్రష్టుమిచ్ఛతి=దిదృషతే, భేత్తుమిచ్ఛతి=బిభిత్సతి

ఇడాగమరహిత సన్ ప్రత్యయము పరమగునపుడు ధాతువు తుది యచ్చునకు దీర్ఘమువచ్చును ఉదా - జేతుమిచ్ఛతి=జిగీషతి (సూ-288) శ్రోతుమిచ్ఛతి=శుశ్రూషతే

సన్నంతధాతువులకు కర్త్రర్థమునందు ఉ అను కృత్ప్రత్యయము చేరును. అది పరమగునపుడు అకారము లోపించును ఉదా - పరితుమ్ ఇచ్ఛుః=పిపరిష్+ఉః=పిపరిషుః ఇట్లే, జ్ఞాతు మిచ్ఛుః=జిజ్ఞాసుః

సన్నంతధాతువులకు భావార్థమునందు 'అ' యను కృత్ప్రత్యయము చేరును అట్టి 'అ' ప్రత్యయాంతశబ్దము స్త్రీలింగమునందుండును అందుచే దానికి ఆ యను స్త్రీప్రత్యయముచేరి, ఆ శబ్దము అకారాంతమగును

ఉదా- పఠితుమిచ్ఛా=పిపఠిషా జ్ఞాతుమిచ్ఛా=జిజ్ఞాసా

కొన్ని విశేషరూపము లీక్రింద పేర్కొనబడుచున్నవి -

పతితుమిచ్ఛతి=పిపతిషతి పిత్సతి
జ్ఞపితుమిచ్ఛతి=జిజ్ఞపయిషతి జ్ఞీప్సతి
తరితుమిచ్ఛతి=తితరిషతి, తితీర్షతి
మాతుమిచ్ఛతి=మిత్సతి -తే
కర్తుమిచ్ఛతి=చికీర్షతి, -తే
మోక్తుమిచ్ఛతి=మోక్షతే ముముక్షతే
సకర్మకమైనచో-ముముక్షతి
సంగన్తుమిచ్ఛతి=సఞ్జిగంసతే
గూహితుమిచ్ఛతి=జుఘుక్షతి -తే
ప్రస్థాతుమిచ్ఛతి=ప్రతిష్ఠాసతే
దాతుమిచ్ఛతి=దిత్సతి, - తే
స్వప్తుమిచ్ఛతి=సుషుప్సతి (సూ-261)
ఉద్ధర్తుమిచ్ఛతి=ఉద్దిధీర్షతి - తే
అధ్యేతుమిచ్ఛతి=అధిజిగమిషతే
ఈక్షితుమిచ్ఛతి=ఈచిక్షిషతే
దర్శయితుమిచ్ఛతి=దిదర్శయిషతి

హన్తుమిచ్ఛతి=జిఘాంసతి
ప్రపత్తుమిచ్ఛతి=ప్రపిత్సతే
మర్తుమిచ్ఛతి=ముమూర్షతి
ఆప్తుమిచ్ఛతి=ఈప్సతి
ఆరబ్ధుమిచ్ఛతి=ఆరిప్సతే
అత్తుమిచ్ఛతి=జిఘత్సతి
భవితుమిచ్ఛతి=బుభూషతి
గన్తుమిచ్ఛతి=జిగమిషతి
గ్రహీతుమిచ్ఛతి=జిఘృక్షతి
స్థాతుమిచ్ఛతి=తిష్ఠాసతి
ధర్తుమిచ్ఛతి=దిధరిషతే
మీమాంసితుమిచ్ఛతి = మీమాంసిషతే
చికిత్సితుమిచ్ఛతి=చికిత్సిషతి
ప్రత్యేతుమిచ్ఛతి=ప్రతీషిషతి
లబ్ధుమిచ్ఛతి=లిప్సతే
భావయితుమిచ్ఛతి=బిభావయిషతి

## 2. యఙ్ ప్రత్యయాంతధాతువులు

హలాదియగు ఏకాచ్క ధాతువునకు పౌనః పున్యము, అతిశయము అను నర్థములందు 'య' అనునది చేరి యఙంతధాతువులేర్పడును. యఙ్ ప్రత్యయము పరమగునపుడు ధాతుద్విరుక్తి అభ్యాసకార్యములును కలుగును. అభ్యాసమునందలి అకారమునకు దీర్ఘము, ఇకున్కనకు గుణమును వచ్చును కాని అనునాసికాంత ధాతువుల యభ్యాసమందలి అకారమునకు దీర్ఘమురాదు అట్టి అకారముకంటె పరముగా అనునాసికము (నకారము) ఆగమముగా చేరును యఙంత ధాతువులకు ఆత్మనేపద ప్రత్యయములే చేరును

ఉదా - బోభూయతే=మాటిమాటికి (లేక) మరల మరలఅవున్నాడు: ఎక్కువగా నున్నాడు గత్యర్థ ధాతువునకు కౌటిల్యార్థమునందు యఙ్ ప్రత్యయము చేరును ఉదా - వావ్రజ్యతే : జఙ్గమ్యతే = కుటిలముగా పోవుచున్నాడు

అర్ధధాతుక లకారములయందు యఙ్ ప్రత్యయమునకు లోపము వచ్చును ఉదా - బోభవాంచక్రే

## 3. యక్ ప్రత్యయాంత ధాతువులు

కణ్డూ మున్నగు కొన్ని ధాతువులకు స్వార్థమునందు 'య' అనునది చేరి యగంత ధాతువు లేర్పడును ఉదా - కణ్డూయతి = గోకు చున్నాడు

## 4 ఆయ ప్రత్యయాంత ధాతువులు

పూర్వము 'గుపూ ధూప విచ్ఛి పణి పనిభ్య ఆయః' (సూ-165) అను సూత్రముచే స్వార్థమునందు విధింపబడిన ఆయ ప్రత్యయము అంతమందు గలవియే ఆయ ప్రత్యయాంత ధాతువులనబడును. ఉదాః- గోపాయతి, ధూపాయతి మున్నగునవి.

## 5 ఈయఙ్ ప్రత్యయాంత ధాతువు

ఋత్ ధాతువునకు స్వార్థమునందు 'ఈయ' అనునది చేరి ఈయజంతధాతు వేర్పడును ఇది ఆత్మనేపదమునం దుండును ఉదా - ఋతీయతే=అసహ్యించుకొనుచున్నాడు దయచూపుచున్నాడు

## 6. ణిఙ్ ప్రత్యయాంతధాతువు

కమ్ ధాతువునకు స్వార్థమునందు 'ఇ' అనునది చేరి కామి అను ణిజంతధాతువేర్పడును ఇది ఆత్మనేపదధాతువు దానికి మొదటిగణము ధాతువులకువలె ణిజంతరూపము లేర్పడును ఉదా - కామి + అ + తే= కామయతే=కోరుచున్నాడు

ఆయ, ఈయఙ్, ణిఙ్ ప్రత్యయములు అర్ధధాతుకలకారముల యందు వికల్పముగాచేరును ఉదా - గోపాయాంచకార జుగోప ఋతీయాంచక్రే అనర్త (ఋత్ ధాతువు ఈయఙ్ ప్రత్యయము చేరనపుడు పరస్మైపదమునందుండును) కామయాఞ్చక్రే-చకమే

## 7. ణిచ్ ప్రత్యయాంతధాతువులు

స్వార్థమునందు పదవగణము ధాతువులకు, ప్రేరణార్థమునందు అన్నిధాతువులకును 'ఇ' అనునదిచేరి ణిజంతధాతువులేర్పడును ణిచ్ ప్రత్యయము పరమగునపుడు ధాతువు చివరి ఇక్కునకు ఉపధయగు అకారమునకు వృద్ధి ఉపధయగు అకారేతరహ్రస్వమునకు గుణమును వచ్చును ఉదా - చుర్ + ఇ = చోరి కృ + ఇ = కారి ఈ ధాతువులకు మొదటిగణము ధాతువులకువలె ణిజంతరూపము లేర్పడును ఈ ణిచ్ ప్రత్యయమునకు అ అను వికరణ ప్రత్యయము పరమగునపుడు, గుణము దానికి అ యాదేశమును కలుగగా 'అయ' అను రూప మేర్పడును అ రూపమే పూర్వము పదవగణము ధాతువులకు ప్రేరణార్థక

ధాతువులకును చేరు ప్రత్యయముగా పేర్కొనబడినదని గ్రహింపదగును ఇవియన్నియు ఉభయపదులు ఉదా - చోరయతి చోరయతే కారయతి, కారయతే

ప్రాతిపదికమునకు 'చేయుట' మున్నగు ధాత్వర్థములయందు 'ఇ' అనునది చేరి ణిజంతధాతువు ఏర్పడును ఆ ణిచ్ ప్రత్యయము పరమగునపుడు ప్రాతిపదికములో సామాన్యముగ, తరతమ భావార్థకము లగు ఈయస్ ఇష్ఠప్రత్యయములు పరమగునపుడు కలుగు మార్పు లన్నియును కలుగును ఆ ధాతువులకు మొదటిగణము ధాతువులవలె ణిజంతరూపము ఏర్పడును

ఉదా - దృఢంకరోతి = ద్రఢయతి స్రగ్విణం = స్రజయతి వటుం ఆచష్టే=వటయతి, అశ్వేనాతిక్రామతి=అశ్వయతి హస్తినాతిక్రామతి= హస్తయతి

## 8. క్యచ్ ప్రత్యయాంతధాతువులు

ఇష్ ధాతువుయొక్క కర్మ కోరువానికి సంబంధించునట్టిదియు నగు అర్థమును బోధించు ప్రాతిపదికమునకు య అనునదిచేరి క్యచ్ ప్రత్యయాంత ధాతువులేర్పడును క్యచ్ ప్రత్యయము పరమగునపుడు అకారమునకు ఈకారాదేశమగును ఉదా - పుత్రమాత్మన ఇచ్ఛతి - పుత్రీయతి=పుత్రుని తనకు కోరుచున్నాడు ఇందు పుత్రీయ అనునది క్యజంతధాతువు క్యచ్ ప్రత్యయము పరమగునపుడు నకారాంత శబ్దముల తుది నకారమునకు లోపమువచ్చి దానికి ముందున్న అకారమునకు ఈకారాదేశమగును రాజాన మాత్మన ఇచ్ఛతి=రాజీయతి

ఆర్ధధాతుక లకారములయందు చివరి అకారమునకు లోపము వచ్చును ఉదా - పుత్రీయ అంచకార పుత్రీయిష్యతి

హలంతశబ్దములకంటె పరమగు క్యచ్ ప్రత్యయమునకు ఆర్ధ ధాతుక లకారములయందు వికల్పముగా లోపము వచ్చును ఉదా - సమిధ మాత్మనఇచ్ఛతి-సమిధ్యతి, సమిధితా-సమధ్యితా

ఉపమానవాచకము కర్మవాచకమును అగు ప్రాతిపదికమునకు ఆచారార్థమునందు య అనునది చేరి క్యచ్ ప్రత్యయాంతధాతు పేర్ప డును ఉదా - పుత్రమివాచరతి - పుత్రీయతి (ఛాత్రమ్) = (ఛాత్రుని) పుత్రునివలె చూచుకొనుచున్నాడు విష్ణుమివాచరతి-విష్ణూయతి (అతిథిమ్) = (అతిథిని) విష్ణువువలె చూచుకొనుచున్నాడు

ఉపమానవాచకము, అధికరణవాచకమును అగు ప్రాతిపదికము నకు అచారార్థమునందు య అనునదిచేరి క్యచ్ ప్రత్యయాంత ధాతు వేర్పడును ఉదా - ప్రాసాదే ఇవాచరతి - ప్రాసాదీయతి (కుట్యామ్) = (గుడిసెయందు) ప్రాసాదమునందువలెనున్నాడు.

## 9. కామ్యచ్ ప్రత్యయాంతధాతువులు

పైన పేర్కొన్న విధముగనే ప్రాతిపదికమునకు య' అను దానికి బదులు కామ్య అనుదానిని చేర్చుటచే కామ్యచ్ ప్రత్యయాంత ధాతువు లేర్పడును ఉదా - పుత్రిమాత్మన ఇచ్ఛతి-పుత్రకామ్యతి ఇందు పుత్ర కామ్య అనునది ధాతువు

## 10. క్యఙ్ ప్రత్యయాంతధాతువులు

ఉపమానవాచకము కర్తృవాచకమును అగు ప్రాతిపదికమునకు 'య అనునది చేరి క్యఙంతధాతువేర్పడును దీనికి ఆత్మనేపద ప్రత్యయ ములు చేరును క్యఙ్ ప్రత్యయము పరమగునపుడు సకారమునకు వికల్పముగా లోపము అకారమునకు నిత్యముగా దీర్ఘమును వచ్చును ఉదా - కృష్ణ ఇవాచరతి-కృష్ణాయతే=కృష్ణునివలె ఆచరించుచున్నాడు. విద్వానివాచరతి-విద్వాయతే విద్వస్యతే.

## 11. క్యష్ప్రత్యయాంతధాతువులు

అభూత తద్భావ విషయములలో లోహిత మున్నగుశబ్దములకు భవత్యర్థమునందు 'య అనునది చేరి క్యషంతధాతువు లేర్పడును. క్యషంత ధాతువులకు పరస్మైపదాత్మనేపదప్రత్యయములు రెండును చేరును ఉదా - అలోహితః లోహితః భవతి-లోహితాయతి, లోహితాయతే.

## 12. క్విప్ ప్రత్యయాంతధాతువులు

ఆచారార్థమునందు అన్ని ప్రాతిపదికములకు క్విప్ ప్రత్యయము చేరి క్విబంతధాతువు లేర్పడును కాని ఆ క్విప్ప్రత్యయము పూర్తిగ లోపించును కావున ఆ ప్రాతిపదికములు మాత్రమే ధాతువులుగా మిగిలి తిజంతరూపము లేర్పడును ఉదా - కృష్ణ ఇవాచరతి-కృష్ణతి=కృష్ణుడువలె ఆచరించుచున్నాడు కవిరివాచరతి-కవయతి పితేవాచరతి=పితరతి



# అనుబంధము

ముందుపాఠములలో ఉదహరింపబడిన కొన్నిధాతువుల వివరణము :-

(మొదటిగణము - పరస్మైపదులు)

| | |
|---|---|
| అన్త్ - బన్ధనే = బంధించుట | అన్తతి |
| అమ్ - గతి, శబ్ద భక్తిషు=పోవుట, ధ్వనిచేయుట, భుజించుట | అమతి |
| అర్థ్ - గతౌ, యాచనేచ = పోవుట యాచించుట | అర్థతి |
| ఉష్ - దాహే = కాల్చుట | ఓషతి |
| క్షై - క్షయే = క్షీణించుట | క్షాయతి |
| ఘస్ - అదనే = తినుట | ఘసతి |
| ధే - పానే = త్రాగుట | ధయతి |
| రుష్ / రిష్ - హింసాయామ్ = హింసించుట | రోషతి / రేషతి |
| వన్ - సంభక్తౌ వ్యాపారే చ = విభజించుట, ప్రవర్తించుట | వనతి |
| వై - శోషణే=ఎండుట | వాయతి |
| శ్వి - గతివృద్ధ్యోః = పోవుట వృద్ధిపొందుట | శ్వయతి |
| షిధ్ - గత్యామ్, శాస్త్రే మాఙ్గళ్యేచ = పోవుట, శాసించుట | సేధతి |
| సృప్ - గతౌ = ప్రాకుట, కదలుట | సర్పతి |
| స్యమ్ / స్వన్ - శబ్దే = ధ్వనిచేయుట | స్యమతి / స్వనతి |

(ఆత్మనేపదులు)

| | |
|---|---|
| అయ్ - గతౌ = పొందుట, పోవుట | అయతే |
| ఋజ్ - గతి స్థానార్జనోపార్జనేషు = ఆర్జించుట మొ | అర్జతే |
| క్ష్మాయీ - శబ్దే, ఉన్దనేచ = ధ్వనిచేయుట, తడపుట | క్ష్మాయతే |
| క్ష్మాయ్ - విధూననే = దులపుట, కదల్చుట | క్ష్మాయతే |
| దయ్ - దానగదిరక్షణ హింసాదానేషు = ఇచ్చుట మొ | దయతే |
| భ్రాజ్ - దీప్తౌ = ప్రకాశించుట | భ్రాజతే |
| రభ్ - రాభస్యే = ఆరంభించుట తొందరపడుట | రభతే |
| వల్ - సంవరణే = కప్పుట | వలతే |
| వ్యథ్ - భయ సంచలనయోః = భయపడుట, కలతచెందుట | వ్యథతే |
| శద్ (శీయ్) - శాతనే = విశీర్ణమగుట | శీయతే |
| శృధ్ - శబ్దకుత్సాయామ్ = విత్తుట | శర్ధతే |
| స్ఫాయ్ - వృద్ధౌ = వర్ధిల్లుట | స్ఫాయతే |
| స్యన్ద్ - ప్రస్రవణే = స్రవించుట | స్యన్దతే |
| కమ్ - ఇచ్ఛాయామ్ = కోరుట | కామయతే |

(ఉభయపదులు)

| | |
|---|---|
| వ్యే - సంవరణే = కప్పుట | వ్యయతి - వ్యయతే |
| శృధ్ - ఉన్దనే = తడపుట | శర్ధతి - శర్ధతే |

(రెండవగణము - పరస్మైపదులు)

| | |
|---|---|
| వీ - గతి, వ్యాప్తి ప్రజన, కాన్త్యసన, ఖాదనేషు=పోవుట మొ | వేతి |
| వశ్ - కాన్తౌ = కోరుట | వష్టి |

(నాల్గవగణము - పరస్మైపదులు)

వ్యధ్ - తాడనే = కొట్టుట — విధ్యతి

రుష్ } - హింసాయామ్ = హింసించుట — రుష్యతి
రిష్ } — రిష్యతి

రధ్ - హింసాసంరాధ్యోః=హింసించుట, నిష్పన్నమగుట — రధ్యతి

స్నుహ్ - ఉద్గిరణే = వాంతిచేయుట — స్నుహ్యతి

(ఆత్మనేపది)

రి - స్రవణే = స్రవించుట — రీయతే

(ఐదవగణము - పరస్మైపది)

చమ్ - భక్షణే = తినుట — చమ్నోతి

(ఆరవగణము - పరస్మైపదులు)

వ్యచ్ - వ్యాజీకరణే = మోసగించుట — విచతి

వ్రశ్చ (వృశ్చ) ఛేదనే = ఛేదించుట — వృశ్చతి

ఋచ్ఛ - గతీన్ద్రియ ప్రళయమూర్తి భావేషు=పోవుట మొ — ఋచ్ఛతి

(తొమ్మిదవగణము - పరస్మైపదులు)

వ్లీ (వ్లి) - వరణే = వరించుట కోరుట — వ్లినాతి

రీ (రి) - గతిరేషణయోః = పోవుట (తోడేలు) అరచుట — రిణాతి

(పదవగణము)

అమ్ - రోషే = రోగము కలుగుట — అమయతి - అమయతే

రుష్ - రోషే = కోపగించుట — రోషయతి - రోషయతే

శృధ్ - ప్రసహనే, హసనేచ=ఓర్చుట, నవ్వుట — శర్ధయతి - శర్ధయతే

2 హలంతధాతువులలో అనిడ్ధాతువులు -

శక్-పచ్-ముచ్-రిచ్-వచ్-విచ్-సిచ్-(ప్రచ్ఛ్)-త్యజ్-నిజ్-భజ్ - భఞ్జ్-భుజ్-భ్రస్జ్-మస్జ్-యజ్-యుజ్-రుజ్-రఞ్జ్ - విజ్ - స్వఞ్జ్ - సఞ్జ్ - సృజ్-అద్-క్షుద్-ఖిద్-ఛిద్-తుద్-నుద్-పద్-భిద్-శద్-స్విద్-స్కన్ద్ - హద్-క్రుధ్-క్షుధ్-బుధ్-బన్ధ్-యుధ్-రుధ్-రాధ్-వ్యధ్-శుధ్ - సాధ్ - సిధ్-మన్-హన్-ఆప్-క్షిప్-ఛుప్-తప్-తిప్-తృప్-దృప్-లిప్-లుప్-వప్-శప్-స్వప్-సృప్-యభ్-రభ్-లభ్-గమ్-నమ్-యమ్-రమ్-క్రుశ్-దంశ్-దిశ్-దృశ్-మృశ్-రిశ్-రుశ్-లిశ్-విశ్-స్పృశ్-కృష్-త్విష్-తుష్ - ద్విష్ - దుష్-పుష్-పిష్-విష్-శిష్-శుష్-శ్లిష్-ఘస్-వస్-దహ్-దిహ్-దుహ్ - నహ్ - మిహ్-రుహ్-లిహ్-వహ్

పై వానిలో వస్ అనుదానివి మొదటిగణమునందలి ధాతువుగ నిజ్, విజ్ అను వానిని మూడవగణమునందలి ధాతువులుగ పద్, స్విద్, బుధ్ సిధ్ మన్ తృప్ దృప్, పుష్ - అను వానిని నాల్గవగణము నందలి ధాతువులుగ ఒక విద్ ధాతువును ఆరవగణమునందలి ధాతువుగ మరియొక 'విద్' ధాతువును ఏడవగణమునందలి ధాతువుగను గ్రహింపదగును

3 రెండవ విధమగు ఉజంత రూపములనుబొందు పుషాదులు -

నాల్గవగణమునందు పుష్-పుష్టౌ' అను ధాతువు మొదలు గృధ్-అభికాంక్షాయామ్ అను ధాతువువరకునుగల 64 ధాతువులు పుషాదులనబడును ఇందు 'శక్ ధాతువు మాత్రమే ఉభయపది. దాని పరస్మైపద ఉజంతరూపము మాత్రమే రెండవవిధమున నేర్పడును తక్కిన ధాతువులన్నియు పరస్మైపదులే

'పుష్ - శుష్ - తుష్ - దుష్ - శ్లిష్ - శక్ - స్విద్ - క్రుధ్ - క్షుధ్ - శుధ్ - సిధ్ - రధ్ - నశ్ - తృప్ - దృప్ - ద్రుహ్ - ముహ్ - స్నుహ్ - స్నిహ్ - శమ్ - తమ్ - దమ్ - శ్రమ్ - భ్రమ్ - క్షమ్ - క్లమ్ - మద్ - అస్ - యస్ - జస్ - తస్ - దస్ - వ్యుష్ - ప్లుష్ - బిస్ - కుస్ - బుస్ - ముస్ - మస్ - లుఠ్ - వచ్ - భృశ్ - భ్రంశ్ - వృశ్ - కృశ్ - తృష్ - హృష్ - రుష్ - రిష్ - డిప్ - కుప్ - గుప్ - యుప్ - రుప్ - లుప్ - లుభ్ - క్షుభ్ - నభ్ - తుభ్ - క్లిద్ - మిద్ - క్ష్విద్ - ఋధ్ - గృధ్'

4 రెండవ విధమగు లుఙంతరూపములను బొందు ద్యుతాదులు -

మొదటిగణమునందు 'ద్యుత్ - దీప్తౌ' అను ధాతువు మొదలు, 'కృప్-సామర్థ్యే' అను ధాతువువరకునుగల 23 ధాతువులు ద్యుతాదు లన బడును ద్యుతాదులు సహజముగ ఆత్మనేపదులు కాని 'ద్యుద్భ్యోలుఙి' - అను పాణిని సూత్రముచే వీనికి లుఙ్నందు పరస్మైపద ప్రత్యయములు కూడ వికల్పముగా విధింపబడినవి. - అందు పరస్మైపద లుఙంతరూపములు మాత్రమే వీనికి రెండవవిధమున నేర్పడును

'ద్యుత్ - శ్విత్ - మిద్ - స్విద్ - క్ష్విద్ - రుచ్ - ఘుట్ - రుట్ - లుట్ - లుఠ్ - శుభ్ - క్షుభ్ - నభ్ - తుభ్ - స్రంస్ - ధ్వంస్ - భ్రంస్ - స్రంభ్ - వృత్ - వృధ్ - శృధ్ - స్యన్ద్ - కృప్'

5 రెండవవిధమగు లుఙంతరూపములను బొందు ఌదిత్తులగు ధాతువులు -

'గమ్ - ఘస్ - పత్ - శద్ - సద్ - సృప్ (మొదటిగణము - పరస్మైపదులు) విష్ (మూడవగణము - ఉభయపది), శక్ (నాల్గవ గణము - ఉభయపది) ఆప్ - శక్ (ఐదవగణము - పరస్మైపదులు):

